నలువుగఁ బోఁచెమేలనుచు ♦ నాథుఁడొనర్పఁగఁబల్కునవ్వన
ప్పలుకులకుల్కులాడినను ♦ భవ్యకవిత్వధురీణుఁ జేయుతన్. ౬.

మ. రదఘాతోత్థితరాజతాచలరజో ♦ వ్రాతంబునిండారుకొ
ముదిరైదిక్కులఁ బిక్కటిల్లఁదనకొ ♦ మ్మంజిమ్ములన్ వీడుపె
ల్లదివిన్ జందురుఁడై వెలుంగమదలీ ♦ లావప్రఖేలారతిన్
ముదముంగాంచు కరీంద్రవక్త్రుఁడుశుభం ♦ బుల్మాకుఁగావించుతన్. ౭.

మ. హరినాభిన్ జనియించు నబ్జజుఁడు బా ♦ ల్యక్రీడనాసక్తిబం
ధురభోగాగ్రవిరత్నరత్నరుచిసం ♦ దోహైకవాంఛాప్తిత
ద్భరణోద్యుక్తతచేరఁ జించినఫణా ♦ వ్యాసక్తపద్మస్రగా
భరణశ్రీరహిఁజెందు శేషుఁడు వచః ♦ ప్రాగల్భ్యమిచ్చుంగృపన్. ౮.

క. ఏమునివచనసుధాబ్ధి, న్రామాయణసుధజనించి ♦ నానాకథక
ప్రేమాస్పదమైదనరెడు, నామునిహృతజనతమిస్రి ♦ యామునిఁ గొలుతున్. ౯.

ఉ. సారపయోధరప్రకర ♦ సాంద్రతనుద్యుతిజాలుఁబల్లవ
స్ఫారజటావిశాలుమృగ ♦ చర్మనివిష్టితచేలుఁ బ్రాగ్వచో
వారిధియానపాత్రుసుర ♦ వందితదివ్యచరిత్రునాత్మవి
ద్యారమణీవిధేయునన ♦ పాయునిసాత్యవతేయుఁ గొల్చెదన్. ౧౦.

సీ. ఉపమానకల్పనా ♦ నుపమానచాతురీ, ఘనమనీషోల్లాసుఁ ♦ గాళిదాసు
లలితపదన్యాస ♦ కలితప్రబంధైక, తానతానుకవితా ♦ దండిదండి
సారస్యాగమితార్థ ♦ గౌరవాధారతా, రవిరుచిసాంద్రుభా ♦ రవికవీంద్రు
సకలార్థకల్పనా ♦ వికలాంతసాహితీ, శ్లాఘనీయరసైక ♦ మేఘమాఘు
నద్భుతకవితామహాచార్యు ♦ నన్నపార్యు, సుకవిజనసంస్తుతిక్రాజి ♦ సోమయాజి
నఖిలబుధజనశేషినె ♦ జ్ఞానమనీషి, నెంతుఁ బ్రార్థింతు సేవింతు ♦ హితముఁగాంతు.

క. మేఘవిలాసనసంభృతిఁ, మాధవపర్యంకభోగి ♦ మండనసమరూ
పాధునికకవిప్రరేణ్యుల, సాధువచోనియతిఁదలఁచి ♦ నన్నుతిసేతున్. ౧౨.

తే. సత్కవీశ్వరు నెదుగంగఁ ♦ జాలకవలఁ, జెందుకూతలెవహరాయను ♦ జెనఁటిమొఱకు
మస్తకరివంభవిదళనో ♦ ద్వృత్తహరిని, మొనయులెకనుసుకవులు ♦ మొఱుగుసటుల.

వ. అని యిష్టార్థంబున నిష్టదేవతావందనరూపమంగళాచరణంబును, బురాతనకవిజనాను
సరణంబును, నిదానీంతనకవిపురస్కృతియును, గుకవితిరస్కృతియునుం గావించి

యే నొకకృతిని నిర్మింపం గోరి మురారిహృదయప్రసాదంబు నభిలషించి యున్నతఱి నొక్కపూర్వరాత్రంబునఁ బ్రభాతసమయంబున. ౧౪.

మహాస్రగ్ధర. చరణానమ్రామృతాంధ ♦ శ్చరమకుటతటా ♦ సక్తముక్తాఫలాళీ
పరితోషించద్బుద్బుదాతి ♦ ప్రచురపదయుగ ♦ స్ఫారగంగాంబుధారా
పరిపూతానేకలోక ♦ ప్రకటితసుభగం ♦ భావుకాఖ్యాసమాఖ్యా
భరణశ్రీభ్రాజిష్ణుఁడై చొ ♦ ప్పడుచు నెదుటఁగ ♦ న్పట్టెశ్రీకృష్ణుఁడంతన్.

క. కనుపట్టినయాతనిపద, వనజంబులుశిరముసోఁక ♦ వసుధాస్థలిపై
వినయమునమ్రొక్కిమిక్కిలి, వినియతమతినగుచుఁజిన్న [illegible]వించితినిటులన్. ౧౬.

భుజంగప్రయాతము. అరిస్ఫారసంఖ్యశ్య ♦ హస్తారవిందా
సరోజాలయాస్యాబ్జ ♦ చంచన్మిళిందా
శరాపారనిర్భిన్న ♦ వృందారిబృందా
వరాజంగమాజస్ర ♦ సంప్రార్థితుండా. ౧౭.

సీ. సనకాదిమునిమనో ♦ జలజనిత్యనివాస, కమనీయతరదివ్య ♦ కనకవాస
దానవాధీశదం ♦ తావళీహర్యక్ష, శ్రీపదలాక్షాపి ♦ చిత్రవక్ష
వ్రజవధూవశానసనాం ♦ బుజలోలమదభృంగ, కారుణ్యరసఝరీ ♦ కనదపాంగ
నానాత్వసమతీత ♦ నైజసంపద్రమాప, శమితలోకాఘపే ♦ శార్ఙ్గచాప
వినతజనబృందమందార ♦ వేదసార, విదితభువనావనాధార ♦ ఖేదవిదూర
నీలరుచిపాత్రకళేబరము ♦ పద్మనేత్ర, కోకరిపుమిత్రనేత్రర ♦ మాకళత్ర. ౧౮.

క. అనియిట్లుసన్నుతించిన, ననుఁగనుఁగొని మురరిపుఁడు ఘనఘను ♦ నాథుఁడుగర్జా
జనితగభీరస్వరమునఁ, గనుఁగొనలదయారసంబు ♦ గిరలుకొనంగన్. ౧౯.

పంచచామరము. తిరంబుగా భవత్కృపా ♦ దిరక్తిమ్యక్తివ్యనా [illegible]
[illegible]కమూలదసారఘా ♦ నస్పదంబునాగ్నఁగ[illegible]
గరంబునీ చనప్పునవ్య ♦ కావ్యథిప్యమం[illegible]
ధరింపఁగోరి నాదమూశ ♦ [illegible]పూర్వమాపయిన్. ౨౦.

క. దీవన్ మేలగునీకని, యీవిధవదనాయుతాక్షుఁ ♦ డంతర్హితుఁగాన్
నేనునుగ్రమ్మఱ మేల్కని, మానసమాశ్చర్యజలధి ♦ మగ్నముగాఁగన్. ౨౧.

తే. బ్రహ్మరుద్రాదులకు నేని ♦ బడయరాని, విభునియలదివ్యమంగళ ♦ విగ్రహంబు
భళిరనాదృష్టిపథమున ♦ నిలిచెననిన, నెంతనాభాగ్యమహిమంబు ♦ నీడుగలదె. ౨౨.

తే. సారతరతత్త్వపారస ♦ ధారవార, ఘనతనా శేముషీలత ♦ కందళించి
బుధనుతవచోవిలాసమ ♦ పూలుపూయ, దానవాతనిఁబూజింపఁ ♦ దగవకాదె.

వ. అని నిశ్చయించి యేనును హర్షతరంగితం బగునంతరంగంబున నహస్ముఖోచితకృత్యమ్ములు నిర్వర్తించి వివిధసద్గుణసమన్వితుండును విద్వజ్జనపరివృతుండును మహితవిజ్ఞానజనకుండును మదీయజనకుండును నగునక్కమహామాత్యునిసమీపంబునకుం జని సముచితప్రకారంబున నతనిచరణారవిందంబులకు వందనం బాచరించి యరవిందలోచనుండసన్నిధి యొనర్చి యానతిచ్చినతెఱంగెఱింగించిన నమ్మహానుభావుండును నద్భుతరసమ్ము గ్రమ్ముకొనుహృదయమ్మున తనసమీపమ్మున నున్నవిద్వజ్జనమ్ముల నుపలక్షించి వారును గుతూహలంబున నన్నుం గనుంగొని యిట్లనిరి. ౨౪

సీ. వెన్నపాల్కిటిదమ్మి ♦ గన్నవేలుపుతోఁడు, తెలిపుల్గువయ్యాళి ♦ నలరువాఁడు
బయకారిజడదారి ♦ పాపనిగనువాఁడు, పలుకుచిల్కలకొల్కి ♦ పాలివాఁడు
చావంచతూపుల ♦ సైదోడుగలవాఁడు, ప్రామిన్కులేప్రొద్దు ♦ నోము వాఁడు
నుదుటఁగన్నలవాని ♦ నుదుటఁగాచినవాఁడు, జగములఁగలిగించు ♦ చతురులాఁడు
తూర్పుదొరవేడివేలుపు ♦ దుంతరాతు, రేయినడకరిసంద్రంపు ♦ జేఁడుగాడ్పు
లిబ్బిదొరగిబ్బనెక్కుడు ♦ గబ్బిమగఁడు, కొలువఁదనరుచునుండును ♦ నలువయపుడు.

ఉ. ఆతనిమానసంబునను ♦ హోమహులౌమునివర్యులుత్తమ
ఖ్యాతగుణాఢ్యులాగమస ♦ దాఢ్యయనప్రతిభావిశేషసం
జాతమహత్త్వతత్త్వవిల ♦ సద్ఘనబోధులశేషశాస్త్రని
ష్ణాతులుకొందఱీజగతి ♦ నన్నుతికెక్కిరివారిలోపలన్. ౨౬.

క. శ్రీవత్సనామధేయుఁడు, ధీవిశ్రుతసుజనతావి ♦ ధేయుఁడుజగతిన్
బావనుఁడైబుధకృతసం, భావనుఁడైతనరునతని ♦ వంశమునందున్. ౨౭.

చ. కలిగిరికొందఱిందుకర ♦ కంపళిచంద్రనితారవిందని
ర్మలతరహారహీరశర ♦ రాజితభూధరశారదాభ్రమం
జులతరకీర్తిపాత్రులువి ♦ శుద్ధచరిత్రులులోకమిత్రుల
త్యలఘుకళాసమార్జితద ♦ యారసనిత్యులమాత్యులిమ్మహిన్. ౨౮.

క. వారలలోగణపార్యుఁడ, వారితమేధావిహార ♦ వాచస్పతియై
చారుతరకీర్తిసంపద, చేరూఢికిసెక్కజగమ ♦ శేషముమెచ్చన్. ౨౯.

క. ప్రణుతద్విజరాజశిఖా, మణియైసార్వజ్ఞసాధి ♦ మనహీనలస
ద్గుణగరిమఁదనరివెలయున్, గణపతిసచివుండుప్రమథ ♦ గణపతియనఁగన్. ౩౦.

ణాయుక్ బెద్దలఁగన్నయంతమదివే ♦ డక్కల్ మీఱఁగా మేలుదీ
ర్ఘాయుశ్శ్రీనిధికోటయార్యుఁడనువి ♦ ఖ్యాతింబ్రకాశింపవే. ౪౧.

సీ. తల్లిదండ్రులకన్న ♦ దైవంబుమఱివేఱె, కలదెయుంచుఁదలంచు ♦ ఘనమనీష
విద్వజ్జనామోద ♦ విస్మయావహముగాఁ, గృతులొనర్పఁగఁజాలు ♦ నతిశయంబు
స్వామికార్యైకని ♦ ర్వాహసామర్థ్యంబు, వెలయింపఁజాలువి ♦ వేకపటిమ
సజ్జనుల్ తను మెచ్చ ♦ సంతతాచారప్ర, వీణతవర్తించు ♦ విమలబుద్ధి
కలిగివిలసితసత్కీర్తి ♦ కల్పవల్లి, ఘనసుమఫలాయమానన ♦ క్షత్రనివహ
కుముదజాహితమండలి ♦ సమరితేపుడు, శాశ్వతగుణైకధుర్యకో ♦ టీశ్వరార్య. ౪౨.

మ. తనయుక్ గోటయమంత్రినీవగు సము ♦ ద్యల్లేఖినీశ్లాఘనీ
యనినాదంబుకుతూహలాతిశయన్ను ♦ త్యర్థాత్మసీమంతినీ
కనదంఘ్రిద్వయరత్ననూపురఝణ ♦ త్కారానుకారానురం
జనవత్సారసునిస్వనంబయిన్నపా ♦ స్థానంబులందెంతయుక్. ౪౩.

క. ఈవిధమునబాంధవసం, భావితగతిఁదనరుపుత్త్రి ♦ పౌత్త్రిసమగ్ర
శ్రీవిలసిల్లెదుభువిరా, జీవాక్షునికరుణఁజెంది ♦ స్థిరతరకీర్తిక్.

తే. కానహరియానతిచ్చిన ♦ కరణినీవు, హరువుమెఱయంగసత్కృతి ♦ పరిణయంబు
కృతివినిర్మించియతనికిం ♦ కితముసేయు, మఖిలశుభములుగలుగునీ ♦ కతనికృపను.

వ. అని సబహుమానంబుగా విద్వజ్జనం బానతిచ్చిన నేనును మహాప్రసాదం బని వారల వచనంబు లంగీకరించి పరమహర్షతరంగితాంతరంగుండ నగుచు నవ్విరించిజనకునకు ముఖోల్లాసకరంబుగా భోజకన్యాపరిణయం బనుమహాప్రబంధంబు రచియించి యీకృతికి నపరిమితకృపావిశాలుండును, నాశ్రితభరణశీలుండును నగుగోపాలుండే నాయకుండు గావలయు ననుదృఢాధ్యవసాయంబున నమ్మహాత్మునకును. ౪౬.

## షష్ఠ్యంతములు.

క. శ్రీరుచిరదివ్యదేహున, కారూఢపురాణవాక్య ♦ యద్వాహునకుక్
గారుణ్యపరీవాహున, కారుణ్యలసద్దృగబ్జ ♦ హతమోహునకుక్. ౪౭.

క. కరుణాశరధికివికలిత, తరుణాశరధికిసమగ్ర ♦ తరశరధికిస
త్వరితభుజంగాశరధికి, నిరవధిగుణనిధికిశుభద ♦ నిజసన్నిధికిక్. ౪౮.

క. చాణూరక్షోణీభృ, త్పాణిగరుడ్వదళనైక ♦ పరసురపతికిక్
వాణీశగ్వాణీగీ, ర్వాణీవరవర్ణనీయ ♦ వైభవధృతికిక్. ౪౯.

క. రక్షోహతరక్షోచిత, పక్షోర్జితపత్రునకును ♦ ప్రత్యర్థివసా
కుక్షింభరకాత్ఞేయక, శిక్షితమధుసూదనశిఖర ♦ జిహ్మాస్త్రునకున్. ౫౦.

క. ప్రాజితబలభద్రునకున్, శ్రీజితసుభద్రునకుఁ గాండి ♦ వికన్యపపున
ర్వ్యాజితభద్రునకున్ని, ఘ్యాజితభద్రునకుసరస ♦ గుణముద్రునకున్. ౫౧.

క. రాధావధూమణీముగు, రాగరసీధురసనంత ♦ తాస్వాదకళా
బోధవరిలునకున్ బహు, గోధనలోలునకుఁగపట ♦ గోపాలునకున్. ౫౨.

వ. సమర్పితంబుగా నా యొనర్పం బూనిన భోజకన్యాపరిణయం బనుమహాప్రబంధంబు
నకుఁ గథాక్రమం బెట్టి దనిన. ౫౩.

శా. శ్రీగోపాలకనైకలోలుఁడు పరీ ♦ క్షిద్భూమిపాలుండు స
ర్వోగ్రప్రాజ్యచరిత్రు వ్యాసము నిపు ♦ త్త్రింబూచి యోవ్యాసనివ
ర్యగీర్వాణాయ మెన్నభోజన్నపక ♦ న్యం దెచ్చినున్ గోరెనే
లాగర్తిన్ వరియించెఁ దెల్పుమనిన ♦ లర్కున్ బాసుండిట్లనున్. ౫౪.

మ. విలసత్స్వర్ణశాలకేతనపటా ♦ నిర్ధూతవాతాహతో
న్మిలితాంభోధరగర్భనిర్గళితనం ♦ దన్మించలాశేముషీ
కలనాకర్ణిదభ్యర్యర్గ్యసిచర ♦ త్యంతాసితాంతప్రభా
కలితంబై యలనొప్పు ద్వారవతి నాఁ ♦ గాఁబట్నం బెంతయున్. ౫౫.

తే. లోనికోటయొవలయాగ్రి ♦ దానికవలఁ, గలుగుబలుకోటబ్రహ్మాండ ♦ కర్పరంబు
పరిఖజలపూరమవలియా ♦ వరణజలము, తోఁపులవ్వలి యిరులు నై ♦ తోఁచు బుద్ధిని. ౫౬.

క. సన్నుతచారుస్త్రుల, కన్నగరిబునికియగుట ♦ ననపాయుతోచే
యున్నిన్నాఁగాఁగా, పున్నితంబనాఁబరిప ♦ యొప్పారుచురక్తిన్. ౫౭.

సీ. అనగరంబువప్రమున ♦ శాప్పలిప్సమణిగిత్తిరుసం
భోనిధిసారునేస్సుడుసఁ ♦ బొంకలుగా మిఁప్రబల్ప్రిమింపేగా
నానలినోద్భవుండు నిఁపి ♦ బాంబునిర్తి జలనిర్ కానసం
బూనిచిమ్ముద్రవేయఁగఁ ♦ ముద్రియు నాఁగనునాత్మిబుద్ధునున్. ౫౮.

తే. తటఘటిదిపప్స్మనాగనం ♦ తానబ్దిప నలుముకోనఁగఁగనిఁగిఁదాల్చి ♦ జలముపోలుదు
విన్పఁగల్యాణయుముఁబుఁ ♦ బన్నసోర, బంబుపరంగఁదనువసం ♦ తంబనంగ. ౫౯.

తే. హరిదిబంగిదనిగనిగల్ ♦ దవలఁగమరఁ బోరలు సౌనంబుతెవ్రుమున ♦ ప్పారమునందుఁ
దన్నగగలక్ష్మికటిశటిఁ ♦ దాల్చినట్లి, మేనిమొలనూలిగంటల ♦ చాలనంగ. ౬౦.

క. మగరాసంతతిమేడల, నిగనిగలందనరునచటి ♦ నీరేజాస్యల్
తగుపాలకడలిఁబొడమిన, మగువలగతిఁబొలుతురనుప ♦ మానశ్రీలన్. ౬౧.

సీ. సారహీరప్రభా ♦ సౌరాపగాలోక, నాయాతసురతాప ♦ సాప్వతములు
భుజగభుక్మణివిభా ♦ పూరఘనాసాంకూర, మందయానధురీణ ♦ మైత్రహరులు
శతమఖరత్నచం ♦ చద్దీప్తనీలాబ్జ, హరణోత్సుకస్వర్గ ♦ యావతములు
పద్మరాగద్యోత ♦ పారిలోహితవప్ర, శుద్ధనూద్యద్దివ్య ♦ కుంజరములు
సంచరచ్చంచలద్పగాస్య ♦ సత్పరిశాళ, శైశిరశశాంకదర్పన ♦ జాతహర్ష
నికటచరదుడుభయనత ♦ నిఖిలభీగ, సస్మితదృగబ్జగతులుత ♦ త్సౌధతతులు. ౬౨.

చ. పురబహిరంగణస్ఫురిత ♦ పుష్పవనీలసమానసూనబం
ధురమకరందబిందుచయ ♦ తుందిలమందనటన్మిళింద మే
దురరవభృత్తుషారరవ ♦ దుర్భరనిర్భరచూతపోతసం
కరగతిఘూర్ణహంబుమృదు ♦ గంధవహంబలరున్బురంబునన్. ౬౩.

క. తేజమునున్నతియుంగని, వేఁజేరెడుఘనులతగులు ♦ వీడని వేడ్కల్
రాజులకున్దత్పురిగృహ, రాజులకున్సైన్యజమగుచు ♦ రాజిలునెపుడున్. ౬౪.

సీ. సత్త్వసంపదరాజ ♦ సములేనిచతురాస్యు, లాసురాలయమొంద ♦ నట్టిబుధులు
తమిఁబూనితేజముల్ ♦ దఱుఁగనిసూరులు, నరసంస్తుతికిఁబోని ♦ పురుషవరులు
నుగ్రభావముఁజెంద ♦ కుండుసర్వజ్ఞులు, సద్ధర్మమెడలని ♦ జాతవేదు
లురుహరభక్తినే ♦ మఱనికళానిధుల్, పతుఁపాతములుంచొ ♦ ప్పదనిద్విజాలు
సకలశాస్త్రార్థనిశ్చయా ♦ వికలహృదయ, యోగ్యవైరాగ్యసంతతా ♦ భ్యుదయధిక్రియ
తావనీశ్వరదానధా ♦ రాప్రవృద్ధి, దీపకరులౌరయప్పురి ♦ విప్రవరులు. ౬౫.

ఆ. కొ[illegible]తందనాల ♦ గొడవలనూరూర, దినముఁదిరుగుచుండుఁ ♦ దనకులంబు
నదుముమవ్రప్రయోజ ♦ నంబయ్యెననిబ్రహ్మ, నగుదురచటిబ్రాహ్మ ♦ ణప్రవరులు. ౬౬.

ఉ. ఆనగరిన్మహీసురు ♦ లహర్నిశముఁరచియించమించుహో
మానలధూమమభ్రమున ♦ నభ్రతఁగప్పడుభర్మహర్మ్యసం
తానములన్మెలంగునెలఁ ♦ తల్నెఱమించులుగాఁగవారిదం
బూనినమూర్తిశంపుసర ♦ ముల్వడిగండులునైతనర్చుఁగన్. ౬౭.

సీ. అరిలోచనానకపట్ల ♦ వెనుతియ్యరనికాక, శతమఖాత్మజులంచుఁ ♦ జాటరాదె
పుణ్యజనాళినో ♦ ప్పటకోపరనికాక, దశరథాత్మజులంచుఁ ♦ దలఁచరాదె

సీ. వలరాచజగడాలఁ ♦ గళలంటికరఁగించు, జాణయీసంపూర్ణ ♦ చంద్రవదన
తరితీపుఁజెయ్యెఁ ♦ దమినిగిడింపఁగాఁ, జాలునోయ్యారియీ ♦ నీలవేణి
ప్రౌఢలోకవింతనే ♦ ర్పులకూటమిఘటించు, కొమ్మయీజక్కువ ♦ గుబ్బలాడి
కనుఁగొనినంతనే ♦ మనసుపుట్టఁగఁజేయు, ప్రోడయీజాళువా ♦ పైఁడిబొమ్మ
యనుచుఁదమలోననిజవిభ్ర ♦ మాతిశయముఁ, గనివిటులుచిత్రవాక్యసం ♦ గతులనాడ
హావభావవిలాసవి ♦ హారపరత, వెలవెలందులుబొలుతుర ♦ ప్పీటియందు. ౨౬.

సీ. కమలంబుమారొక్కనం ♦ గావచ్చునేయన్నఁ, దెలినెమ్మొగమ్ములు ♦ ద్రిప్పికొనుచుఁ
జిగురంటిచూడంగ ♦ నగునశేయునఁగఁగెం, గేలిసైగలనంటఁ ♦ బోలదనుచు
నలరుబంతులుచూడ ♦ నగునశేయునజాలు, జిలుఁగుపయ్యెదఁజక్కఁ ♦ జేర్చికొనుచు
మంకెనవిరియెల ♦ మాటెదేయునటు, పైఁటకొంగుఁమోవి ♦ మాటికొనుచు
విటులనర్మోక్తులెతేఁగియ ♦ న్వితమునను, దారొడంబడనటులనే ♦ తమవిలాస
చేష్టలనువారికోర్కులు ♦ చిందుద్రొక్కఁ, నలసులమ్ముదురప్పీట ♦ నలరుఁబోంట్లు.

ఉ. పల్లవరాగయుక్తములు ♦ బంతులురెండిపిపైఁటచాటుగా
నల్లనమాటిరెయొంటిసర ♦ మమ్మినకొందురెకొమ్మప్రొద్దువ్రోఁ
గొల్లగఁవోఁమనొక్కరున ♦ కుఙ్గయికానుకనేతుగానవా
మొల్లమినిబ్బడిత్తునవి ♦ ముట్టఁగనిమ్మనసైఁగనవ్వుచుఙ్. ౨౮.

క. పూవులువిలుతురుతమతమ, ఠీవులుయువకోటికిఙ్గ ♦ డిందితమకముఙ్
గావింపఁగఁబురవనితలు, భావింపఁగమరునిదండి ♦ బారుంబోలెఙ్. ౨౯.

క. అప్పురము నేలుఁగృష్ణుఁడు, గిప్పగిపుఙ్రజమువ్రాలెఁ ♦ గడఁగినిజయశం
బుప్పతిలిదెశలఁగప్పిక, కుప్పతిసతులకుదుకూల ♦ కోటిఘటింపఙ్. ౩౦.

సీ. ఘనమైనధృతిచేత ♦ జనులనందఱఁబ్రోచి, తామేటివిఖ్యాతిఁ ♦ దనరఁగాంచి
భూదారమహిమచేఁ ♦ బొగడొందెజనముల, నరసింహవిస్ఫూర్తి ♦ నుపవణించి
బలినిరాకరణత ♦ త్పరతివన్నెయకెక్కి, శరణాగతత్రాణ ♦ విపనయాని
భూపరదానైక ♦ బుద్ధిచేవిలసిల్లి, కలిమిననంతభో ♦ గములనలర
వెలయులోకజిహాటోప ♦ విభవమంది, ధర్మసంస్థాపనార్థమై ♦ దాడివెడలి
తనరుబహురూపధారణో ♦ దారవీర, ధర్మమయహీరకంకణ ♦ ధారినౌర. ౩౧.

శా. నీలాంభోధరభాసురాంగుఁడుదళ ♦ న్నీరేజపత్రోల్లస
త్ప్రోలంబాధికనీనికావిలసితా ♦ క్షుమ్రైకశృంగారిభా

గ్యాలీఢాసమసాయకప్రణిహితా ♦ ద్యంతాస్త్రుఁడబ్జోదయా
ద్వేలాంభోధిలసద్దయాకరుఁడనన్ ♦ దీపించుఁగృష్ణుండటన్. ౮౨.

సీ. ఆర్ద్రాంతరంగత ♦ నలరునీతఁడటంచు, ద్విజరాజుసాక్షిగాఁ ♦ దెలుపవచ్చుఁ
గరుణారసాపూర్ణ ♦ కలితనేత్రుఁడటంచు, భానుఁడుసాక్షిగాఁ ♦ బలుకవచ్చు
భవతమోవిదళన ♦ ప్రౌఢవక్త్రుఁడటంచు, ననలుండుసాక్షిగా ♦ నాడవచ్చు
సకలజీవావన ♦ ప్రకటనుఁడటంచు, శ్వసనుండుసాక్షిగాఁ ♦ జాటవచ్చు
నౌరచల్లనిహృదయము ♦ గ్ఘూరెకరుణ, మేలువిమలతభళిరవి ♦ శాలమహిమ
యనఁగనుతికెక్కె నిజభక్త ♦ వశమనూజ్ఞ, మాధవుండసాదనరుర ♦ మాధవుండు. ౮౩.

క. ఈరీతినలరియదుపతి, భూరిరఖ్యాతి నెగడఁ ♦ బోలుపునీతిన్
ధారుణిమోదఁగననారత, సారతనైశ్వర్యసర్య ♦ దర్యాలనుండన్. ౮౪.

తే. ఉండుతఱినొక్కనాఁడతం ♦ డుదయవేళ, నతులగాయకగచితగీ ♦ తామ్మపింబు
నలమిపోషితశరవా ♦ గన్నుతరసము, చెవులపండువుసేయను ♦ త్సవముమీఱ. ౮౫.

క. కేళీగృహముల్ వెలువడి, శ్రీలామణి మోస్తుపసిఁడి ♦ చామలదోమగన్
లీలాగతినరిగిమణీ, జ్వాలాస్పృతమైనయుబ్బ ♦ పస్పరమంగున్. ౮౬.

క. అంగనలుంచినచొక్కపు, బంగరుపీటన్ వసించి ♦ బహుమతియలరన్
పుంగలఁవోఁదుమహీసుర, పుంగవయుగ్యుజనుపవినయ ♦ మునఁగేల్మోడ్చన్. ౮౭.

తే. కేలుమోడ్పుఘటించిబా ♦ గాలఁవంగి, పనిచితినచెక్కటద్దంబు ♦ ప్రభలు మేలొ
దీనిప్రభమేలొపరికించి ♦ తెలుపుమనిన, దాగినొకనాఁడెపట్టిన ♦ దర్పణమున. ౮౮.

సీ. చిగురాకుమోవిపైఁ ♦ దగుపద్విపలునొక్క, నిడువాలుఁగన్నులు ♦ నిదురనొక్క
కొనగుబ్బపోటునఁ ♦ గుమ్మైపోయినయుక్క, నెల్లవంకలఁబరాము ♦ తఱుకుఁజొక్క
చిటిలుగంగ ముక్కోడి ♦ జినిగ్రైవనదిక్కు, మినిమిగుప్పుతీంగనొఁను ♦ పప్పుటెక్క
పూవింటిదొరకయ్య ♦ మునఁగోఁచుబలుటెక్క, తెఱఁగిఁముగ్గారార ♦ భరము నిక్క
నెరయఁగనుపట్టుతనజాడ ♦ నీడఁజూచి, మొలకనవ్వులుగనువోయి ♦ మొలకలెత్త
మేటిసొగసునమీసాలు ♦ గిటికొనుము, కోరిపలుదోమికొనియెనొ ♦ య్యారముగను.

మ. ఒకనారీమణియిచ్చుకేలఁదనకే ♦ లంటించిచీలాగతి
న్వికచాంభోరుహలోచనుండపుడు నా ♦ స్ప్రభూతనీలాశ్మత
న్నికటానష్టసమృష్టహీరమణిస ♦ త్పజమిత్రాత్మజా
ప్రకటాశ్రీకాళిధునీనిదానసదనో ♦ పాంతంబుస్నానార్థమై.

శా. భామల్ రెండుకెలంకులన్ మణిలస ♦ త్పాత్రమ్ములంబూనుచున్
సామోదాతిహిమాంబువుల్ గురియఁబ ♦ ద్మాక్షుం డెసంగంగడున్
సోముండప్పుడుసాంధ్యరక్తిమలచే ♦ సొంపొందిప్రాక్పశ్చిమ
క్ష్మామశ్రీలను జెందఁజుక్కగమితో ♦ దీపించువిన్వీథినాన్. ౯౧.

ఉ. మజ్జనశాలనిల్పుటయు ♦ మానినులప్పుడు పైఁడికుండలం
గొజ్జఁగినీరునించియతి ♦ కోమలపాణిరసాలపల్లవా
సజ్జితమైచెలంగఁగుచ ♦ శైలభరానతమధ్యభాగలై
పజ్జకుఁజేరిమజ్జనము ♦ హాటిలఁజేసిరికంసవైరికిన్. ౯౨.

చ. మదనునితండ్రితత్సమయ ♦ మంత్రపురస్కృతినుక్తరీతిమై
సదమలవారిపూరమున ♦ సంప్లుతుఁడైతదనంతరంబునన్
మదవతియొూర్తుపావడను ♦ మైతడియొత్తఁగధౌతవస్త్రముల్
సుదతియొకర్తువేయొసఁగఁ ♦ జొప్పడరన్ ధరియించియంతటన్. ౯౩.

ఆ. శాతకుంభపీఠ ♦ సజ్జీకృతాసన, లసితచిత్రకంబ ♦ ళంబుమీఁద
హర్షమొదవనప్పు ♦ డాసీనుఁడైనిత్య, కర్మవిధులొనర్చెఁ ♦ గంసవైరి. ౯౪.

సీ. స్వస్తికాసనయుక్తి ♦ సమకూర్చియామీఁద, భుజములురమ్మున ♦ బొడవుచేసి
కరములూరువులందు ♦ ఘటియించిపొందుగా, నాసాగ్రమునదృష్టి ♦ నాటఁజేసి
పవనకుంభకవృత్తి ♦ బంధించిభుజగక, న్యకనిద్రమేల్కొను ♦ నట్లొనర్చి
గ్రంథులుసడలించి ♦ కమలముల్ భేదించి, వేయురేకులతమ్మి ♦ విప్పుకొలిపి
యందుఁబ్రకృతిపురుషులకుఁ ♦ బొందుగలుగఁ, జేసితదమృతసంప్రాప్తిఁ ♦ జెందియంగు
మీఁదఁదాదాత్మ్యసంపత్తి ♦ మైఁబసియపుడు, జపవిధానంబు వెలిపెను ♦ జక్రధరుఁడు.

చ. తనకధివాసమైతనరు ♦ తామరసాప్తునిబ్రహ్మభావనా
వినుతిఁబ్రహృష్టుఁజేసితగు ♦ విప్రజనావళికెల్లభక్తితో
ధనమణిగోహిరణ్యవసు ♦ ధాముఖదానములాచరించిచ
క్కనికనకప్రపీఠమునఁ ♦ గంసవిరోధివసించియున్నెడన్. ౯౬.

తే. చేరియలశౌరియాదల ♦ నారియొకతె, హీరమకుటంబునిలుపను ♦ నారకుచుల
మీఁజెనదిభూరిలావణ్య ♦ సారజలధి, పూరమునఁదోఁచుశశిబింబ ♦ మోచునఁగ.

తే. కలికిమృగమదతిలకంబు ♦ కలికియొకతె, కృష్ణుమొగమునదిద్దిన ♦ నెసఁగెమిసిమిఁ
గమ్మవిరిదమ్మితావికిఁ ♦ గ్రమ్ముకొనిన, గండుతుమ్మెదపొంకంబు ♦ గడలుకొనఁగ. ౯౭.

చ. కలుములనీనుకల్కి యను ♦ గబ్బిచనుంగవదాపు పోటులన్
విలసిలి యింద్రనీలమయ ♦ విస్తృతనవ్యకవాటపాటవో
జ్జ్వలమగు నమ్మురాంతకువి ♦ శాలపురఃస్థమ్మున ముత్తియంపుఁజే
రులు దగె నక్తనీరజవి ♦ రోధిసుధాకణమాలికాకృతిన్. ౯౯.

క. రవిఁ దనుభరించుకతమున, రవిఁ దానుభరించులీల ♦ రాజిలఁ దాల్చెన్
బ్రవిమలకౌస్తుభమణియా, దవవంశాంభోధిశీత ♦ ధాముఁడు గడకన్. ౧౦౦.

ఉ. కోమలివయోస్తుచందనముఁ ♦ గుంకుమతోడను గూర్చియంతన
త్తామరసాక్షుమైనలఁదఁ ♦ దద్దయు నొప్పె మనోహరాకృతిన్
సోముఁడు నీరజాప్తుఁడును ♦ జూమ్కులయందు వసించియుండుటన్
గౌముదిఁ గూడి యాతపము ♦ గ్రమ్మి వెలింగెడు నందమొందుచున్. ౧౦౧.

చ. చలనపరత్వమస్థిరత ♦ సత్పథరోధముఁ గాంచి చంచలల్
జలదము నాశ్రయించుటిఁకఁ ♦ జాలునటంచుఁ దలంచి శాంతిచే
నలరి సదాశ్రయుండయిన ♦ యచ్యుతు నెమ్మి నాశ్రయించెనాఁ
జెలఁగెఁ దదీయభర్మమయ ♦ చేలవిశాలమయూఖమాలికల్ చ. ౧౦౨.

వ. ఇవ్విధంబున ననేకమణిమయభూషణజాలంబుల మనోహరమాల్యాంగరాగంబులఁ దగ నలంకృతుండై, ఇరుగడల ముక్తకాశినీమృదులకరకమలదేదీప్యమానధవళచామర ప్రభాకలాపంబు లాననకుముదవనీబంధుబంధురకళావిలాసంబుల చందంబునఁ బరిఢవింప భూసురవర్యలొసంగు దూర్వాంకురయుతాక్షతంబు లుత్తమాంగంబున ధరించి యొక్క వేదండయాన కైదండఁ బూని సుందమందగమనంబున మందరధరుండు కక్ష్యాంతరంబులు గడచి హీరప్రభావ్యజాళీసముదయత్వష్టరాగరుచిఁ జాందురాకారారవిందంబుల నధివసించుచు, మిళిందసందోహంబులం బోగెండి సేయుచుఁ బరిఖచితతపంతరశ్మిప్రతిఫలితబలభిన్మణివితానంబులును, బలభిన్మణిపతనంబు లిందీవరసందోహంబులుగాఁ దలంచి కర్ణావతంసములకై చిదుము గమకించి యచటి రేఱెందు సుధాంధస్త్రీమంతినీనివహంబుల హాసవుఁ దేజరిల్లు రత్నపాంచాలికలం గనుంగొని సరోవరలక్ష్మీవారలపయిం గవయఁ బురడించి సేసవెల్లువలయుల్లాసంబు సెరపుచు సెగియుముక్తాఫలసముల్లసితరంగవల్లీసముదయంబును రంగవల్లీసముదయునిచితవికసితచారుకోరకనివహవిరాజమానంబులకు నలరులకాంతులు విరియించొందు నిగనిగ లనుపందు వెన్నెలల మెండునకు బెండువడి ముకుళితంబు లగుపుండరీకషండంబు లనం దగిన ప్రభాతదీపకళికలఁ దివిరొయుటకుఁ దత్తఱంబున మెలంగునుడిగంపుబిత్తరులమంజీరనినదంబుల వసుక

రించుజలవిహంగమవిరావంబులకుం జొక్కి వియచ్చరపథంబుననుండి యచ్చటికిం దిగు నంచపిండునాఁ దగునుల్లోచసముల్లసితసితవసనవిసరప్రతిఫలనసాంద్రతరచంద్రకాంతి మణిమయస్తంభంబులను, చంద్రకాంతమణిగణప్రభాంకురంబులను, వికస్వరకైరవవా రంబులను, పరిపూర్ణంబు లగుమధురసకణమ్ములం దగినతదంతరాళబింబితగోమేధిక ప్రభాంకురంబుల నలంకృతం బగుకమలాకరం బనం దగి కమలాకరంబయినయాస్థాన మండపంబులు సొత్తెంచి సముచితచిరత్నరత్నఖచితసింహాసనంబునం గొలువుం బుండి బలభద్రసాత్యకిప్రభృతిభాతృనివహంబును గృతవర్మప్రముఖబంధుసందోహం బును, దండనాథపురోహితామాత్యవిద్వత్కవిగాయకప్రముఖులును, బలసి కొలువఁ బ్రహృష్టాంతరంగంబున. ౧౦౩.

సీ. ఒకచక్కిరాయసాల్ ♦ ప్రకటవాగ్వైఖరిఁ, జదురులైదినసరుల్ ♦ చదువుచుండ
నొకచాయఁగరణికుల్ ♦ సకలదేశంబుల, కనుబడికవిలెలు ♦ వినికిసేయ
నొకవంకనుబ్రధాను ♦ లకలంకగతిఁజేరి, వివిధరాజ్యస్థితుల్ ♦ విన్నవింప
నొకదిక్కునియోగు ♦ లుచితవచోరీతి, రాజకార్యప్రవ ♦ ర్తనలు దెలుపఁ
గలితకంకణఝణఝణ ♦ త్కారగతుల, రమణులిరుగడవింజామ ♦ రములు వీవఁ
దత్తరుచిరైకభూషణా ♦ దరము మెఱయ, నిండుగొలువుండెయాదవా ♦ ఖండలుండు.

వ. అయ్యవసరంబున. ౧౦౫.

సీ. చిఱునాగుపడగల ♦ వఱలుకర్ణములతోఁ, గట్టిననిడుపీలి ♦ కాసెతోడ
వలమూపుపయిమించు ♦ చలిదిచిక్కముతో, మెట్టినబిగువారు ♦ మెట్లతోడ
నాసికాగ్రముమీఁది ♦ నాభినామముతోడఁ, దనరారుపొన్నెడ ♦ త్రాడుతోడఁ
జొప్పడబిగిగొన్న ♦ కప్పుకమ్బాయితోఁ, బట్టినయొకకమ్మ ♦ చుట్టతోడఁ
ద్వరితగతిసేగుటకుఁబొంక ♦ పఱచినట్టి, చెట్టుపలరీతినాదలం ♦ జుట్టినట్టి
వెల్లయుల్లియచెఱఁగులు ♦ వెంటనంట, డాయఁజనుదెంచె నొంటరి ♦ బోయఁడొకఁడు.

క. చనుదెంచికనకసింహా, సనమునసెలకొన్నకంస ♦ శాసను నెదుటన్
వినయమునమ్రొక్కిపత్రికఁ, జనవరియుడిగములచేత ♦ సభయతనొసఁగెన్. ౧౦౭.

తే. ఒసఁగినను వాసుకృష్ణుని ♦ యొద్దనునిచి, యతనికనుసన్నవానిదా ♦ యంగవచ్చి
యెవ్వఁడవునీవుపత్రిక ♦ యెవ్వరనచి, రిదియెఱింగింపుమనినవాఁ ♦ డిట్టులనియె.

క. కుండినపురినిముఖామిగ, నుండునమాత్యుండుప్రకటి ♦ తోత్సవవార్తా
మండితరేఖయొసంగన, ఖండితమతిరయము మెఱయఁ ♦ గాఁబనివింటిన్. ౧౦౯.

తే. అనిన వానికి బహుమాన ♦ మర్గలముగ, భౌతికము ఖంబు గానీగఁ ♦ బనిచి యపుడు
తనదు బిరుదులఁ గనుఁగొనఁ ♦ దక్షిణంబ, వారు వినిపించి రిటు కమ్మ ♦ వక్కణలను.

సీ. శ్రీమదఖండల ♦ శ్రీసునంపన్నుఁడౌ, వెన్నునకేనంపు ♦ విన్నపంబు
లిచటి కార్యస్థితి ♦ కెల్లఁ దొల్తనెస్వామి, వారికి నే విన్న ♦ పంబు నంపి
నాఁడఁ గా భీష్మక ♦ నరపతి తనపుత్త్రి, కారూఢయౌవన ♦ కలిమి దమున
నుద్వాహ మొనరింప ♦ నుత్సుకుఁడై స్వయం, వరమున కై రాజ ♦ వరుల నెల్లఁ
బిల్వనంపించె నెంతయుఁ ♦ బ్రేమ మీఱ, మీర లిటు రాఁగఁ గోరి తా ♦ మేర మీఱ
నుత్సుకత మిమ్ముఁ బిల్వంగ ♦ నుత్తరవుకో, సంగె విచ్చేయవలయును ♦ జక్రపాణి.

క. అనిచదువు విన్నపంబును, వినివన జేక్షణుఁడు హృదయ ♦ వీథిన్నిండం
గనుపట్టు కుతుకమింతయుఁ, గనుపడనీఁడయ్యె నెమ్మె ♦ గమ్మున నానన్. ౧౧౨.

ఉ. క్రొన్ననవిల్తుతండ్రి యిటు ♦ కోరికలీరిక లెత్తవత్తరిన్
బున్నమ చందమామయనఁ ♦ బొల్పువహించిన యాస్యసీమను
త్పన్నసుధారసంబనఁగ ♦ భాసిలు లేనగవంకురింపఁ గాఁ
దిన్నని మాటనిట్లనియె ♦ ధీరత మీఱ సభాజనుల్విననన్. ౧౧౩.

తే. ఇపుడు వచ్చిన కమ్మలో ♦ విపులకీర్తి, భీష్మకనరేశ్వరుఁడు కూఁతు ♦ పెండ్లి సేయఁ
దలఁచి రాజులనందఱఁ ♦ బిలువఁబనిచి, యందు మీఁదటమనముస ♦ కచటికిపుడు.

ఉ. రమ్మని నాఁడటంచుఁ గద ♦ వ్రాసిన వాఁడు నియోగియుత్తరం
బమ్మెయినున్న దీక్రియకు ♦ నందఱు మీరిటు నిశ్చయించి కా
ర్యమ్మిదియంచుఁ జెల్పనగు ♦ నాప్తులు మాట వచించినట్టి వా
క్యమ్మున నేకదా విభున ♦ కబ్బు సమస్తశుభంబు లెప్పుడున్. ౧౧౫.

తే. అనుచు సర్వజ్ఞుఁడయ్యును ♦ వనజనాభుఁ, డాడు వినయోక్తులకుఁ బాల ♦ నలరసభ్యు
లందఱాతని నాలభ్య ♦ మతి నివినయ, మాతని ప్రియముంబుఁ బరికించి ♦ యనిరిమగుడ.

ఉ. నీరజనాభ కార్యముల ♦ నిశ్చయమిట్టిదటంచుఁ జెల్పఁగా
నేరమువారలుంగలరె ♦ నీయెదుటన్ సకలాంతరాత్మవై
నేరిచినట్టి వారలను ♦ నేరనివారని చేంచి దిద్దఁగా
నేరచినట్టి దేవుఁడవు ♦ నీకొకరాయొజెఁగించు నేర్పరుల్. ౧౧౬.

తే. అయినమా నేర్పు వితముల ♦ నరసిపలుకు, విన్నపములాలకింపుము ♦ విశదభంగి
పెంపుపులుకంబుపల్కులు ♦ ప్రీతితోడ, ముద్దు సేయుచు విను దారి ♦ మురవిదారి.

క. త్వరితగతినిపుడకుండిన, పురికింజనియచటభీష్మ ♦ భూపతియొసఁగన్
దరుణీమణియగురుక్మిణి, నరుమగఁగొనితేరనొకరి ♦ నడుగన్వలెనే. ౧౧౯.

క. కాదనిస్వయంవరమ్మా, పాదించినభీష్మకుండె ♦ పరికింపఁగని
ర్భేదించిసకలనృపతుల, నాదటఁగొనితెమ్మునీవు ♦ నందఱుమెచ్చన్. ౧౨౦.

తే. అనుచుసామాజికులుదోఁచి ♦ నట్లుపలుక, బుద్ధిమజ్జ్యేష్ఠుఁడననొప్పు ♦ నుద్ధవుండు
శౌరికనుసన్నఁజేరియా ♦ సన్నసీమ, వారివారించిచాతురి ♦ మీఱఁబలికె. ౧౨౧

ఉ. సేవకులెందుఁగార్యగతిఁ ♦ జిత్తమునందలపోసినీతిగా
భూపునితోడఁబల్కుటకుఁ ♦ బోలుదురట్లునుగాకనెమ్మితో
దేవరవారునన్ బహుమ ♦ తిన్ సరివారలుమెచ్చఁజాలసం
భావితుఁజేయుటన్ హితము ♦ వాటిలయుక్తమెపల్కుదున్ హరీ. ౧౨౨.

చ. మనుజుఁడుకార్యసిద్ధికయి ♦ మానుషయత్న మొనర్చువేళనె
మ్మనమునునిశ్చయించిమతి ♦ మంతులకెల్లనుసమ్మతంబుగా
నొనరిచెనేనిదానజయ ♦ మొందునుదైవవశంబుగాకత
క్కొనతఁడేమిసేయునని ♦ క్రిందుగనెంచరుపెద్దలాతనిన్. ౧౨౩.

ఉ. కృత్యాకృత్యవివేకశూన్యమతియై ♦ కించిజ్జ్ఞుఁడౌమానవుం
డత్యంతంబునులోభబుద్ధిఘనకా ♦ ర్యారంభముల్ సేయుటల్
ప్రత్యర్థిప్రదర్శిమిళోన్నధురసా ♦ స్వాదార్థమైయాశచే
[illegible] ♦ హస్తింబుచుటల్లొఁగదా. ౧౨౪.

తే. త్వరి[illegible]కార్యంబు ♦ దలఁచిసేయ, దానఫలమందనేరఁడు ♦ ధరణినరుఁడు
శ్రౌతకర్మంబుసాంగతఁ ♦ జలుపకున్న, సఫలతఫలింపరిదెనిద ♦ ర్శనముగాదె. ౧౨౫.

ఉ. సూరిజనాభిరంజకుఁడు ♦ సూనృతవాదియుసజ్జనావనో
దారుఁడులోభమోహమద ♦ దారుణవర్తనదూరుఁడార్తమం
దారుఁడువిక్రమాస్పదుఁడు ♦ ధైర్యసమగ్రుఁడునీతియుక్తుఁడున్
భూరివివేకసక్తుఁడగు ♦ భూపతియేలఁడెదీవులన్నియున్. ౧౨౬.

మత్తకోకిల. భూజనంబులుమేలుమేలన ♦ బుద్ధిమంతులసంగతిన్
నైజకృత్యములాచరింపుచు ♦ నవ్యకీర్తిదిగంతముల్
రాజిలన్ సమదారివీరుల ♦ రాపుసేయఁగనోపుబల్
తేజమున్ గనరాజుకక్ష్మియ ♦ తిస్థిరత్వమునందదే. ౧౨౭.

సీ. కావునసీగతిఁ ♦ గల్యాణవర్తన, నీతియుక్తతనొప్ప ♦ భూతలేశుఁ
డలరుమహీస్థలి ♦ నవనీతలాధీశ, మాత్రుండ వేనీవు ♦ మధువిరోధి
సకలబృందారక ♦ సంఘకిరీటాళి, మణిగణరంజిత ♦ మహితచరణ
నిఖిలలోకంబుల ♦ నీవెఱుంగనియట్టి, యర్థంబుగలదె ♦ శాంశమైన
నైననేఁజేయుబిన్నపం ♦ బవధరింపు, కుండినపురాధిపతిచేత ♦ నుండివచ్చు
వారుపలికినయర్థంబు ♦ సారఘణితి, విశదభంగినివివరింతు ♦ విమలచరిత. ౧౨౮.

సీ. బంధువమ్మతిమీఱఁ ♦ బద్మాక్షిరుక్మిణి, పెండ్లిసేయుటకునై ♦ భీష్మకుండు
దలపోయునప్పుడు ♦ తిరుణికిఁదగునట్టి, వరుఁడెవ్వఁడనసభ ♦ వారలెల్ల
భవదీయగుణములు ♦ ప్రకటించిశౌరికిఁ, గన్నియనిచ్చిన ♦ గద్ధితంబుఁ
గావింపుమనరాజు ♦ గరముసంతసమొందె, వినిరుక్మియనెడున ♦ వ్విభునిసుతుఁడు
చాలువెడమాటలిఁకశౌరి ♦ పాలుఁడుండ, బాలనన్యులకీయంగ ♦ నేలయనియు
నిరుతెఱంగులమాటల ♦ కేమియనక, మహిపతిస్వయంవరముసేయ ♦ మాఁగిదలంచె.

మ. మనుజాధీశుతలంపుఁగైకొనకదు ♦ ర్మానంబుతో రుక్మిదు
ర్జనులైనట్టిసుయోధనార్కజజరా ♦ సంధాదులంగూడి దు
ష్ట్యనకేనిచ్చెదనాసహోదరిసిశౌ ♦ రోత్సాహబాహాబలం
బునఁగాదంచుఁగడంగుమన్నిదొరలం ♦ బోకార్చెదన్ బేర్చెడన్. ౧౩౦.

క. అనియులవిగాసిఁ గ్రొవ్వునఁ, గనుగానకయున్నవాఁడు ♦ [illegible]
జననాథసుతుఁడటంచున్, వినఁబడియెనుమఱియుఁబెను [illegible] ♦ [illegible]ములనిచటన్.

ఉ. కావునమీరలందఱుఁగఁ ♦ గ్రన్ననఁగ భీష్మకరాజనందనన్
భూవరులెల్లఁగూడికొని ♦ పోఁకిమదృగ్గుణోటసిద్ధమం
దేవగనిర్వహింపనగు ♦ నెవ్వగఁగన్యగ్రహింపఁగాఁదగున్
నీవగయీహితంబులెదఁ ♦ దన్నఁగనెన్నికసేంగ మేలగున్. ౧౩౨.

క. అనియిట్లుపథ్యపుఁడాపన్, వినిబలదేవుండుక్రోధ ♦ విహ్వలమతియై
యనిరూపముగురుదవిఘూర్ణిత, కనదాయతలోచనముల ♦ కడఁగంపడరన్. ౧౩౩.

శా. ఏమేమీహరికిత్తుఁగన్నెననిశా ♦ శ్రీకుండుచింతింపఁగా
నామీఁదన్ మఱిరుక్మిప్రద్యునకుఁడా ♦ నర్పింతునంచెం
భామారత్నమునింతక్రొవ్వుగలదా ♦ బాగాయెఁగాయిచ్చుటన్
రాముండుండుటెఱుంగఁడో రోషంబిగియున్ ♦ బ్రాణంబులేయుల్లఁడో. ౧౩౪.

క. కుండినపతిగన్ని యనీ, కుండిన నేమాయెమాయ ♦ యోయియనిన
ట్లుండఁబటుచండబలసో, గ్దండహలుండవయియేన ♦ తరుణిఁ గెత్తున్. ౧౩౫.

తే. అప్పుడచ్చోటఁగలిగిన ♦ యవనిపతులు, మనుజమాత్రునిగానన్ను ♦ మదిఁదలంచి
కడఁగిరేని యొయుఁగాంతుఁ ♦ గాకనాదు, ముసలదండసముద్దండ ♦ విసరణంబు.

మ. ముసలాఘాతవిశీర్ణశాత్రవకుభృ ♦ న్ముఖ్యోత్తమాంగచ్ఛటా
ప్రసరద్రక్తములానిఘాతతతులా ♦ ర్వన్ బర్వగంధర్వహ
స్తిసమూహంబుపదాతి సంచయముధా ♦ త్రిన్ జాపకట్టైవడిన్
వెసఁగ్రీడింతుమహాహవంబునభుజా ♦ విస్ఫారశౌర్యోన్నతిన్. ౧౩౭.

క్రౌంచపదవృత్తము. క్ష్మాతలనాథ, వ్రాతమునాపైఁ ♦ గదనమహోన్నతిఁ, గడఁగిరయేనిన్
శాతహలాగ్ర, స్ఫూతశిరోధి ♦ ప్రవదురురుధిరా, చ్ఛాదితవృత్తిన్
గాతరలీలన్, ఘాతలవ్రాలన్ ♦ గనుఁగొనిమనమునఁ, గలఁగుచుఁజైద్యుం
డాతురుఁడౌనటు, లాతతశౌర్యం ♦ బమరులువొగడఁగ, నతివను దెత్తున్.

క. అతివఁగొని తెచ్చియీగతి, నతిశయితప్రీతినిత్తు ♦ హరికిన్ దైత్య
ప్రతతింజయించిభూనతి, పితమతినింద్రునకొసఁగును ♦ పేంద్రునిలీలన్. ౧౩౯.

తే. ఇట్లుబలభద్రుఁడాడెడు ♦ హితతరమోక్తి, కెంతయును నెమ్మనమ్మున ♦ సంతసించి
యతివచేసినయట్లన ♦ మతిఁదలంచి, భేరిమ్రోయించెహరియాత్ర ♦ బోరుకలఁగ.

సీ. అంబుజేక్షణుఁడంత ♦ నధికారులనుజూచి, యెల్లికుండినపురి ♦ కేగవలయుఁ
గావునరథరథ్య ♦ కరిపదాతివ్రాత, మాయతమైయుండు ♦ నట్లు సేయుఁ
డనుగ[illegible]వచ్చు ♦ నఖిలసామంతులఁ, బిలిపింపుఁడిపుడచా ♦ రులను బంచి
పటకుటీరకటాహ ♦ పటుకట్టాదుల నెల్లఁ, దోడ నెకొని తెమ్ము ♦ జాడ నెరవుఁ
డతులమణిమయబహుభూష ♦ ణాంబరములు, కుంకుమపటీరకాశ్మీర ♦ సాంకవా[illegible]
మృగమదకరండతండము ♦ ల్ తగువితానఁ, బూనితెండనిశ్రీకృష్ణుఁ ♦ డానతిచ్చె.

తే. ఇట్లుని ర్ణయించి తుయాగ్యద ♦ వేశ్వరుండు, హితపురోహితసామంత ♦ నృపులనెలమి
నీడులకుఁబంచితొన్నను ♦ విభవమెసఁగ, రహిఁజెలంగెడునంతఃపు ♦ రమునకరిగె.

శా. ఈరీతి[illegible]బుఁజేరికొ[illegible]లా ♦ ధీశుండుమాధ్యాహ్నిక
[illegible]రంభంబులు నిర్వహి[illegible]బుధా ♦ ర్చల్ దీర్చిసద్భక్తిమై
భూరి[illegible]పూజ[illegible]న్నెరపియం ♦ భోజేక్షణానీతశ్యం
గారానర్ఘమణిప్రదీపమునవే ♦ డ్కల్ మీఱఁగానున్నెడన్. ౧౪౩.

సీ. అంగనామణియొర్తు ♦ బంగారుపళ్లెంబుఁ, దెచ్చియుంచఁగనొక్క ♦ మచ్చెకంటి
తెలివిచ్చునోగిర ♦ మొలకపప్పునుగూర, లూరుబిండ్లనుజారు ♦ లూరుగాయ
లంబళ్లశిఖరలు ♦ నావపచ్చళ్లను, బరమాన్నమునుగల ♦ వంటకంబు
వడగులప్పడములు ♦ వడియముల్ ఫలములు, ఖండచక్కెరతేనె ♦ పిండివంట
లానరుసురభిళగవ్యస ♦ ద్యోఘృతంబు, నిర్మలనవీనదధియును ♦ నీరుమోరు
నాదిగాషడ్రసోపేత ♦ మైనయన్న, ముపుడువడ్డింపవేడ్కచే ♦ నారగించె. ౧౪౪.

క. తదనంతరంబచేతుల్, పదపద్మములలమిషద్మ ♦ పత్రాక్షుఁడుప
స్మదమొదవనుచితగతిశత, పదములిడిపఠించెరామ ♦ భద్రుని చరితన్. ౧౪౫.

శా. కాంతారత్నముచెంగటన్నిలిచిబా ♦ గాలీయనక్షత్రరా
ట్కాంతానర్ఘవితర్దికాతలమునన్ ♦ గంజాక్షుఁడాసీనుఁడై
యెంతేవేడ్కఁజెలంగెహాటకమయ ♦ ప్రేంఖన్మణీపుత్త్రికా
సంతానార్పితదివ్యచామరమరు ♦ చ్చంచత్కచోపాంతతన్. ౧౪౬.

క. ఈరీతినున్నయెడదా, వారిజుఁడొకఁడరుగుదెంచి ♦ వారిజనయనుం
జేరివసనాంచలమ్మున, నోరున్మాటుకొనియిట్లు ♦ నుడివెనయోక్తిన్. ౧౪౭.

తే. దేవయవధారుధారుణీ ♦ దేవముఖ్యుఁ, డొక్కరుండిప్పుడెందుండి ♦ యోయెఱుంగ
మననగరివాకిటికివచ్చి ♦ తనవితంబు, విన్నపమునేయుమనఁబని ♦ వింటివనిన. ౧౪౮.

చ. ఉలికినయట్టులక్షితిపు ♦ డావ్వహుఁడాతనిఁగెంపునింపుచూ
డ్కులఁదిలకించియోరిజడ ♦ కోరినవస్తువొయట్టిపెద్దల
య్యలఘుగుణాఢ్యులాఁగుటకు ♦ నర్హులెవాకిటనాదుచిత్తమున్
దెలియకవేగమేగికొని ♦ తెమ్మిఁకనైననుదాళిలేన్నినున్. ౧౪౯.

తే. తెచ్చినకుమారమునవిభూ ♦ దేవుఁజూచి, వచ్చువిలుకానితండ్రిప ♦ ద్యుక్తిలేచి
యుచ్చెనువునోఁపునర్ఘ్యపా ♦ ద్యములనిచ్చి, ముచ్చటలరఁగఁదత్పద ♦ మ్ములకు సెఱఁగి.

క. ఎచ్చటనుండియొనీవిపు, డెచ్చటికేగెదవుకామ ♦ హీసురవర
వచ్చుటనుజేసిమద్గృహా, మెచ్చెనఁటసముత్తశుభవ ♦ ... ౧౫౧

ఉ. ఎవ్వరుమీరుమీయునికి ♦ యెచ్చటయేమినిమిత్తమిత్త
న్దవ్వుగనిట్టులొంటిగజ ♦ నమ్ములకేరికిఁజేరరానిడా
నివ్వనరాశిఁజొచ్చితిర ♦ భీష్మములిట్టివినావదింపుఁడే
నివ్వలనేయుఁగావలయుఁ ♦ గృత్యములుండిననానతీఁదగున్. ౧౫౨.



క. వినియుండుదుఁ బెద్దలచే, ననఘా యభ్యాగతస్స్వ ♦ యంవిష్ణు వనన్
దనరు వచనంబుఁ గావున, నిను నాపాలింటిదేవు ♦ నిగ భావింతున్. ౧౫౩.

క. మణులు ధనధాన్యములుఁ గో, గణములు మాకెపుడు మిగులఁ ♦ గలుగు మనుండున్
గణుతింప నమోఘాంబ్రా, హ్మణాశిష యనఁదగుతావ ♦ కాశీర్మహిమన్. ౧౫౪.

క. దైవాధీనము లోకము, దేవత మంత్రావళికిన ♦ ధీనము తన్మం
త్రావళి విప్రాధీనము, కావున విప్రులకు సములు ♦ గలరే జగతిన్. ౧౫౫.

క. లీలామానుషతనుచిత, కేళీపరతంత్రుఁడనుచుఁ ♦ గృష్ణుండిటులన్
బాళి నడుగంగ మృదువా, క్పాళిం బ్రాహ్మణుఁడు వల్కెఁ ♦ బర్మాత్మునితోన్. ౧౫౬.

తే. సకలజగదీశ్వరుండవై ♦ యకలుషప్ర, భావమునఁ దేజరిల్లుభూ ♦ దేవదేవ
భూమిభారంబుఁ దీర్పంగఁ ♦ బూనియిట్టు, లవతరించిన నిన్నెంచ ♦ నలవియగునె.

శా. జలరాశిశ్రితు వేదికాంతరలస ♦ ద్బైఛ్యాలబర్హిస్స్ఫుర
జ్జ్వలదంభోరవమంత్రఘోషఘనరో ♦ షప్రజ్వలద్వహ్నికీ
లలనాసోమకుఁ డన్మహాపశువునా ♦ లంభించి వేదాప్తిగన్
ఫలమున్ జెందినసోమయాజి నిను నేఁ ♦ బ్రార్థింతు మత్స్వీకృతి. ౧౫౮.

చ. మహితపయోజరాగఫల ♦ మౌక్తికసంచయసూన నంతతా
విహితభవర్త్మమందరను ♦ భృద్ధరణీరుహమూలవల్లులా
యహికులలోకవాసిబలి ♦ హర్మ్యము నంటినఁ దన్మణీతతుల్
నిహితము లౌనటంచు బలె ♦ నిల్చితివద్దము డంభకచ్ఛపా. ౧౫౯.

ఉ. మత్తిలియున్న దేవరిపు ♦ మస్తకమున్ బలుతుంగముస్తనాఁ
దుత్తుము సైనన్ మసవి ♦ త్రోడ నెయాశతపత్త్రపున్ను నుం
బొత్తులపట్టికిం గొడుగు ♦ బొంగరమీ వెస నాసకొల్పిన
ట్లెత్తి వెయిమ్మహీవలయ ♦ మింతయుఁ గోలవరాహమోహనా. ౧౬౦.

శా. రక్షస్సంచయరాడురస్స్థలముశౌ ♦ ర్యప్రౌఢతన్ గోళ్లచే
నత్తీక్ష్ణాహతి వ్రక్కలించి ఖసము ♦ ద్యద్రక్తధారాచ్ఛటా
ప్రత్యుద్భవ్యద్విషద్విషచ్ఛలభవా ♦ ర్థప్రాణసంహారకృ
ద్దీక్షాదక్షమహోగ్నిచేనెనఁగవే ♦ దివ్యన్నృసింహాకృతీ. ౧౬౧.

చ. బలినుమహాత్త్రితాపశిఖి ♦ బంధురలీలధరాభ్రవీథులన్
దళము కొనన్ భవత్స్వరణ ♦ తామరసోదమరందధారచే

మలఁచితదీయమాభయము ♦ మానుతునంచుఁదలంచి కాకయీ
యిలయుద్రివంబుఁబొదవున ♦ నెక్కొవనాను దెవామనాకృతీ. ౧౬౨.

మ. ధరణీనాయకకంఠలుంఠనసము ♦ ద్యద్రక్తధారాప్లుత
స్వరుతుల్యాన్ఛసముజ్జ్వలత్పగిశునం ♦ సంబంధుభాసిల్లఁగా
నరవిందాప్తసమగ్రబింబగతపూ ♦ ర్వాద్రికాపిడంబింమభూ
సురవంశాంబుధిసోముఁ రాముఁవరితే ♦ జోధామనిఁగొల్చెదన్. ౧౬౩.

సీ. అంభోధిశోషణ ♦ ప్రారంభణోత్తమ, పాథీలకుంభోద్భ ♦ వాయితములు
రక్షోధిభూకంఠ ♦ రాజీవలుంఠన, బంధురమత్తద్వి ♦ పాయితములు
ఘటకర్ణదేహాద్రి ♦ ఖండనోన్యత్క్రియా, సశతారహారికులి ♦ శాయితములు
మాషణఖరముఖ ♦ దోషాచరానీక, శలభగణాశ్రయా ♦ శాయితములు
తానకీనాంబకమహాక ♦ దంబకములు, భక్తజనదుఃఖసంఘముల్ ♦ పాపుఁగాత
సకలసద్గుణగణాలోల ♦ సత్యశీల, జనకతనయామనోహరి ♦ శరణాశౌరి. ౧౬౪.

చ. శాతతరరేవతీకుచస ♦ మున్నతభూధరశృంగవిస్ఫుర
ద్వరహారిచందవప్రకట ♦ వాసనఁజొక్కిమహీనవృత్తిచే
ధరణిజనంబుదాంతకుల ♦ ధర్మము నెప్పుడునాచరించుచో
ప్పరయుచునీవుసంతసము ♦ నల్లొనరించితిగాబలాత్మకా. ౧౬౫.

ఉ. ఆసురకామినీస్థగిత ♦ మామలశీలమునుత్తమత్రయీ
గావనవైరిసంయమన ♦ కౌశలమేర్పడనంబకంబులన్
నసమవృత్తిఁగిడ్పించి ♦ సత్వమునావిలవృత్తిఁజొప్పడన్
జేసితికాననీనసహ ♦ దెవ్వెఁమారజిదాకృతీశౌరీ. ౧౬౬.

మ. ప్రకటప్రేడజాంబుమాంబు నెక్కొతశధా ♦ గాపంనకాంనస్ఫతిన్
సకలస్తోమలమొల్లఁగ్రుస్మాదికళి ♦ స్వాస్యహోడగ్రిసా
తకసంస్తోళనమాగరంనుసూకృతి ♦ త్రాసుకోనిస్మాతా
త్మకునిన్నున్మదిలోభజింతువినమ ♦ ద్బృందారకల్యాకృతీ. ౧౬౭.

మ. రమణత్వత్పదకంజసంగతిభవ ♦ ద్రాగాత్తరోమాంచసం
క్రమితాంగంబునఁబొల్చెభూసతిమనన్ ♦ ఘాసాంకురశ్రేణిక
ర్యమపుత్రీతటభూమిఁజెన్నెదవగో ♦ త్రాహైకదీక్షావతిం
బ్రమదంబందినయాతనిన్ గొలుతుగో ♦ పాలావతంసాకృతీ. ౧౬౮.

క. నాకతవినుమికఁనిచ్చటి, కేకతమునవచ్చినాఁడ ♦ నేనదినీతో
వాకొనియెదననిభూసురుఁ, డాకృష్ణునితోడవినయ ♦ మడరంబలికెన్. ౧౬౯.

వ. అనిన నప్పరీక్షిన్నరపాలుఁడు శుకమహాయోగిఁ గనుంగొని యవల నడచినవృత్తాంతంబు సవిస్తరంబుగా నానతీయవలయునని యడిగిన. ౧౭౦.

శా. ఆవాసన్నదరాజరాజరవినే ♦ త్రాంభోజభోజాత్మజా
హావానారతనర్మసద్మహితని ♦ త్యానందనందవ్రజ
స్త్రీవారానమబాణబాణకరజో ♦ త్సేకాంతకాంతాంగకో
భావిద్వస్తఘనాఘనాగభృతిబి ♦ భ్యద్గోపగోపాలకా. ౧౭౧.

మాలిని. పరమపదనివాసా ♦ బంధురశ్రీనివాసా
సరసమృదులహాసా ♦ శత్రుహృచ్ఛంద్రహాసా
భరితకనకచేలా ♦ భవ్యశృంగారలీలా
విరచితనుతిలోలా ♦ వేదవిద్యాలవాలా. ౧౭౨.

గద్యము. ఇది శ్రీమదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణప్రాప్తచతురతరసాహితీవైభవ చక్రపామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మార్గణవిశ్రాణితమహాఫల కోవిదనుతభాగధేయ కోటీశ్వరనామధేయప్రణీతం బైనభోజకన్యాపరిణయంబను మహాప్రబంధంబునందుం బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము.

క. శ్రీగురుచిరయోగయోగ్య, ప్రారబ్ధదివ్యబోధ ♦ పరిపాలితమో
దారూఢగుణవిశారద, నారదనుతగుణవిహార ♦ నందకుమారా. ౧.

వ. అవధరింపుము పరీక్షిన్నృపాలునకు శుకయోగి యిట్లనియె. అట్లు భూదేవుండా
గోపాలదేవునితోడ నిట్లని విన్నవింపం దొడంగె. ౨.

సీ. వినవయ్య కృష్ణప్ప ♦ ధీస్సాధ్వీలోకదివ్య, మండనంబన నొప్పఁ ♦ గుండినంబు
తత్పురంబును ధర్మ ♦ తత్పరస్థితి నేలు, మదవదరాతిభీ ♦ మాజవత్పృథువు
భీష్మకుఁ డైతనరారు ♦ భీష్మకుఁ డాతనిసూను, లసమానులేవుర ♦ త్యధికబలులు
వారికందఱకును ♦ గారాబుఁజెల్లెలై, యలరారురుక్మిణి ♦ యనెడుకన్నె
రుక్మిమొదలగునన్నలా ♦ రూఢమమత, నాటలను నేర్పనెంతయు ♦ నందములకు
నంచకోదమయసంగన ♦ చంచలాక్షి, యలరుజనకమానసముల్ల ♦ సిలెడునటుల.

మ. ఆలభోజేంద్రుఁడు దాహజారమునకుం ♦ లైన్వెయుండినా నానరేం
ద్రులు జేజేయని మ్రొక్కుచెచ్చియును నెం ♦ తోకూర్చునప్పుడు తప్పై
గలప్రేమంబున సాంద్రల్లులను సై ♦ గంబంచి తెప్పించిము
గ్ధుఁగఁగన్గొంటయె కానిచూడఁడలనా ♦ ధుల్లోప్పికృకటాక్షింతయుఁ౯. ౪.

తే. సకలరాజన్యమూర్ధన్య ♦ సమితిదన్ను, నంకములఁ జేర్చిము ♦ ద్దాడుచుండి
నలువుదళుకొత్తిబాలనీ ♦ గారవంబు, లోలయనల్లారుముద్దుగఁ ♦ బలుకుచుండు. ౫.

క. మెఱుఁగుల్ వెన్నెలచిన్నెల, చిఱునగవుల సకలరాజ ♦ శేఖరులందున్
శిరమునవహింపఁగన్నియ, కరములరుఁజందమామ ♦ కళయును బోలెన్. ౬.

తే. ఆటప్రాయంబు రానంత ♦ నలకుమారి, కనుఁగుఁజెలులుగఁ దలిదండ్రు ♦ లలవరించి
రబ్జరేఖచకోరాక్షి ♦ యంబుజాస్య, లలితరసమంజరియనంగ ♦ వెలయుచెలుల. ౭.

క. ఆచిన్నిప్రాయమప్పుడ, యాచినవారలనుకులి ♦ మాడఁగఁ జేయున్
మైంచక్కఁదనము చేమృగ, లోచనధవళారవింద ♦ లోచనవింటే. ౮.

వ. ఇవ్విధంబున నయ్యండజగమన కొండికప్రాయంబు నంద పుండరీకకోదండునిమంపిలా
గ్రంబు తెఱంగున మెఱుంగులు గల యంగవల్లి సముల్లసనంబునం బొసంగియును, ధాత్రీ
జనసతతసంవర్ధమాన రై యబ్జరేఖాప్రముఖసఖీజనంబులతో డీలీలావినోదంబులం

దవిలి మచ్చికలు హెచ్చ నచ్చనగండ్లు వెన్నెలకుప్పలు గుజ్జనగూళ్లు తుంపెసలుం డాఁగిలిమూఁత లిట్టకలు సింగనావత్తి గుజగుజరేకులు చింతపూవులు చిట్లపొట్లలును గుఱుగుఱుగుంచంబులు వామనగుంటలు నట్టింట మొదలుగాఁగల యాటలం దవిలి కూటిపట్టునఁ గూఁకును నిదురపట్టున నిదురయు నెఱుంగక తరంగితహర్షాతిశయంబున మెలంగుచుండునవసరంబున. ౯.

తే. కలికిలతకూనకు వసంత ♦ కాలసనంబు, తఱుచుక్రొత్తమ్మివిరికినె ♦ త్తావిఠీవి
కలికిరహిమీఱఁగాఁ జేయు ♦ కరణి కరుణి, చిన్నినెమ్మేను పాయంబు ♦ చికిలిచేసె.

క. అళికచకచనిచయశ్రీ, ఖ్లీలసనమంబుధరమునుము ♦ వివరింపనగున్
దళుకుగల మొంగలిఱేకుల, తోలుకాయనెఱుఁగులచటఁ ♦ దోఁచుటకతనన్. ౧౧.

స్రగ్ధర. వదనాంచద్భృంగభార ♦ స్వహృదయనిలన ♦ త్ప్రౌఢశీత్వంబులుఁ బెన్
మసిఁదాఁబాటింపకర్థిన్ ♦ మధురిపుగృహిణీ ♦ మానితాంశూద్భవశ్రీన్
దదభిఖ్యం జెందుచక్షు ♦ స్తరణికమలరు ♦ స్మధ్యమాత్వంబునొందెన్
దదభీష్టాప్తిన్ బ్రథానో ♦ న్నయనమనుగతి ♦ స్మధ్యమానుప్రసిద్ధిన్. ౧౨.

మ. అలరుంబోడిముఖారవిందమహనీ ♦ యామోదవాంఛాప్తిచే
నలిసంఘంబులు వ్రాలిగంధఫలిచా ♦ యన్ మించు నాసాపుటిం
గలఁగంబాఱియదూరమేగకయెత ♦ ద్గంధాతిలుబ్ధంబులై
నిలిచెన్ బైననొప్పుఫాలవిచల ♦ న్నీలాలకల్ చాసకున్. ౧౩.

శా. నారీప్రేక్షణకాంతికోటతియుఁడుల్ ♦ నాళీకముల్ తోడుగాఁ
గోరన్ గెల్వఁగనీనికాద్యుతికినై ♦ కొంకేలమీకారుచిన్
మీఱన్ స్నేమునికోరఁజేరివలగా ♦ మిన్ విచ్చిపోఁదమ్మిక
స్తూరీచిత్రికరేఖవక్త్రమునని ♦ ల్పున్ బొల్చుఁదత్ప్రీతికిన్. ౧౪.

శా. ఆవాగ్భర్త చెలిన్ సృజించుతఱిస ♦ ర్వాంగీణసౌందర్యభా
శ్రీవిస్ఫూర్తి యుసర్వభూపలలనా ♦ సేవ్యత్వసౌభాగ్యకృ
చ్ఛ్రీవిస్తారముగల్గవర్ణములఁ నీ ♦ రేజాక్షిఫాలస్థలిన్
శ్రీవర్ణద్వయసంపుటంబుగ నవ్రా ♦ సె న్నాఁదగున్ గర్ణముల్. ౧౫.

చ. అలికులవేణిభ్రూయుగళి ♦ మన్ ధనువుల్వరకజ్జలప్రభా
విలసితపక్ష్మమార్వికలు ♦ వేగసమర్చిమరుండు మాడ్కులన్
గలువలకోరులన్ దొడిగి ♦ గాఢవికర్షమొనర్చిలక్ష్యమం
దలవడుదాఁకనాచెనన ♦ నందుఁద్రపానతదృష్టులొప్పడిన్. ౧౬.

తే. చెలిముకందమ్ములందమ్ముఁ ♦ జెందఁగోరి, మీనసంతతులెంతేని ♦ మెలపుతోడ
నీటఁదపమాచరింపఁగ ♦ నాఁటఁగోలె, నవనిరాజీవసంజ్ఞల ♦ నవిభజించు. ౧౭.

తే. మగువకనుదోయియౌవన ♦ మదముపేర్మి, శ్రవణబిలములఁబడునను ♦ శంకనలిన
భవుఁడునిగళంబులుంచిన ♦ భాతిఁగజ్జ, లాంగకతఁబత్మ్మరేఖలు ♦ నలుమిగుల. ౧౮.

చ. దళములుగూర్చిగంధఫలి ♦ తామరసాయతనేత్రనాసికన్
గెలువఁగవచ్చితద్రుచిక్రిఁ ♦ గీడ్వడిలజ్జఁదొలంగికానన
మ్ములమఱుఁగౌటనాభ్రమర ♦ ముల్ పువులన్నియుఁజెందువేడ్కచే
నలరియుఁజంపకంబనన ♦ నాదరవృత్తిమెలంగునిప్పుడున్. ౧౯.

ఉ. మీనతసారసత్వమున ♦ మించినదేదనిలోచనద్వయం,
బానిసమీకభూరిగతి ♦ నాప్తివిపర్యయదీర్ఘసత్వమై
మానుగనక్షరస్వపట ♦ మన్నిజమన్యమునంమునుంచఁగా
దానఁజెలంగెనానప్రమ ♦ దామణికిన్ భువనప్రసిద్ధమై. ౨౦.

సీ. కల్కిచిల్కలకొల్కి ♦ గావునఁగెమ్మోవి, పక్వబింబమటంచుఁ ♦ బలుకరాదు
వికచోత్పలేక్షణ ♦ పికవాణిగావున, నధరంబుచివురంచు ♦ నాడరాదు
కామినిజలదాభ ♦ కచగానమోష్ఠంబు, పద్మరాగమటంచుఁ ♦ బలుకరాదు
కలకంఠికమలాస్య ♦ గానరదచ్ఛదం, బలమధురసపూర ♦ మనఁగరాదు
వనితనెమ్మోముసారలా ♦ వణ్యవిభవ, జలధినుదయించుసంపూర్ణ ♦ చంద్రుఁడగుటఁ
దద్గతామలనవసుధా ♦ ధారలుండు, దీపియనవచ్చుఁదొయ్యలి ♦ తియ్యమోవి. ౨౧.

తే. రమణిరమణీయయౌవనా ♦ రంభజాత, సాంద్రసాకూతదరహాస ♦ చంద్రికాంకు
రములచాలనఁజెలువొందు ♦ విమలదీప్తి, దళితకుందకోరకకాంతి ♦ దంతపఙ్క్తి. ౨౨.

మ. చెలియాస్యద్యుతిఁజెందఁగోరిశశిరో ♦ జీవంబులెంతేసన
స్థలినిచ్చల్ తపమాచరింపనిజము ♦ త్రిస్నేహసంపన్నతన్
జలజంబందెదదాత్మతన్విమఁడజ ♦ న్రంబుంగళంకాప్తిఁద
త్ఫలమొందంగనఁడయ్యెఁగానదివ్రా ♦ ఘావ్యగమూలంబిలన్. ౨౩.

తే. చెలిముఖక్షాంబుజంబును ♦ శీతభాను, బింబమునుద్రానలోనుంచి ♦ శంబరారి
తూఁపలాఘువమునఁగదా ♦ తోయజారి, పాదవునకుఁజేరుమొగలన ♦ దృష్టమదోఁప.

మ. జనభీతిప్రదఘోషపంకజనన ♦ స్ఫారాయశఃప్రాప్తివ్రా
పనరాశిందపమొందిశంఖముకల ♦ స్వానంపృతోఘుంబుశో

భనరేఖాత్రయభాసురంబునయిత ♦ ద్భామగళత్వంబునొం
దినముక్తావళితద్భవత్వమునఁజెం ♦ దె న్హారనామాకృతిన్. ౨౫.

తే. వనితబాహాయుగముకల్ప ♦ వల్లులగుట, తథ్యమనియెన్నఁబోలును ♦ దారలీల
నంగుళులుకిసలంబులే ♦ యనఁగవచ్చు, నరుణనఖకోరకంబుల ♦ నలరుకతన. ౨౬.

తే. భీతమృగనేత్రబాహువుల్ ♦ బిసములగుట, కొకరినడుగంగవలయు నే ♦ ప్రకటమగుమఁ
జాణియుగ్మకనవశోణ ♦ పంకజంబు, లరిదినటఁదోఁచుచుండుటె ♦ గుఱుతుగాఁడె.

తే. మగువయంగంబులెల్లను ♦ దగసృజించి, యంతఁదప్పొప్పుచూచుచో ♦ నబ్జభవుఁడు
దబ్బఱైతోఁచుచున్నమ ♦ ధ్యంబునందు, బుజయిడినచందమున నాభి ♦ పొలుచు మిగుల.

క. జలదరుచివేణినడుమం, జెలువొందఁగఁబిఱుఁదుదనరు ♦ సీమంతినికిన్
జలదాత్యయమునయమునా, జలధారందగుతదీయ ♦ సైకతమనఁగన్. ౨౯.

ఉ. కానకగాత్రనుర్వొడల ♦ కాంతికిసోడియనంటులంతటం
గానరభూమిలోనణఁగి ♦ కైతవవృత్తినిసర్గతత్ప్రిభా
నూనవిలాసముంగొనఁగ ♦ నొక్కటదొంగలసంతరించియున్
దానసుజెందలేకయటఁ ♦ దద్దయువాంచుశిరంబులజ్జచేన్. ౩౦.

చ. దళములువెంచికంజములు ♦ తామరసాక్షిపదద్వయంబుతోఁ
జలమునఁబోరవచ్చిరుచి ♦ సంపదసాలమిచేసహస్రధా
దళితములౌటనోచివురు ♦ తండమునూపురపస్వర-గభా
విలసనకైతవంబులను ♦ వేమఱుఁజేరిభజించుచుండుటల్. ౩౧.

తే. చెలియాప్రపదంబుఁజూచిల ♦ జ్జించికచ్ఛ, ఖంబుదనతలఁబొట్లలో ♦ పలనెయుంచు
నంతఁబోకవిరక్తిచే ♦ నవనినెగడుఁ, గమఠమననెందుఁదానరి ♦ గాఁడనంగ. ౩౨.

మ. మొగమాచందురుఁగేరుఁగెంపులనగున్ ♦ మోవద్దపుంబిల్లలం
దెగడుంజెక్కులుచంచలాళిగెలుచున్ ♦ దేహంబునబ్జంబులన్
నగుఁభ్రూణుల్ కనకప్రసూనకళికల్ ♦ నాసారుచుల్ వ్రేళ్లహో
చిగురుల్ మీఱెదు నెంచఁగావన మెయ్యా ♦ సీమంతినీరత్నమున్. ౩౩.

సీ. పద్మాక్షివేణితోఁ ♦ బాణితోనెనరావు, కందముల్ కనకార ♦ విందములును
తనుమధ్యమోవితోఁ ♦ దావితోసరిరావు, బింబముల్ నూనక ♦ దంబములును
సుదతిపల్కుగుబ్బతో ♦ నుదురుతోఁదులరావు, కుందముల్ శశిరేఖ ♦ చందములును
చంద్రాస్యమూరుతో ♦ సౌరుతోదొరరావు, నీలముల్ చంచలా ♦ జాలములును

నలినలోచనతోడలతో ♦ నడలత్రోడఁ, గంబముల్ మదమత్తకా ♦ దంబములును
దలఁపసరిగావు మృదులతా ♦ తన్వి సెంచ, నలవియే వేయుజిహ్వల ♦ చిలువకైన. ౩౪.

ఉ. చంద్రుఁ గేరు మోముజిగి ♦ సౌమ్ర ప్రవాళము మీఱు మోవి తా
నంపఁ జిన్ని వెన్నెలల ♦ యారెయొయారము రువ్వు నవ్వులిం
దిందిర పాళి కింగురులు ♦ నీటగు ముంగురు లద్దిరయ్యరో
మందము ధారుణీవలయ ♦ మందము దాని పిఱుందు చందముల్. ౩౫.

సీ. బిసములకును బుట్టి ♦ కుసుమదామవిభూతి ♦ బరిభవింపఁగఁ జాలు ♦ బాహుయుగము
కమలంబులకుఁ బుట్టి ♦ కంతులకోరీల, కిత్తింకులిడఁ జాలు ♦ నీక్షణములు
చిగురాకులకుఁ బుట్టి ♦ జిగికెంపు నిద్దంపుఁ, దేటవాటింపని ♦ తియ్యమోవి
హరిపదంబునఁ బుట్టి ♦ హరిమధ్యమును బట్టి, యల్లలనాడించు ♦ నసదుఁ గౌను
ననఁటులకుఁ బుట్టి మదహస్తి ♦ హస్తములను, జెనకఁ జాలిన నున్దొడ ♦ చెలువు గలిగి
వెలయు నబ్బాల లావణ్య ♦ వివిధలీలఁ, దలమె నుతియింప వేనోళ్ల ♦ చిలువకైన. ౩౬.

ఉ. కౌముది తేటలజ్జముల ♦ కాంతి మెఱుంగుల చెన్ను పువ్వపుం
దామము నందము త్పలవి ♦ తానము చందము నేర్చి కూర్చి యా
తామరచూలి నేర్పు ప్రథి ♦ తంబగునట్టులగా సృజించెనో
కామిని మందహాసము మొ ♦ గంబును దేహము బాహులన్భులున్. ౩౭.

తే. అను మనీరీతి ద్విజపఙ్క్తిఁ ♦ డలకఁ బోఁడి, చారులావణ్యగరిమంబు ♦ సారఘణితి
మెఱయ నభివర్ణనము సేసి ♦ మఱియు నిట్లు, లని యొదానవవైరితో ♦ వినయ మెసఁగ.

సీ. ఆరూఢయౌవన ♦ యగు నట్టి తనపుత్త్రిఁ, గనుఁగొని భీష్మకుం ♦ డనఘవృత్తిఁ
దగినట్టి వరునకుఁ ♦ దరళాయతాక్షిని, బరిణయం బొనరింపఁ ♦ దలఁచి యటంచు
మది నెంచి బంధుల ♦ కదియెల్ల విదితమా, నటు నేయ నెందుల ♦ కలరి వారు
నిది యుక్తమీరీతి ♦ కిఁకఁ దామసము చేయఁ, బాడిగాదటు గానఁ ♦ బరిణయంబు
వేగఁ గావింపు మని పల్కఁ ♦ విభుఁడు దాని, కలరి వారికి నారూపుఁ ♦ దైనదగు ని
నిశ్చయింపంగ నెడ యులు ♦ నమ్మి మీర, లనిన వారిట్లు పలికిరి ♦ మనుజపతికి. ౩౮.

ఉ. కాంతు నిరూపవంతునిఁ గఁ ♦ గన్నియ గోరు నపిత్తవంతు గా
నెంతయు నెంచు దజ్జనని ♦ యిచ్చను నిచ్చలు నెన్ను సత్
వంతుని గాఁగ దగ్గురుఁడు ♦ బంధుజనంబులు సత్కులీను గా
గాంతురు లోకముత్సవముఁ ♦ గాంచి నుతింపు వివాహవేళలన్. ౩౯.

క. కావున నీగుణములు గల, భూవరసుతు నొకని వెదకి ♦ పూర్ణేందుముఖిన్
శ్రీ వెలయఁ బెండ్లి సేసిన, యే వారును మెచ్చుకుందు ♦ రేని నునధిపా. ౪౧.

తే. అరయ సర్వజ్ఞుఁ డవగుని ♦ వఖిల దేశ, వాసి భూమీశ్వరాత్మజ ♦ వర్తనంబు
తెలుఁగు దువు గానఁ దగినట్టి ♦ వరుని వెదకి, కూఁతు నిమ్మని పల్కె నా ♦ క్షోణిభుఁడు.

మత్తకోకిల. మీరలెంచిన సద్గుణంబుల ♦ మీఱు రాచకొమారులిం
దేరి యేరిగణించి చూచిన ♦ నిందు విల్తునితండ్రి యుఙ్
వారిరాశితనూభవాపతి ♦ వారిజోద్భవవంద్యుఁడున్
వారిజాప్తసుధాంకనేత్రుఁడు ♦ వాసుదేవుఁ డొకండిలన్. ౪౩.

సీ. ఎవ్వనిశాసనం ♦ బిందుశేఖరసరో, జాసనాగ్రకిరీట ♦ భాసురంబు
తనరు నెవ్వనిబల ♦ దావాగ్ని సురరిపు, గ్రామణిశలభైక ♦ స్మస్మరంబు
తగు నెవ్వని చరిత్ర ♦ నిగమాంతరార్థాంత, సంతతాన్వేషణ ♦ శ్రాంతిదంబు
చెలఁగు నెవ్వనిమనో ♦ విలసనంబిహపర, ప్రస్తుతాఖిలభూత ♦ వర్తనంబు
వెలయు నెవ్వం డుసురనర ♦ వివిధతిర్య, గచలమయనైకలోకవి ♦ హారపరత
నట్టిజగజెట్టి మనయల్లుఁ ♦ డగుట కంటె, భాగ్యమున్న దె తెలుపుఁడీ ♦ బంధుజనులు.

క. ఈగతి భూపతియనఁ ద, ద్వాగమృతముఁ గ్రోలి సభ్య ♦ వరులు సెలంగన్
నాగరికవినుతగర్జా, భోగముతో దివ్యకుసుమ ♦ ములు జడివట్టెన్. ౪౫.

తే. అంతనిద్దియెల్ల విని యుక్తి ♦ యతులరోష, వివశుఁ డైపల్కె సభవారు ♦ వెరఁగుపడఁగఁ
దనరు బాల్యంబు కతమునఁ ♦ దండ్రి నైన, సరకుసేయని యుద్ధతి ♦ సమదలీల. ౪౬.

క. ఈలీలావతి కృష్ణున, కేలాగున నీయఁ దలఁచె ♦ నిప్పుడు ధరణీ
పాలుండు మీరలిప్పలు, కాలించితి రెట్టులుచిత ♦ మాయిది మీకున్. ౪౭.

సీ. చనుపాలు నానంగిన ♦ వనిత నొంచెనటన్న, ధర్మాత్ముఁ డనియెట్లు ♦ తలఁపవచ్చు
మత్తుఁడై తన మేన ♦ మామఁ జంపెనటన్న, వ్రతవంతుఁ డనియెట్లు ♦ చూడవచ్చు
నలజరాసంధున ♦ కని వీఁగి చనెనన్న, బలుమగం డనియెట్లు ♦ పలుకవచ్చు
నాభీరసతులపాం ♦ దాసించి నాఁడన్న, నందగాఁ డనియెట్లు ♦ నాడవచ్చుఁ
దనరు తలిదండ్రు లెంతయు ♦ వనటఁ గనుచు, నొంతి సంకిళ్లఁ బడియుండ ♦ సంతసమునఁ
దోఁచినట్టుల తిరుగాడు ♦ నుండగీఁడు, నెనరుగలవాఁ డనుమ నెట్లు ♦ లనఁగవచ్చు.

క. వానిచరిత్రలు లోకము, లోనం గల ప్రజకు వింత ♦ లునురంతులునై
నానాఁట వెగటసినమే, యానాఁటన పరునిమనకు ♦ నంటనఁ దగునే. ౪౯.

శా. ఏరీతిన్ గణియించి చూచినను వృ ♦ ష్ణీశుండు పాత్రుండుగాఁ
డీరామామణి నీయ విక్రమకళా ♦ హేలాపరాభూతవి
రారాతిప్రకరుండు సద్గుణకదం ♦ బావాసుఁ డౌ చైద్యుఁ డీ
నీరేజాక్షిని బెండ్లియాడ మనకు ♦ న్నేత్రైకపర్వంబగున్. ౫౦.

ఆ. ఇట్లు పలుకుసుతున ♦ కెంతేని మోమోడి, మాఱువలుకకుండె ♦ మనుజనాథుఁ
డంత భీష్మమహిషి ♦ యంగనాతిలకంబు, ధర్మవచనసరణిఁ ♦ దలఁచి పలికె. ౫౧.

తే. ఏల మీలో వివాదంబు ♦ లిట్లు గలదె, వీరు వారని మీరేల ♦ వేఱువాఱఁ
గన్య దనకంటికింపైన ♦ ధన్యు నొకనిఁ, గోరికొనుఁగాక రాజకో ♦ మారులందు. ౫౨.

క. పిలిపింపుఁడు నానాభూ, తలనాథకుమారవరుల ♦ ధైర్యాత్ముల న
త్యలఘుబలాన్వితులను ని, ర్మలనిజచరితుల స్వయంవ ♦ రంబునకిటకున్. ౫౩.

వ. అని యివ్విధంబున నమ్మహారాజమహిషి నిజవల్లభాశయానుగుణంబును, నిఖిలబాంధవ సందోహప్రహర్షప్రదంబును, గుటిలహృదయకుమారవిరచితాసంభావనానుకూలంబుగాఁ జాతుర్యంబు నివ్వటిల్లం బలుక నవ్వధూమణి వాక్యంబులకుఁ దత్సభం గలవార లిమ్మహాదేవి యింత యొప్పం బలుకునే యిప్పలుకు లెఱుంగున న్నడచుట మనవంగడంబునకుం గల ధర్మం బని యేకకంఠంబుగాఁ బలికి రప్పలుకులకు మొగంబు గంటువెట్టుకొని యాఁగాదనం జాలక రుక్మి యూరకుండె. అవ్విదర్భమండలాధీశ్వరుండును దత్సమయంబునఁ దనవ్రాయసాలవారినిం జూచి నిఖిలనరపాలపుంగవకుమారులకు నుత్తరంబులు వ్రాయుఁడని మహాహర్షోత్కర్షంబుగా నానతిచ్చి సముచితప్రకారంబున నిజాంతఃపురంబున కరిగె. అటఁ గుటిలహృదయుండగు రుక్మియును వాఁడును దనసంగడీలం గూడి మంతనంబునకుం జొచ్చి యెత్తెఱంగున నైన నత్తరుణి శిశుపాలునకే యిత్తునని రహస్యంబుగా నిశ్చయించి నిజమందిరంబునకుం జనియె నంత కొన్నిదినంబు లరుగుటయుఁ గ్రమక్రమంబున. ౫౪.

క. కరితురగరథపదాతి, స్థిరవిక్రమలీలధరణి ♦ దిర్ధిరదిరుగన్
నరపాలసుతులు రాఁ బోవఁ, గిరిదిక్కులనుండి రాజ ♦ కీయులు పిలువన్. ౫౫.

తే. ఆ యుక్కొలువున నడచిన ♦ యవ్విశేష, మన్నకాదన్న పలుకులు ♦ నాత్మజనని
యాఁపుయుక్తము స్వయంవరం ♦ బనిన తెఱఁగు, చతురులైనట్టి తనవయ ♦ స్యలు వచింప.

సీ. శీతాంశుబింబాస్య ♦ చిఱుతనాఁటనుగోలె, సఖులచే నెప్పుడుఁ బ్ర ♦ సంగవశత
భవదీయసౌందర్య ♦ భవ్యతరస్థైర్య, విభ్రమౌదార్యముల్ ♦ వినుటఁ జేసి

చెలికత్తియలకైనఁ ♦ దెలివిడిగాకుండఁ, దనునీదుసామ్ముగాఁ ♦ దలఁచియుండు
నింగితజ్ఞుఁడనౌట ♦ సంగనామణిచిత్త, మింతంతయెఱుఁగుదు ♦ నేనొకండ
నాత్మసంకల్పమంతరా ♦ యంబునొందు, నన్నుఁబటుభీతిచెలరేఁగి ♦ తన్నుఁగ్రమ్మి
చిత్తసంక్షోభమొనరింపఁ ♦ దత్తఱిలుచు, బాలసంతాపమునఁగుందు ♦ వేళయందు.

తే. పద్మలోచనకెప్పటి ♦ భంగి నేను, జదువుచెప్పంగనగరికిఁ ♦ జనినయపుడు
భూరినారంగకదళికా ♦ నారికేళ, మహితమైనట్టియారామ ♦ మధ్యసీమ. ౫౯.

సీ. కెలఁకులఁజెలువొందు ♦ నెలమావిగుమురులఁ, గ్రమ్ముద్రాక్షలతోడఁ ♦ గలసిమెలఁగు
నేలకితీవల ♦ నెనసినకర్పురంపు, టనఁటులపజ్జలం ♦ బెనఁగియున్న
గొజ్జంగపొదలపైఁ ♦ గురిసినచిఱుమంచు, చినుకులతోఁగూడఁ ♦ బెనఁగివచ్చు
చిఱుతతెమ్మెరలచే ♦ విఱిగినతరఁగల, మించుటయ్యేలలరా ♦ యంచకొదమ
• పిండునిమురింపజొలలు ♦ బిట్టుపాడు, తుమ్మెదలకెమ్ములెయొప్పు ♦ తమ్మిపూల
మెండుపుప్పొడికిలయంగ ♦ నిండియున్న, చలువతావులువెదచల్లు ♦ కొలనిచెంత.

క. బాలసహకారభూరుహ, మూలస్పృహణీయతమత ♦ మోవిమణిశిలా
నీలాబ్జళయ్యమీఁదని, జాళితతుల్ గొలువనున్న ♦ యంగనఁగంటిన్. ౬౦.

చ. కనుఁగొనియున్నినాళ్లవలెఁ ♦ గల్కియుదేమికొ చేరవచ్చినన్
ననుఁగనిలేచి మ్రొక్కుదువి ♦ నమ్రముఖాంబుజయయ్యెనిప్పుడీ
వనజదళాక్షియంచుమది ♦ వారని ప్రేముడిఁజేరఁబోవవా
డినపువుఁదీఁగెరీతిఁ బ్రబక ♦ టించులతాంగినిజూచి నెచ్చెలుల్. ౬౧.

సీ. కూరిమిరాయంచ ♦ కొదమలలాలించి, నడపింపరాదకో ♦ నలిననేత్ర
కేలఁగైకొనిచిన్ని ♦ కీరంబునకునేల, మాటలునేర్పవే ♦ మచ్చెకంటి
మేళవించివిపంచి ♦ నాలాపగతిమీఱఁ, బలికింపవేలొకో ♦ పంకజాస్య
జలకమాడుమటంచుఁ ♦ జెలులెచ్చరింపఁగాఁ, బోపొమ్మనెదవేల ♦ పూవుఁబోణి
కలపమలఁదవిదేటికే ♦ కంబుకంఠి, వన్నెలిడనెల్లవేటికే ♦ వన్నెలాఁడి
పూలుముడువవదేటికే ♦ నీలవేణి, యారగింపవదేటికే ♦ యబ్జపాణి. ౬౨.

క. ఈవచ్చినయొజ్జలనిటు, సేవింపకయుండనీకుఁ ♦ జెలియాతగవే
నావినినాదిక్కు మొగం, బైవనజదళాక్షిలేచి ♦ యతిభక్తిమెయిన్. ౬౩.

తే. విధియుతంబుగనర్ఘ్యాది ♦ విధులొనర్చి, యుచితకనకాసనంబున ♦ నుండఁబనిచి
నానవానతవదనయై ♦ నానిలువఁ, గలికిచెలులెల్లననుఁజూచి ♦ పలికిరపుడు. ౬౪.

తే. భూసురోత్తమ మీరు మీ ♦ పుత్త్రికన్న, నెన్నఁదగు ప్రేమ నీకన్నె ♦ నెపుడు చూచు
చుండెదరు గానఁ దెలుపక ♦ యుండఁదగదు, వినవలయు మీర లీకన్నె ♦ వితము నేఁడు.

సీ. నీరజదళనేత్ర ♦ నిన్నటినుండియు, నత్యంతచింతాభ ♦ రాప్తినొంది
చెలులతోఁ బలుకదు ♦ కలపమలందదు, వీణవాయింపదు ♦ విరులు తురుము
దంచలనడపింప ♦ దలరులు చిదుమదు, పలికింపదొకపరిఁ ♦ జిలుక నెపుడు
తొడవులు వెట్టదు ♦ విడె మీయఁ బోయిన, నాదరింపక త్రోయు ♦ నవలఁ జెలిని
ఇట్టులుండంగఁ గారణం ♦ బేమి యనినఁ, జెలియ మాతోడ మఱుమాట ♦ పలుకదిపుడు
కలికిహృదయంబు మీరైనఁ ♦ దెలియరాదె, యనుచుఁ బలుకంత విని యంత ♦ నలరుఁబోఁడి.

క. కన్నెఱసేయుచు నపుడ, క్కన్నియ మనమునఁ గినియుచుఁ ♦ గడువడిఁ దనచే
నున్న విరిదమ్మి వైచుచు, నన్నఁ బోఁడులవిదల్చి ♦ యవ్వలఁ జనియెన్. ౬౭.

క. అత్తతి భోజన్యపాలుని, బ్రోత్తరియరుదెంచి మాకుఁ ♦ బ్రియమొసఁగఁ గడున్
బత్తి యొనరించి యెవ్వో వి, ప్రోత్తమ మీ రిపుడు వింటి ♦ రో లేదో గదా. ౬౮.

క. ఈనకియున్న యునికిమ, హీసురకులతిలక నిన్న ♦ నృపుసభ వార్తల్
దాసీజనములు దెలుపఁగఁ, దా సైఁపమిఁ జేసి యనుచుఁ ♦ దలఁపుఁడు మదిలోన్. ౬౯.

చ. ఒదవిన వృద్ధభావమిది ♦ యొక్కటియే మహనీయబుద్ధియున్
పదమలవృత్తమార్దవము ♦ శాస్త్రవిధిజ్ఞతయెల్లఁ గల్గుటన్
మదిఁ దలపోసి గాన్పుడు ♦ మన్ననమిమ్ముగురుత్వబుద్ధి చే
ముదితకు విద్య నేర్పుఁడని ♦ మోదము నన్నియమించియుంచుటల్. ౭౦.

తే. అట్లు గావున మీకంటె ♦ నాప్తుఁడొకఁడు, గలుగ నేర్చునె మదినున్న ♦ కార్యమెల్ల
విన్నపమొనర్తునది మీరు ♦ వినుచునాదు, మనవి చేఁగూర్చి యిచ్చెద ♦ మనిన యపుడు.

క. అనవుండిట్లని పల్కెతి, వనజేక్షణతోడ నెందుఁ ♦ బనిచినఁ జననీ
మనమున దలఁచిన కార్యం, బనుకూలమొనర్తుఁ బల్కు ♦ మాజంకేలా. ౭౨.

సీ. ఈగతి నెంతేని ♦ హితముదోఁపఁగఁ బల్క, నాకిట్టులని పల్కె ♦ నలిననేత్ర
మను జేయుఁడాదరం ♦ బునరుక్మిణికిఁ బెండ్లి, యొనరింపఁగా నెంచి ♦ వినుతలీల
బంధులకెఱిఁగింపఁ ♦ బ్రమదంబుతో వారు, నదియుక్తమని పల్క ♦ నలరియపుడు
వసుదేవసుతునకు ♦ వనితనిచ్చుటయుక్త, మనినిశ్చయము సేసె ♦ నవనివిభుఁడు
నీవితంబెల్ల విని రుక్మి ♦ యీసుతోడ, హరిని నిందించి శిశుపాలుఁ ♦ గరముఁ బొగడి
యతనికిచ్చుట తగుననిఁ ♦ యపుడు పలుక, నింతయును గని నేనపు ♦ డిట్టులంటి. ౭౩.

క. ధరణీశులందఱిండ్రుల, కరుదెంచినవారిలోన ♦ హరిమధ్యస్వయం
వరమునఁగోరినవారికిఁ, దరుణీమణినిచ్చుటరయఁ ♦ దగవనినంతన్. ౨౪.

సీ. ఇదియుక్తమన్నిభ్యా ♦ లెల్లవారునుబల్క, నవనీశుఁడామోద ♦ మందియంద
చారులఁగనుఁగొని ♦ సత్వరగతిఁజని, ధరణీశ్వరులనెల్లఁ ♦ దడయకిపుడు
తోడితెమ్మనరుక్మి ♦ మోడితోఁదనయింటి, కడకేగిదుర్మంత్ర ♦ మెడఁదనెంచి
బలిమిచేనైనను ♦ బద్మాయతాక్షిని, శిశుపాలునకుపెండ్లి ♦ సేయఁదలఁచు
టంతయునువినిరుక్మిణి ♦ యధికదుఃఖ, మంతరంగంబునెఱియంగ ♦ నార్తినొంది
నెపుడుకృష్ణునివరియింప ♦ నెంచుకతన, నరయువేఱొక్కరునిబెండ్లి ♦ యాడరోసి.

ఉ. కావునవాసుదేవునిటు ♦ కంజదళేక్షణగోరియుండుటన్
భూవిభుఁడేసునిద్ధఱముఁ ♦ బొల్పుగయోజనచేసియెట్టులేన్
శ్రీవరుఁడైనకృష్ణునికిఁ ♦ జేడియనిచ్చినభాగ్యమంచుమా
భావమునందలంచితిమి ♦ పద్మభవాన్వయవార్ధిచంద్రమా. ౨౬.

ఉ. ఈగతికంతరాయముగ ♦ నెంచినరుక్మికిదుష్టవృత్తియే
బాగుగనెంచియాసురవి ♦ వాహమునన్సతినాక్రమింపఁగా
వేగమెవచ్చుచైద్యునకు ♦ వేమఱునుందలవంపులౌనటుల్
రాగమునెందురుక్మిణికి ♦ రాజవతంసునిఁగృష్ణుఁగూర్పఁగన్. ౨౭.

క. మీచేతనైనదగుటను, వేచనిద్వారకకుఁజేరి ♦ విస్ఫుటఫణితిన్
సూచింపుఁడెల్లకార్యం, బాచక్రాయుధునితోడ ♦ ననఘాతెలియన్. ౨౮.

సీ. కరముమత్ప్రార్థనఁ ♦ గైకొనిమీరలు, శ్రీకృష్ణదేవుని ♦ చెంతఁజేరి
ధవళాక్షిరుక్మిణిఁ ♦ దనుఁగోరియున్నట్టి, తెఱఁగునుభీష్మక ♦ నరవరుండు
నేనునునాచంద ♦ మెంచియున్నక్రమం, బందులకువిరోధి ♦ యైనరుక్మి
దుర్మంత్రమునుజెప్పి ♦ తోడనతానిందు, వచ్చిమాకెల్లను ♦ బ్రమదమెసఁగఁ
జైద్యుఁడాదిగాఁగల ♦ యట్టిశత్రునృపుల, నందఱజయించిసత్కీర్తి ♦ నధిగమించి
యంబుజాక్షినివరియింపు ♦ మనుచుఁబలుకు, మనఘచారిత్రభూదేవ ♦ తాగ్రగణ్య.

చ. అనవినియిట్టులంటిమను ♦ జాధిపురాణికినీదుపంపునం
బనివినిశీఘ్రమేయిపుడ ♦ పంకజనేత్రునిచెంతకేగియా
తనిమదికింపువుట్టఁగను ♦ ధారసధారలువోనివాక్యముల్
పనుపఁదెల్పితోడ్కొనుము ♦ వచ్చెదనిందునరాళకుంతలా. ౩౦.

మ. అనియిట్లేఁదిన తల్లితోఁ బలుకుచో ♦ నబ్జాక్షి యా రుక్మిణీ
వనితారత్నము లజ్జనొందివినమ ♦ ద్వక్త్రాబ్జయై యుండియున్
మనముమన్బల్కులు దేహమందుఁ బొడమెం ♦ బూర్ణేందుభాస్వన్ముఖం
బున సాకూతదరస్మితంబు వెలికు ♦ బ్బ్రాంగెన్ లతాతన్వికిన్. ౬౧.

తే. ఇట్లు వ్రీడాభరంబున ♦ నించుఁబోఁడి, చెలులకు మదనహృదయంబు ♦ తెలియకుండ
దాఁచియున్న నునీమ్రోఁదఁ ♦ దవిలియున్న, మనము నెఱిఁగిననను రాగ ♦ మహిమనపుడు.

క. వనితారత్నము మదిఁగల, ఘనమగు రాగానుషక్తి ♦ గాంచుట నాకున్
గనుఁగొనఁగవిశదమాటన్, వనజేక్షణ పత్వరముగ ♦ వచ్చితి నిటకున్. ౬౩.

ఉ. వారిజనాథ నేనిటకు ♦ వచ్చుత తెందరళాక్షితోడనీ ♦
ప్రాఁబటనుండు మీకలఁక ♦ నొందకు మీ యెటులైనఁ బ్రార్థనా
చారువచోవిలాసముల ♦ సమ్మదమానటువిన్నవించియా
శౌరినిదోడితెత్తునని ♦ సాదరవృత్తిని బల్కి వచ్చితిన్. ౬౪.

క. భక్తులప్రతిజ్ఞగావ్చుట, యుక్తముగదనీకువారి ♦ జోదరవిలస
న్నక్తంకరముఖిభవదా, సక్తాత్మికఁగొనుటలోక ♦ సమ్మతిను ప్పో. ౬౫.

క. అనియిట్లు భూసురాగ్రణి, తనరాకకుఁగారణంబు ♦ తథ్యము పలుకన్
వినియంతఁగార్తినిట్లను, దనుజారిప్రమోదపూర్ణ ♦ తను విప్రునితోన్. ౬౬.

సీ. ధారణీసురవర్య ♦ మీరానతిచ్చిన, వితమెల్ల విఁటిమి ♦ వ్రతము గాక
భీష్మకనరపతి ♦ పెండ్లికిరమ్మంచు, ముఁబిల్వనంపిన ♦ మన్ననయును
మీరిటవచ్చుచో ♦ మెలఁతకృష్ణుని దెస్తు, నేరీతినిన వా ♦ గ్గౌరవంబు
నేకమైనదిగాన ♦ నేయంశమునఁ జూడ, నేనాయిత్తబయి ♦ యిపుడె యఁము
జనుటతగనౌటశుభమైన ♦ సమయమునను, గనలివచ్చెదఁ దెచ్చెదఁ ♦ గమలనయనఁ
జైద్యుఁడోకఁడేలసిను విప్ర ♦ సకలసురులు, నాగ్రహంబునఁజను దెంచి ♦ యడ్డపడిన.

క. మీరాకపోకలచ్చటి, పౌరులసందరియరాని ♦ భంగిని మెలఁగన్
నేరుతురు మీర మీకిఁక, వేరేవివరింప నేల ♦ విశ్రుతలీలా. ౬౮.

క. అని పలికి వస్త్రభూషణ, తన కాదుటకన్నదనియఁ ♦ గానొసఁగి తగం
బనిచి వననిని బినహర్గం, బుతవిడోర్గనీచని యొవిప్ర ♦ పుంగవుఁ డంతన్. ౬౯.

తే. యదుకులాధ్యక్షుఁడను భూసు ♦ రాగ్రగణ్యు, పలుకులను విన్న రుక్మిణీ ♦ లలన చెలువు
నెట్టుకొనిచాలఁగన్నులఁ ♦ గట్టినట్లు, నివ్వటిలుచుండవ్యామోహ ♦ నిరతుఁడగుచు.

తే. ఎపుడు కుండినపురికేగి ♦ నృపుల నెల్ల, జన్యభూమిని నిర్జించి ♦ జయము గాంచి
పంకజాక్షిని వరియించి ♦ ప్రమద మెసఁగఁ, జిత్తజన్ముని సంకల్ప ♦ సిద్ధిఁ గాంతు. ౯౧.

క. అని యిట్లు మదిఁ దలంచుచు, వనజాక్షిని సంగ్రహింప ♦ వదలని ప్రేమన్
మన మెంతయుఁ జివురొత్తఁగ, దనుజేంద్రవిదారి గమన ♦ తత్పరమతియై. ౯౨.

సీ. కొలువుకూటముఁ జేరి ♦ బలభద్రసాత్యకి, ప్రభృతులు నఁగులౌ ♦ బంధుజనులు
హితులుఁ బురోహితుల్ ♦ చతురులౌ మంత్రులు, నలుగడ నెంతేని ♦ బలసి యుండ
నందఱఁ గనుఁగొని ♦ యాదరం బడరంగ, భీష్మండు తనయకుఁ ♦ బెండ్లి సేయ
వైభవంబున స్వయం ♦ వరము చాటించుచు, మనకు నుత్తరము నం ♦ పినవితంబు
మీరు వింటిరె కదయిఁక ♦ మీఁద మనము, తామసము సేయుటిది యుచి ♦ తంబు గాదు
కాన శుభప్రయాణమై ♦ కీదలవలయు, గమనసన్నద్ధులై వేగ ♦ కదిసి రండు. ౯౩.

క. అని శౌరి వలుక నట్లన, పనివిని యెదమింత కన్న ♦ భాగ్యము గలదే
యని వారు సంతసింపఁగ, వనజాక్షుఁడు వారిఁ బనిచి ♦ వైభవ మెసఁగన్. ౯౪.

ఉ. అంతిపురంబుఁ జేరి జల ♦ జాయతలోచన మీఁది ప్రేమచే
స్వాంతము పల్లవింప మృదు ♦ శయ్యపయిం బవళించి బాళి నే
కాంతలతాంతచాపగుణ ♦ కర్కశదుస్సహ నిస్స్వనార్తి నా
వంతయు నిద్ర రామి నిద్రి ♦ యామఁ దరించెఁ ద్రిలక్ష్యయామఁగన్. ౯౫.

వ. అంతఁ బ్రభాతసమయం బగుటయు నప్పుండరీకవిలోచనుండు పయనంబై యహర్ముఖసముచితకర్మకలాపంబు నిర్వర్తించి సముచితాంగరాగభూషావిశేషవిభూషితుండై యంతఃపురంబు వెడలి యంతకుమున్న పయనంబునకుఁ గట్టాయితంబై వచ్చిన బలభద్రసాత్యకిప్రముఖయదుపుంగవుల పాదావలోకదరహాససంభాషణాదులవలన సంభావించి వారలుం దానును విమలనవరత్నపాంచాలికారచితవివిధరాజోపచారంబగు సభాద్వారంబు నిర్గమించి కొలువుకూటంబునకు వచ్చి వెంబడిఁ జను దెంచువారును, బురంబున నధివసించువారును, వీరువీరని వాసము దొరల వేరువేర పేరువాడి నియమించి విద్వజ్జనంబును రావించి వారలకుఁ బ్రణామపూర్వకంబుగాఁ బ్రయాణసమయసముచితంబులగు ధనకనకవస్తువాహనంబులు దానంబు లొసంగి తదాశీర్వాదపూర్వకమంత్రపరికల్పితాక్షతదూర్వాంకురాదిమాంగలికద్రవ్యంబులు భక్తియుక్తిం గైకొని వారలవలన ననుమతుండై హజారంబు వెడలి శైబ్యసుగ్రీవమేఘపుష్పవలాహకసమాహ్వయగంధర్వబంధురంబును, బతంగకులధురంధరపతాకికావిలిఖితకంధరంబును, శంఖచక్రగదాశార్ఙ్గాదిదివ్యాయుధసమన్వితంబునుం గా జతనపఱిచి దారుకుండు దెచ్చిన శతాంగంబు

నకుం బ్రదక్షిణంబు గావించి ముంగల నిలిచి యభంగురమంగళావహానినదచాతుర్యంబు లగుతూర్యంబులు సెలంగ సాంగికంబులగుచుం దోఁచుశుభనిమిత్తంబులకుఁ జిత్తంబునందు సంతసిల్లుచు బలభద్రపూర్వకంబుగా నడచి రథారోహణంబు గావించి యొంటరుల నెలగోలుప్రజలముందరం జనఁ బనిచి యదువృష్ణిభోజాంధకప్రముఖబంధులోకంబుతోడ సాత్యకి నత్యంతసావధానత్వంబున వెన్నుగాచి రమ్మని నియోగించి శుభముహూర్తంబునం గదలి సుమంగలీసలిలపూర్ణకలశయుగకుసుమదామదధిక్షీరఘటాదుల నవలోకించుచు నభంగసముత్తుంగసౌధశృంగంబులనుండి పుణ్యపణ్యాంగనలు పెల్లుఁ వెదచల్లు సేసవిరులకు నుల్లసిల్లుచుఁ బురంబు నిర్గమించి యరుగునవసరంబున.

సీ. ప్రళయకాలోత్తుంగ ♦ జలధిభంగాభంగ, ఘుమఘుమంఘుమలతోఁ ♦ గూడియాడి
నరసింహవదనగ ♦ హ్వరసముత్థితమహా, కహకహధ్వనులతోఁ ♦ గలసిమెలసి
యసమానహాననదు ♦ ర్వ్యసనసంత్రాసిత, శ్వసనఘోరార్భటుల్ ♦ కసటుపఱచి
కనకదృక్క్షితభు ♦ క్కృతినదోర్మథనకృ, త్కృటికుభృద్ఘుటఘుట ♦ లటమటించి
బలసియీరీతి భువిలోనఁ ♦ బ్రబలిమెఱయు, శక్రలోకమహర్లోక ♦ సత్యలోక
తలతలాతలపాతాళ ♦ తలములంటి, భైరవంబయ్యె విజయభే ♦ రీరవంబు. ౯౭.

క. చతురంగబలసమన్విత, గతినీగతి పేరిరమ్ము ♦ గలపయనములన్
జతనముగ నడచి యదుకుల, పతి కుండినపురముఁ జేరెఁ ♦ బ్రాభవమెసఁగన్. ౯౮.

క. తనరాక విని భీష్మకుఁడు, తనయాప్తులతోడ నపుడు ♦ తగురీతి నెదు
ర్కొని పూజింపఁగ యదునం, దనుఁడప్పురిబయలను పవ ♦ నంబున విడిసెన్. ౯౯.

వ. అనిన శుకమహాయోగింగనుంగొని పరీక్షిన్నృపపుంగవుం డవ్వలివృత్తాంతం బానతీయవలయునని యడిగిన. ౧౦౦.

మ. కనకాచ్ఛాదనగౌరగాత్ర ఘనసమ ♦ గ్రస్ఫారనిర్ఘోషణా
వినిపాతాహితవీరవీరరసద్య ♦ గ్విజ్ఞాపనాజ్ఞప్తిభా
జన నానాసుగవారవారమహా ♦ సంరంభహృత్పుష్టన
జ్జనచక్రాద్యవతారతారకవిలా ♦ సశ్రీనఖాంచత్పదా. ౧౦౧.

క. కంసమదహంసవిదళన, శంసనముదితాయమాన ♦ శౌరీరవిభా
హింసాపరదనుతనుజ, ధ్వంసప్రభలోలవటన ♦ దమితవ్యాళా. ౧౦౨.

నర్కుటము. సరసిజపత్రవిలోచనసంస్కృతి ♦ సాగరమోచనసారకృపా
స్ఫురితసుదర్శనభవ్యహుతాశన ♦ శోషితకైటభనవ్యవపా

స్త్రరసమరోచితకైతవభాషణ ♦ సాధితనూతనభోజసుతా
హరబలజిత్వరధాత్ర్పముఖామర ♦ హారిపదాంగదదీప్తికరా. ౧౦౩.

గద్యము. ఇది శ్రీమదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణప్రాప్తచతురతరసాహితీవైభవ చక్రపామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మార్గణవిశ్రాణితమహాఫల కోవిదనుతభాగధేయ కోటీశ్వరనామధేయప్రణీతం బైనభోజసుతాపరిణయంబను మహాప్రబంధంబున ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.

క. శ్రీవర్ణనీయశతధీ, క్ష్మావిద్ధహృదయలలితవి ♦ హారవిచారా
పావనజనతావనబృం, దావనఘటితప్రచార ♦ నందకుమారా. ౧.

వ. అవధరింపు మప్పరీక్షిన్మహీపాలునకు శుకమహాయోగి యిట్లనియె. అట్లయ్యాదవకుల
ధురంధరుండు విదర్భానగరనవిధసమంచితోద్యానానవద్యమధ్యదేశంబున నపరంజికల
శంబులతోడి యరిదిసుద్ధారెపుటంపుఁదేజున నమరినజీవదంతపుంబలకలవింతం దనరు
పటకింట విడిసి వివిధసామంతమహీకాంతులను, యదువృష్ణిభోజాంధకప్రభృతులగు
బంధుజనంబులను, దదుద్యానబహిరావరణప్రదేశంబులఁ జతురంగబలసమేతంబుగాఁ
దగుపట్టుల విడియం బంచి విదర్భరాజసమర్పితవివిధోపచారంబులం బ్రొత్తగించుచు నపరి
మితవిభవంబున నున్నయవసరంబున. ౨.

సీ. విరహిజనస్వాంత ♦ విదళనకుంతంబు, తరులతాకల్పిత ♦ తతలతాంత
మంగనానూత్నవి ♦ హారనిశాంతంబు, శిశిరస్తుత్రాసం ♦ స్థితినిశాంత
సుభినవకిసలయ ♦ వ్యాకీర్ణపంతంబు, సుమగంధసురభిళ ♦ తసుదిగంత
సుమగళన్మధురస ♦ వ్యాప్తవనాంతంబు, భావజాతుగలక్ష్య ♦ పథికకాంత
మఖిలజనహృద్యసంతసో ♦ ద్యానసీమ, దేవతాస్వైరకర్మాంత్య ♦ భావతాతి
బహుళసుమనఃపరాగసం ♦ పాద్యమాన, సంతతవసంతమగుచున ♦ వంతమలరె.

మ. విదితంబయ్యెగినాకగండప్రసుద ♦ గీర్వాణగతుండౌటన
య్యాదుమూర్ధస్యకృతాధివాసపరిల ♦ భ్యాయల్లకప్రజ్వల
గ్భిదుదార్తిం మహీవాంబుపూరముమభూ ♦ భృన్మైకసానుస్థలీ
సదనాక్రాంతనితాంతసంగతులఁదీ ♦ ర్చంగోరుసేందంబునన్. ౪.

మ. వెనుఁజో కైశికులన్యథాన్ స్థగయశోఁబూ ♦ పెన్నిగ్ని మిత్త్రంబుకా
ననవహ్నిన్ గ్రసియించెనీతఁడనిత ♦ త్తత్సైన్యఘుముంగినిఁగ్న
ష్మునిమీఁదన్ ధ్వజమెత్తివేఁచునుగుఁడం ♦ చుంజేరియుంకస్థితిం
దనరెంగానియొడంగనంబడుసెమి ♦ నంబర్తఁజీర్తైవమున్. ౫.

మ. రమణాళింగనగాఢతానుఖధర ♦ ప్రత్యూహభూతేశ్వర
భ్రమదాఘాదినిశాఘరార్పణకృతి ♦ ప్రౌఢంబు సెంచెన్ వసం

తముదోషంబునకేమియొందుగుణమె ♦ న్నంజెల్లునంచుక్ సుధ్ధ
క్సముదాయంబుతదేక గేయతగనం ♦ గాహెచ్చెఁబైకధ్వనుల్. ౬

ఉ. మాఁకెనఁబోల్పఁగాఁదగని ♦ మస్తు మెఱుంగునశీతునందుపీ
ఠైకనుపట్టుమమ్ముఖళి ♦ రాసవరించెనుమస్తునూతిన
ట్లీకడనీమధూపకృతి ♦ నేమననౌనని వానిపల్లవ
శ్రీకలనంబు గాంచెనన ♦ స్త్రీలరదాంశుకముల్ రహింగ నెక్. ౭

మ. మెలఁతల్ దోహళదోహనప్రవణతక్ ♦ మేపుంచిపుష్పావళీ
విలసద్గుచ్ఛమహోదయమ్ నివిరిశీ ♦ విక్ బంభరీపత్సపు
ష్కలత్పుష్టిక్ ఘటియించితత్సురభిభా ♦ స్వన్మాక్షికాక్షీరధా
రలాగింబల్లవపాత్రి నించిమదనా ♦ ర్చల్ సేసిరవ్వేళలక్. ౮

సీ. మంజుగుచ్ఛమృగాంక ♦ మండలాంకంబులు, ఘనమహీరుహభద్ర ♦ భవ్యరుచులు
కుంజకుంజరగండ ♦ కుంభితమదధార, లసమాస్త్రిఖడ్గకు ♦ గ్గివరణములు
మృదులతాభామినీ ♦ మృగనాభితిలకమ్ము, లుద్యానమాత్రివ ♦ జోత్పలములు
యమదిగాశుగహస్తి ♦ హస్తశృంఖలములు, బహుళకేసరతృణ ♦ గ్రహణమణులు
సతతముస్తాప్తిసాదర ♦ స్తబ్ధరోమ, పవిసమరదారసంతత ♦ బాధభిద్య
మానభూవివరోద్ధకుం ♦ భీనసేంద్ర, గరళఘూమ్యాలుమధుపరే ♦ ఖలుచెలంగె. ౯

మ. ఘనశీతర్తుమహాంధకారములడం ♦ గక్ మల్లి కాసూనశో
భననక్షత్రపరంపరల్ నిగుడఁద ♦ ద్భవ్యప్రభాచంద్రిక
ల్దనరక్ మాధవుఁడక్ విధుంతువిలసి ♦ ల్లంగాకయమ్మానినీ
జనతాస్వాంతశిఖాకలాపములనా ♦ ర్చంగూడు నేయేరికిక్. ౧౦

తే. స్థాణువునకైనఁబల్లవ ♦ శక్తిగలుగ, వెలసినవసంతమొక్కటి ♦ కలుగుఁగాక
మానవపితనితంబినీ ♦ మానసాళ్ళ, వితతికరఁగుచెయొటువంటి ♦ వేళనైన. ౧౧

సీ. మాధవసంవ్యాన ♦ మాంజిష్టవసనంబు, వనరమాకృతిపట ♦ వాసకంబు
ఘనకుంజకుంజర ♦ కాంచనవర్ణంబు, క్ష్మాజవీరాతామ్ర ♦ కంచుకంబు
విరహిహృదుద్గత ♦ స్మరకృశానుభరంబు, లతికాహిఫణమణి ♦ వితతిదీప్తి
కుంభీనదృతశోణ ♦ కూలరజోరాజి, హైమనకేతవని ♦ శాంతసంధ్య
విపులవనరాశిసముదిత ♦ విద్రుమప్ర, రోహసంజాతనిర్నిద్ర ♦ పుకప్రీకాండ
ఘంగజతురంగవల్గనో ♦ ద్ధతరజంబు, విన్నమంబయ్యెవనవీధిఁ ♦ గసుసురజము.

మ. స్మరభద్రేభతతిం దెల్పెం జందనవనగాం ♦ చన్దంధవాహాంబుపు
ష్కరఖేలన్మధుపాళిశృంఖలపరా ♦ గస్వర్ణవర్ణాస్తృతి
స్ఫురదుత్ఫుల్లసుమాళిపద్మకమధు ♦ స్ఫూర్జన్మదాసారపై
కరవాభీలపురోధరాయుతిశో ♦ కధ్వానఘీంకారితన్. ౧౩.

సీ. ఘనకుంజమృగనాభి ♦ గతరక్తధారలు, స్మరశిలీముఖముఖ ♦ జ్వలనశిఖలు
వీకుత్ప్రితతిఫాల ♦ సారసిందూరమ్ము, లారామకమలాంఘ్రి ♦ యావకములు
పికజాతవాయాన ♦ ప్రకటకోపరసమ్ము, లవనిజమానిజ ♦ టాళిరుచులు
మధువర్గపరివృత్య ♦ మానేంద్రగోపమ్ము, లారణ్యకాసారం ♦ హల్లకములు
సాంద్రవనరాశిభాస్వరా ♦ స్థానమీః, సన్నివిష్టసుమాకర ♦ సన్నిధాన
ఘటితనీరాజనప్రభా ♦ చ్ఛటలనంగ, నుల్లసిల్లె వనమ్ములం ♦ బల్లవములు. ౧౪.

శా. శ్మారుశ్మంపెలలాంబరీప్రపృథుతర ♦ స్తంభంబునన్ మాధవుం
డారూఢిన్ జనియించి శీతబుతుమాం ♦ సాశిన్ వడిన్ బ్రచ్చుచో
నారక్తద్యుతిపూరతన్నఖశిఖా ♦ వ్యామోహకృద్దీప్తిచె
న్నారంగింశుకకోరకమ్ములుసము ♦ ద్యల్లీలలన్ రంజిలెన్. ౧౫.

శా. పున్నాగంబులుపూచెనుంపదగదన్ ♦ బుద్ధిన్ వసంతుండవే
శ్నాన్నాళీకశరాసనప్రభునకుం ♦ దానమ్ముచో నాతఁడా
పున్నాగంబులె పూనిపాంథవిజయ ♦ స్ఫూర్తిన్ విజృంభించె నె
ట్లన్నన్ గెల్పులభించు పేశలనకృ ♦ త్యంబైన మేలియ్యదే. ౧౬.

సీ. కేళీసరోవరా ♦ లోలకల్లోలసం, రావంబుమద్దళా ♦ రవముగాఁగ
మకరందరసపాన ♦ మాద్యన్మిళిందఝుం, కారంబుతగుపాటం ♦ గంబుగాఁగ
శుకకోకిలకలాప ♦ సుకుచిరాలాపంబు, జతిగూర్చుపెండిసం ♦ స్తుతులుగాఁగ
రమణీయవిస్ఫురర ♦ సుమనఃపరాగంబు, కెంబట్టుజవనిక ♦ డంబుగాఁగ
జలితికిసలాభినయహస్త ♦ నలనమమర, మగునిముందటవనరంగ ♦ మధ్యమందుఁ
దనరుకరుపలిసూత్రధా ♦ రునిపిలాన, లలితగతులలతాపాత్ర ♦ ములునటించె. ౧౭.

క. విరహిజనమానహారిశో, త్కరములనుటుమాడిబలుమ ♦ గంటిమిమిగులన్
మెఱయుమవలరాచబెబ్బులి, కరరుహములంతవరుఁగింశు ♦ కమ్ములమొగ్గల్. ౧౮.

క. అలరువిలుకాఁడుపాంథుల, గెలువన్ గమికింపనతని ♦ కేల్ మధుండు ప్రియుం
బలరనొసంగినతిరకస, ములవిలెనుగొనుమనికుంజ ♦ ములుగమనరోయ్యన్ ... ౧౯.

మ. అతినీరంధ్రనికుంజబింబఫలవీ ♦ థ్యాపక్తకీరంబుతి
ల్లలి కానంపళితత్రికంబగుమని ♦ ల్పాక్ జెక్కులంజక్కఁగు
చ్ఛతతుల్ గన్పడునైకపాంథవిజయా ♦ సక్తస్మరాగ్రస్థలా
నతవాలాత్తఖలీనసూత్రహయతూ ♦ ణద్వంద్వముం బోలుచున్. ౨౦.

సీ. మానయోగంబులు ♦ మానుల్లోమిఁ జెందె, మహనీయజాతిసం ♦ పదనుమదను
వేలాపరిష్కృతుల్ ♦ విరహుల్లోల్లమిఁ జెందె, నతులితోద్యానదే ♦ వతలలతల
శ్వేతతాశిశిరముల్ ♦ శీతాంతమునఁ జెందెఁ, బ్రణయకోపార్తుల ♦ తనులవనుల
భూతిగర్మముల ♦ జాతిమొల్లమిఁ జెందె, సుంద్రపుష్పితవమే ♦ రువులనవుల
మంజులోకకుంజసుమపుంజ ♦ మస్పృణఘుసృణ, రససదృశకౌసుమపరాగ ♦ రాగజనిత
మోహసవ్యాహజంతున ♦ మూహమృదుల, మలయమరుదంకురమ్ములు ♦ కలయవిసఁగ.

సీ. తొలుదొల్తఁ బొదరిండ్లఁ ♦ దూఱిక్రొన్ననలపై, వ్రాలిమధువుతేమి ♦ వనటచెంది
కోరకతతులపైఁ ♦ జేరియాసక్తిచే, నవిపీల్చియాపోవ ♦ కనలికేగి
కుసుమముకుటిమబ్బ ♦ వెనమూఁగిమధువాన, నక్కొండుటను జేసి ♦ వెక్కుపుట్ట
నించుకించుకత్రావి ♦ చంచువుపదనొంద, నాత్మప్తిగ్రోలఁబో ♦ నంతలేమి
నచటుఁ బొసిమూవనమెల్ల ♦ నరయఁగోరి, వెతనుదిగు గాడునవిలాభి ♦ హతినిసోలుఁ
జైత్రికాదిత్సుధాక్రాంత ♦ చంచరీక, వినరమవ్వేళవనమెల్ల ♦ ముసరుకొనియె. ౨౨.

క. శరవర్షధారలుడుగక, పఱపెడునసమశరకుసుమ ♦ బాణాసనవి
ష్ఫురితగుణారావమ్ములు, తెలుపయ్యెన్ మత్తమధుప ♦ తతినినదమ్ముల్. ౨౩.

సీ. శిశిరర్తువిరహదు ♦ ర్దశదీఱసహకారి, సీనుసుధాప్లుతి ♦ చెందఁజేసి
స్థలపద్మకరపద ♦ చలనాప్తినిజెలంగి, కొదమతుమ్మెదచూడ్కి ♦ బెదరమాచి
గుచ్ఛస్తనస్రంసి ♦ కుసుమరజోరాజి, సంవ్యానవసనంబు ♦ చక్కఁజేర్చి
చందనభూమిజ ♦ శాఖాళికరమూఁది, గంధవాహవిలాస ♦ గతులఁదేచి
వనరమాశైలదుహితృ ♦ కృపాకటాక్ష, ఘనసుదంచితహృదయేశ ♦ భువనవిజయ
సాధనసమగ్రకిసలహ ♦ స్తములుదనర, వల్లరీకేళినీకాంత ♦ యుల్లసిల్లె. ౨౪.

మ. చెలియొక్కర్తుముఖాబ్జవాసనకునై ♦ చిట్టాడుభృంగావళుల్
తొలఁగన్ మోముమల్లరియుడుందలకముం ♦ దూరంబునం బోవన
య్యళులున్మత్తతమత్తిలపదీక్షణగతిం ♦ బ్రాపించెఁ జానాసల్లన
త్తిలకశ్రీలనగన్ గతానుగతముల్ ♦ తిర్యక్తతుల నామహాన్. ౨౫.

మ. స్వరవాణీకలవాక్ప్రపంచములతో ♦ వైరంబు గావించు త
త్స్వరపుష్టాళిశు కాళికిన్ వెఱచి మేఁ ♦ తల్ చూతముల్ డాఁపఁ న
త్తఱినమ్మానినినమ్మికిచ్చుగతిహ ♦ స్తంబుంచఁదోడ్తోనె ని
ర్భరలీలన్ గిసలప్రసూనఫలసం ♦ పత్ప్రాప్తి హెచ్చెంగడున్. ౩౩.

మ. వనజాక్షీముఖనవ్యపూర్ణశశిబిం ♦ బస్ఫారరాగంబు దోఁ
చిన వేళన్ స్మరదేవసన్నిధినుద ♦ ర్చిర్భ్యారదీపవ్రజం
బునిరూఢస్థితిఁ గాంచఁ జూచి జనముల్ ♦ పూఁబోండ్లనక్షత్రద్యుతిన్
గనకస్త్మోజముపూయునంద్రుమతిగునే ♦ కల్పింపనీసంగతుల్. ౩౪.

సీ. శశికదళీరజో ♦ విశదాభ్రవిభ్రమా, యాతకైరవగుచ్ఛ ♦ హంసకులము
మకరందరసవర్ష ♦ మాద్యదిందీవర, ప్రాగ్భారచాతకా ♦ ర్భకచయంబు
స్ఫాటికవేదికా ♦ ఛాయామరీచికా, సంవిన్నపాంథహృ ♦ చ్ఛంబరంబు
జలసూత్రసలిలశే ♦ శతుషారశీర్ణపి, కాదష్టకిసలయో ♦ పాధరంబు
మలయపవమానహిమమరు ♦ ల్లలితకలిత, దీధితిజపాకుసుమహాసం ♦ తీచయంబుఁ
గనుచు నామనికృష్ణసే ♦ వార్థమడిగి, యఖిలఋతుసంపదవహించి ♦ నట్లయుండె.

మ. స్మరయోగీశ్వరుఁడధ్వనీనజనతా ♦ సంహారవాంఛన్ వనా
గ్స్వరరాడంచదశోకగుచ్ఛనివహో ♦ ద్యద్వహ్నికుండంబునన్
బరపుష్టారవమంత్రఘోషముచలి ♦ ర్పన్ వేల్మిగావింపభీ
కర మైపుట్టినకృత్యనా నెగసెభృం ♦ గశ్రేణినీలచ్ఛవిన్. ౩౫.

సీ. తియ్యదేనియఁగ్రోల ♦ ద్విగుణీకృతంబైన, మధురతనధరబిం ♦ బములుదనర
హురుమంజిపసులతో ♦ నొఱపుగాఁబెనఁగొని, కదియుమల్లెసరాలఁ ♦ గంపములర
వివిధప్రసూనత ♦ ల్పవిహారములఁదనూ, కమలవాసనకదం ♦ బములుమీఱఁ
జేరివిరవిరులకై ♦ చిట్టాడుమగతేఁటి, చాయలనిడువాలు ♦ జడలుమెఱయ
ఎలిపెచెంగావిపావడ ♦ కలసిమెఱయఁ, గొమరుచివురాకుటంగది ♦ ట్టములువర్వ
చిఱుదొడలమిన్నలెంతేని ♦ చికిలిసేయఁ, దెరవలెనసిరివిరులయో ♦ వరులవరుల.

వ. ఇత్తెఱంగున సకలవిరహిణీజనజైత్రం బగుచైత్రంబు విజృంభించునవసరంబున విదర్భ రాజనగరసవిధోద్యానసీమ విడిసియున్న యన్నలిననయనుండు నిజాంతరంగవిజ్ఞాన కళాభిరాముండు శుకకింకిణిధాముం డనునమ్ముంజెలికానికై దండం బూని యవ్వనిం గలసౌభాగ్యవిశేషంబునుం జూచు నెపంబున సిక్కణీచపలలోచనవలన నుపగతం బగు

మరలు కాఁక నపనయించుటకు వెడలె నట్టియెడ నల ప్రియవయస్యుండు నొక్కెడఁ దదుద్యానసౌభాగ్యంబు చూపి గోపాలదేవున కిట్లనియె. ౩౮.

చ. కమలదళాక్ష చూడుమిటఁ ♦ గ్రమ్మెడుఁ గుమ్మదపిండు మెండుగా
సుమరజమంగసంఘములఁ ♦ జొప్పడ నొప్పెడునధ్వనీనబృం
దములజయింపఁబంపు నెడ ♦ దర్పకుఁ డాత్మబలంబు వెంటనీ
భ్రమరకులంబుఁబిల్చిపట ♦ వాసమొనర్పఁగఁబంచెనోయనన్. ౩౯.

గీ. బహుళకింశుకచంచలా ♦ భాసివిపిన, ముదిరసందోహసర్వత్తో ♦ ముక్తనిబిడ
మధురసాసారమనఁదోఁచు ♦ పృథులకరక, సంఘమననిష్పపూలొప్పె ♦ వరసిజాక్ష.

క. సురసాలము హారువుననీ, సురసాలముదనరెనిచటఁ ♦ జూడుము కిసల
స్ఫురదురుచినిచయంబులు, కురువిందాభరణదీప్తి ♦ కొమరువహింపన్. ౪౦.

చ. మలకలు గాఁగ జేజిగురు ♦ మావిజిగిన్ దొగరెక్కటేటిచాల్
నిలిచినయందమిచ్చటభ ♦ లీయనన య్యెడుఁజూడవయ్యయో
నళినదళాక్ష పాంథులది ♦ నంబునఁగుత్తుకగోయ నెత్తుటన్
దళమయిత్తోఁచుమన్నరతి ♦ నాథుని మేల్ కిరునుంబ లెందగన్. ౪౨.

ఉ. నీరజనాభ కంటి వెవ ♦ నీరమపుష్పిణియాటఁగాంచి యొం
తేరహినీయనంగువన ♦ దేవతలీసుమపుంజకేళి కా
గారమునందుఁగూడుకొని ♦ గంధఫలీనయదీపభృంగరుచుం
కారసుగీతికల్ మెఱయఁ ♦ గావిగలన్ దళిమంబమగ్నుటల్. ౪౩.

సీ. తలఁబ్రాలువ్రాయుచో ♦ నిలమీఁదఁజెదరిన, ముత్యాలనమధూక ♦ ములు వెలుంగఁ
నవగాడియంగనల్ ♦ భవళంబులనునట్లు, దంచరికాంగనా ♦ న్వనము నిగుడ
మునుమున్ను నిగిడెను ♦ మునుబయోగ్యాద, ఘనోద్గంబులనద్వా ♦ క్షులు వెలుంగఁ
గలయ నెల్లెడనించు ♦ కాహళాగనముదాఁ, గలకంఠనాదముల్ ♦ గ్రమ్ముకొనఁగ
పికచకింశుకకుసుమన ♦ సీనకాంతి, సంతతివసంతమైపర్వఁ ♦ జైత్రవిభుఁడు
వనరమవరింపనాయితి ♦ పజిచినట్టి, పరిణయాగారవిూవనీ ♦ భాగమధిప. ౪౪.

వ. అని యనేకవిధమ్ములఁ బ్రియవయస్యుండు విన్నవించునవసరంబున. ౪౫.

సీ. సఖుఁడుపల్లవజాల ♦ సౌభాగ్యమునుతింపఁ, దరుణిపాదాబ్జముల్ ♦ దలఁచితలఁచి
చెలికప్రపుటమంటి ♦ చెలువునుబొగడంగ, వెలఁదికనుదోడల్ ♦ దలఁచితలఁచి
నరసవయస్యుండు ♦ చంపకంబునుతింప, జలజాస్యనాసికఁ ♦ దలఁచితలఁచి
మిత్రుండురహిమించు ♦ మెట్టతామరవెంచ, నలివేణినెమ్మోముఁ ♦ దలఁచితలఁచి

సంగడీఁడు సమంచిత ♦ చంచరీక, తతినిగోనియాడ సతి వేణిఁ ♦ దలఁచి తలఁచి
మతి సుతియును వేడ్క గాంచిన ♦ స్మరధవునకు, నింతిపై మోహమంతింత ♦ కెక్కుడయ్యె.

క. లలనఁ బొలిసుపవన, స్థలి వానాగతులనిట్లు ♦ దలఁచుచు యదురా
ట్కులనాథుఁడు కోకిలకా, హళి నాదము సైఁపరామి ♦ నడలుఁ మిగులన్. ౪౭.

చ. అడలుచు నీగతిఁ బ్రియవ ♦ యస్యుని గన్గొని యయ్యదూద్వహుం
డుడుగక పైపయింగవియు ♦ నుగ్రసుమాశుగతీక్ష్ణబాణపుం
జడికిఁ గనోర్వలేననుచుఁ ♦ జాలునలంగికలంకఁ జెందినం
డిడుమదియేమి సేయుదువి ♦ నీతసఖా చెలిఁ జూచు టెన్నఁడో. ౪౮.

క. నీపలికినపల్కులెయ్యది, ద్దీపకములు మాకుఁగన్నె ♦ తిన్ననిరూపుం
జూపట్టఁజేసెనితర, వ్యాపారము దెలియదేమి ♦ రాప్రియమిత్రా. ౪౯.

సీ. స్మరవృగేంద్రకిశోర ♦ చాపమౌర్వీఘోర, నినదాగ్భటికిఁ దాళ్లి ♦ నిలుపరాదు
మకరందరసపాన ♦ మాద్యన్మిళిందౌఘ, ఝుంకృతుల్ పెంపైన ♦ సైఁపరాదు
విరహిహృద్భేదనో ♦ ద్వేలకోకిలకల, ధ్వనుల నాలింపంగఁ ♦ దగను గాదు
వివిధకాంతాభంగ ♦ విరహాసముత్తుంగ, జలగాశిఁదరియింపఁ ♦ దరము గాదు
కాముకతటాకతటసము ♦ త్కటరథాంగ, జాలశృంగారలీలమఁ ♦ దాళరాదు
మదవతిఁదలంచికంటికి ♦ నిదురరాదు, కింకిణీదామయీ కాన ♦ నాంకసీమ. ౫౦.

సీ. విరిసురటీలచేఁ ♦ బొలఁగుసేయఁగాఁక, పువ్వుఁబోఁడియూర్పుగా ♦ ర్పులను గాక
తలిరాకుగుత్తుల ♦ దఱుఁగుసేయఁగాఁక, ననబోణి కేలునోఁ ♦ కినను గాక
పన్నీటివఱదలం ♦ బాయుసేయఁగాఁక, నెలఁతమైచెమ్మట ♦ నీటఁ గాక
అన్యకథాసక్తి ♦ నడఁగుసేయ్యఁగాఁక, వెలఁదిప్రస్తాంతంబు ♦ వినుటఁ గాక
పరిపరివితానఁబూఁదేనె ♦ నెరయుమేన, నించినంతనె చనునె యీ ♦ నిందుకాఁక
నీరజాతాక్షి పలుకు తే ♦ నియలఁ గాక, యేలచెలి కాఁడనీవున ♦ న్నిట్లు వేఁడ. ౫౧.

వ. అని యిత్తెఱంగున నయ్యదుకులోత్తముండు చిత్తవృత్తిమీఁద నొత్తమిల్లి నయ్యుల్లము నవవిహారమ్ము క్రొత్తసేయుటయుఁ జిత్తజుని చేతిచివురాకు కత్తికోఁతలకు నొత్తిలపడుచు నకట నచట నిలువనోపక మెత్తంబడిన తాలిమిం జిత్తభిత్తి నత్తఱిదరి హావభావంబులు చిత్రించినతెఱంగున హత్తుట యొత్తలపడుటం జూచి కింకిణీదాముం డతని కిట్లనియె. ౫౨.

క. మేరాయిదిమీవంటిమ, హారాజునకెందునవ్వ ♦ గారసిన్నపాటుల్
ధీరోదాత్తుఁడవిటునీ, యారాటమునీకునాయ ♦ మాఱనవమాఁ. ౫౩.

క్కలమునసాపయింగనలఁ ♦ గాఁదగు నేనగుమోముఁజూపుమో
జలరుహగంధిలాఁతిన శె ♦ చంద్రముఖీచల మేలభామినీ. ౬౨.

ఉ. భూసురుఁడేగుదెంచివిరి ♦ బోణికినీపయికూర్మియగ్గలం
బైనమకూరునోయదుకు ♦ లాగ్రణినీవిఁకజాగు సేసినం
గాసిలుఁజానసానిజము ♦ గాఁదలపోసితిఁగానియీవితం
బోసరసీరుహాక్షియిటు ♦ లొల్లమి సేయుటెఱుంగనింతయుఁన్. ౬౩.

సీ. కమలాక్షినీకటా ♦ క్షములుగల్గినగాని, చంచరీకములజ ♦ యించఁజాల
నలివేణినీపల్కు ♦ లాలకించినగాని, రాచిల్క బహుసార ♦ సైఁచఁజాల
ముగుదనీనెమ్మోము ♦ ముద్దుగొన్నను గాని, హరిణాంకుగుపంబు ♦ నణఁపఁజాల
రాజీవనయననీ ♦ రాకఁగాంచినఁగాని, యంచలపొగరుమా ♦ యించఁజాల
వెలఁదినీమేననేకీభ ♦ వించికాని, యించువిలుకానిమాయజ ♦ యించఁజాల
యేలరారాపు సేసెద ♦ వేలతాంగి, యలఁతనీఁకఁదాళనీయాన ♦ హంసయాన. ౬౪.

ఉ. నీనిడువాలుకన్దళుకు ♦ నీదగుసెన్నడకుల్కునీజగా
తేనియలొల్కుపల్కు కడు ♦ తేఁటగునీనును మోవిరంగునీ
కౌను మెఱుంగునీతొడల ♦ కైఁపునునీసొగసైనరూపునో
మానినిమానినిల్వదిఁక ♦ మానసమానసుమీసుమాస్త్రుపైన్. ౬౫.

క. అని పెక్కుగతులదీనత, గనుపడఁబ్రార్థించుయదుశి ♦ ఖామణిమీఁదన్
మనసిజుఁడు మెఱుఁగుచాయల, నవబాణాకత్తిఁగురుసు ♦ నన్ బరసించెన్. ౬౬.

శా. ఫుల్లేందీవరపత్రనేత్రకచాం ♦ భోజస్ఫురద్వక్త్రయై
యల్లీలావలియాత్మనెక్కొనఁగఁద ♦ ద్ధ్యానాత్తతంబగ్నినా
మల్లధ్వంసివిలోచనద్వయము నా ♦ త్మస్వైరపూర్ణోదయో
ద్యల్లీలన్ వహియించనోడెనన ♦ ద్ధస్మేరతన్ జొప్పడెన్. ౬౭.

సీ. దండశూకాధీశ ♦ తల్పుఁడౌకృష్ణుని, మందానిలములకుఁ ♦ గ్రిందుపఱిచె
రామత్రయావతా ♦ రముగన్న వెన్నుని, నగుటుకోయిలధాటి ♦ కొదుఁగఁజేసెఁ
గనకాంబరచ్ఛన్న ♦ గాత్రుఁడౌశౌరినీ, కొదమతుమ్మెదలకు ♦ బెదరఁజేసె
సింహికాసుతశిర ♦ శ్ఛేదియౌయదువర్యు, జాబిల్లి కాఁకకు ♦ జడియఁజేసెఁ
గుంభినీభర్తయైనయ ♦ గ్గోపవిభుని, దనదురసదాడివింటికిఁ ♦ దరలఁజేసె
ననినముల్లోకములనింక ♦ నరసి చూడ, మదనునిభుజాబలస్థుని ♦ నెగుడుగల దె. ౬౮,

సీ. కలశాబ్ధి నేప్రొద్దు ♦ నెలకొంటనంటిన, తద్దీప్తినామేన ♦ ధవళిమలర
దావానలాస్వాద ♦ నాజన్యధూమాంకు, రములనాఁబలకొంకు ♦ రము నెలంగ
జఠరస్థితానేక ♦ జలధులొక్కుమ్మడిఁ, జెమ్మగించినరీతి ♦ స్వేదముబుక
సుహితమందరకుభృ ♦ ద్వహనజాతశ్రాంతి, కరణినిట్టూరుపు ♦ గాడ్పులెసఁగ
నీదృశాసక్తిగోపిక ♦ లెచటవిందు, రోయి నెడుభీతిఁబలెఁగంప ♦ మొదవ మేన
బంధమోచనదక్షుండు ♦ పంకజాక్షుఁ, డమృతకరముఖిప్రేమబం ♦ ధమునఁదగిలె.

వ. ఇవ్విధంబున వసుదేవనందనుండు మందానిలస్యందమానోద్దండకాతరమానసుం డగుచు విరహదవదహనతాపంబున వివిధప్రకారంబుల వేఁగుచుండె నంత నక్కడ నమ్మహీసురుండును యదుసార్వభౌమునివలన సంభావనాపూర్వకంబుగా నంపించుకొని యతిత్వరితగమనంబున విదర్భదేశాభిముఖుం డగుచుఁ గతిపయప్రయాణమ్ములఁ గుండిననగరమ్ముఁ జేరె. అంతకమున్న యన్నారీరత్నంబు వృష్ణికులరత్నం బగుకృష్ణునకు నిజమనోరథంబు నెఱుకపఱిచి ప్రయత్నంబునఁ దేటపన్నీట మజ్జనం బాడినట్టులు నారగించినట్టులునుం భావించి యబ్జరేఖయుఁ జకోరాక్షియు నబ్జవదనయు లలితయు రసమంజరియు నను ననుంగుఁజెలులు గొలువ నిరుపమానయామవతీరమణకిరణగణగళదమృతశితశీతలకరశిలాతలరచితవిమలవేదికాతలంబున నధివసించి యాత్మగతంబున. ౨౦.

సీ. జననిచేనంపించు ♦ కొనిచన్నవిప్రుండు, కడుదూరదేశముల్ ♦ గడచునెట్లు
కడచెఁబోయాయాస ♦ మడరఁగనిలువకే, యూరఁడాద్వారకఁ ♦ జేరునెట్లు
చేరెఁబోయీశాన ♦ వారిజాసనులకు, దొఱకనిహరికొల్వు ♦ దొఱకునెట్లు
దొఱకెఁబోగాంభీర్య ♦ ధుర్యుఁడాశౌరిబ్రా, హ్మణునితోఁబిలిచిమా ♦ టాడునెట్లు
లాడెఁబోనాదుమదిమన్న ♦ యట్టిపసమాత, నాత్మనంగీకరించియు ♦ య్యమరవంద్యుఁ
డిటకుఁజనుదెంచునెట్లుమ ♦ దీప్సితంబు, సఫలముగఁజన్నుఁగైకొను ♦ జాడలెట్లు.

గీ. అన్నసభలోననిన్నఁదా ♦ నన్నమాట, విన్నఁదోఁచెనునామది ♦ నేయుప్రయ్యు
లగుచుఁజనకున్నదప్పుడే ♦ యరిసిచూడ, వ్రజముఖమంచుఁజింతింప ♦ వలయునిజము.

క. నాపాలిభాగ్యదేవత, గోపాలునినిటకుఁదచ్చి ♦ గోనగూర్చునెదు
ర్వ్యాపారుఁడైనకుక్షికిఁ, బ్రాపైవాఁడెన్నినట్ల ♦ ఫలమిచ్చునొకో. ౨౩.

మ. అనిచింతించుమనస్విలందికుసుమా ♦ స్త్రాభీలచాపోష్షిత
స్వనదత్యుగ్రశరాళికిన్ సుమరసా ♦ స్వాదప్రమాద్యత్స్ఫుర
న్నినదత్రాసకరాళికిన్ విరహిహృ ♦ న్నిర్భేదనారక్తలో
చనభృత్కోకిలపాళియాళికినిజ ♦ స్వాంతంబుకంపింపఁగన్. ౨౪.

చ. నగుఁదలయూఁచు నుస్సురను ♦ నల్దెసలుం బరికించు మిన్నకే
బెగడుఁ దపించుఁ జేరిచెలి ♦ బిల్వఁగఁ బోవుఁ దనంతనంతలో
మగుడుఁగ రారవిందమును ♦ మాటికిఁ జెక్కునఁ జేర్చు నేమిరా
నగధరియుంచు గొంకులల ♦ నామణిచిత్తజమోహమగ్నయై. ౭౫.

గీ. ఇట్లువిరహాగ్నిఁ దపియించు ♦ నింతిఁ జూచి, యబ్జరేఖాదులైనయ ♦ య్యబలచెలులు
గుసగుసలఁ బోవఁ దొణఁగిరి ♦ యసమశరశ, రార్తియోయిది వేరొండొ ♦ యనుచు నపుడు.

సీ. మృదుతనూసుమవల్లి ♦ మిగులఁ గాఁగఁ దొడంగె, నీకైన మైపూఁత ♦ పేటులెత్తె
సొగసులేఁ జెక్కుల ♦ సుక్కిళ్లుగనుపట్టె, పదనారవిందంబు ♦ వాడుపాఱెఁ
గమ్మచెమ్మటనీరు ♦ గలయ నెమ్మేయిఁ బర్వె, నిట్టూర్పుగాడ్పులు ♦ మట్టుమీఱె
సుదిరిచాయలనీను ♦ నొడలు వెల్వెలఁ బాఱె, వెడవెడ నెంతేని ♦ వడఁకుదోఁచె
నుల్లమునఁ జింతలంతంతఁ ♦ బల్లవించె, మనలపైఁ గూర్మి నానాట ♦ మట్టుపడియె
కంటిరే చెలులారయీ ♦ కాంతయున్న, పతము మనకెల్లఁ జూడఁగ ♦ వింతయయ్యె.

మ. అనినన్ సవ్వచు నబ్జరేఖ చెలులా ♦ రానిన్న యిక్కన్నెయి
వ్వనిపూవుల్ గొనవచ్చి వావిలివిరుల్ ♦ వాంఛింపనిట్టూర్పుగా
డ్పునఁ గల్పించుమటంచు నేననఁగఁ దో ♦ డ్డోనట్లు కావింపయే
మని నేఁ బల్కుఁ గుదీనియూర్పు సెకలా ♦ హా పెంచె నవ్వావిలిన్. ౭౮.

చ. అనర సమంజరిట్లనువ ♦ యస్యలుఁ వింటిరె నిన్న రేయి నీ
కనకలతాంగి మైచెమట ♦ గ్రమ్మని దేమని యేను వేఁడఁ నా
వినకరనక్తి నాఁగ నినుఁ ♦ డేడి యనన్ శశిఁ జూపని ల్పికా
దననవునంచుఁ బల్కుచను ♦ నంతియకాని యెఱుంగ దేమియున్. ౭౯.

చ. అనిఁ జకోరనేత్రయను ♦ నంబుజలోచనలార నిన్న నీ
కనకనిభాంగినన్ బిలిచి ♦ గందముఁ బూయుమనంగ నేను న
ట్లనసవరింప మేని సెక ♦ లన్ను సుగంధము బీటలెత్తెఁ జం
దనమును లంద నేరవని ♦ నన్ననుఁ గాని యెఱుంగ మూర్మమున్. ౮౦.

మ. అనన బ్జాస్య యనున్ వయస్యలకు నీ ♦ యబ్జాక్షికై నేయుమా
ఒన నేసొమ్ముల పెట్టి తెచ్చి మణిభూ ♦ షానీకముల్ బూన్పఁ బో
యిన నొండేని యుఁబాటిగామి నివియే ♦ మేచెల్ల నా సొమ్ములా
వను మంచావను గాని నేరదఱుఁగన్ ♦ ప్వగ్రాస్త్రకారార్యవ్యస్తలిక్ ౮౧.

చ. అనలలితాంగి సెప్పఁజెలు ♦ లారవినుండొకవింతయేనుమ
జ్జనమొనరింపలెమ్మనినఁ ♦ జక్కఁగసైతమునన్నుఁ జూడకే
మనసొకచోటఁబాఁచుటను ♦ మానినిరోయలచోటికీవుపో
మ్మనియనుఁగానియేఁబలికి ♦ నట్టివితంబెఱుంగదింతయున్. ౧౨.

క. అనియీగతియాలీతతి, 'వనజేక్షణయున్నరీతి ♦ వాకొనితమలో
మనమిపుడీకన్నియనె, మ్మనముంగనకున్నఁగడుఁప్ర ♦ మాదంబనుచున్. ౧౩

క. చెంగటికిఁజేరియనిరో, యంగననీవున్నవితము ♦ నరసినమాకున్
వింగడమైనదియున్నతె, ఱంగెఱిఁగించెదవొమమ్ము ♦ తాపిదియెదవో. ౧౪.

చ. పలుకవిదేటికేచెలులు ♦ పళ్ళుఁబిల్చిననొల్లవేటికే
జలకములాడుమన్నమముఁ ♦ జక్కఁగసైతముచూడవేటికే
కలపమలందుమన్నమదిఁ ♦ గైకొనవేలభుజింపుమన్నబి
ట్టలిగెదవేలనీచరిత ♦ మక్కటమిక్కిలివింతయయ్యెడిన్. ౧౫.

క. అటమటవాఁడెను మొగమును, గటకటవసివాడిగడియ ♦ గడియకుమేనున్
గిటగిటనగుచుఁగృశించెను, జిటిపొటినగవుల్ దొఱంగెఁ ♦ జేడ్పడెనెదయున్. ౧౬.

క. కామినినీవిటులుక్కకి, దేమినిమిత్తంబు మేము ♦ నింతంతటుపో
రామిగలవారమనుచు, న్నామదినెన్నెదమునీమ ♦ నంబెటులున్నన్. ౧౭.

ఉ. మోమఱవాంచియున్నమఱి ♦ ముచ్చటకేనియుఁబల్కకున్నదృ
క్తామరసంబులందొగరు ♦ దార్కొనఁజూచినఁగేల్విదర్చినన్
ప్రేమదొఱంగిపల్కనను ♦ బిట్టవలించితృణీకరించినన్
భామినిమాకునమ్మికలు ♦ పాటిలనేరవునిన్నుఁజూచినన్. ౧౮.

క. నీవెంతదాఁచినను నీ, భావంబొకకొంతయెఱుఁగఁ ♦ బడకుండునటే
దైవాత్మకసమముఖముదె, యావలివసివాడెనేల ♦ యదికనుఁగొనమే. ౧౯.

సీ. ఊరుపుబలువేఁడి ♦ మీరఁగఁగమలిన, కరగతాబ్జముమొఱ ♦ చుఱులుదెల్ప
నంతంతకునుహెచ్చు ♦ నతనుతాపస్ఫూర్తి, ననిశంబునెపఁబర్వ ♦ నదరుదెల్పఁ
బలుమాఱుచెలిపిల్వఁ ♦ బలుకంగవసపోమి, నరగంటనిఘ్చును ♦ త్తరముదెల్ప
నత్యుష్ణబాష్పంబు ♦ లలవోకనొత్తంగఁ, దడిసికందినగుచ్ఛ ♦ తతులుదెల్ప
నదరుసెవ్వగఁబొరినుస్సు ♦ రనుటదెల్ప, భావభవభీతివడినుల్క ♦ పడుటదెల్పఁ
దెగువమోముఁదెచ్చుకోల్ ♦ తెలివిదెల్పఁ, గొమ్మనీయున్కియేమాకు ♦ గుఱుతుగాదె.

చ. అనవినియబ్జలోచనవ ♦ యస్యలనిట్లను లేనిపోనివిం
గనుఁగొనినట్లనాపయినిఁ ♦ గల్గఁగమో పెదరక్కలారమీ
మనమున వేడ్కగల్గినను ♦ మానిని వేఱెయొకర్తు లేదెత
చ్చనలకు నేలనాకిటుల ♦ జాలియొనర్పఁగఁజాలుఁ బ్రొక్కెదన్. ౯౧.

గీ. ఎన్నఁడేనియు నేపాప ♦ మెఱుఁగనట్టి, దానిపైమీరలిటువలె ♦ లేనిపోని
కతలుగడియించియీరీతిఁ ♦ గాకుసేయ, మేరయేమీకుఁబోఁ పొందు ♦ మెలఁతలార.

క. అనియిట్లాడియు నాడక, మనుఘనమోహాంబురాశి ♦ మంచుకొనంగాఁ
గనుఁగవయించుక మోడ్చుచు, వనితామణిశయ్యమీఁద ♦ వ్రాలెన్ జెలులున్. ౯౩.

ఉ. అమ్మక చెల్లదీనిహృద ♦ యమ్మను ధైర్యము నిట్టులందు నే
సొమ్మసిలంగనందఱముఁ ♦ జూచితి మింతియె కానిదీనివా
క్యమ్ములలేశ మేనియుబ ♦ యల్పడె నేవడిలెండుచిత్తజా
స్త్రమ్ములనింక నేమవునొ ♦ శైత్యవిధింపడఁదీర్పకుండినన్. ౯౪.

చ. అనుచుమృణాలనాళతుహి ♦ నాంబుఘురీఘనసారసారచం
దనకిసలాంబుజవ్యజన ♦ నవ్యసుమాళియమాధ్వికాదులన్
వనితలు దెచ్చియవ్వికచ ♦ వారిజలోచన సేదదేర్పలో
చనములొకింతవిచ్చినలు ♦ చక్కగనుంగొనబోటులర్మిలిన్. ౯౫.

క. ఏమమ్మయుద్దుగుమ్మా, యేమెవ్వర మెఱుఁగఁగలవె ♦ యిపుడైననయో
మామాటలునిజమయ్యె నె, వామాక్షిరొ సఖులపట్ల ♦ వంచనదగునే. ౯౬.

గీ. ఎన్నఁడేనియు నేపాప ♦ మెఱుఁగనట్టి, దానిపైలేనిపోనివి ♦ తగగడించి
నట్టివారముగనుకమ ♦ మ్మాదరింప, వైన నేమాయెమమ్ముఁజూడ ♦ నైనరాదె. ౯౭.

ఉ. అక్కటలోకమందుఁజెలు ♦ లర్మిలిఁజక్కనివానిఁగోరరో
గ్రక్కునహత్తకున్న సుమ ♦ కార్ముకకార్ముకసాయకానాతిన్
స్రుక్కరొ ప్రొక్కరో చెలులఁ ♦ జొప్పడఁజేయుఁడుకార్యమంచువా
రక్కఱదీర్పరోయెఱుఁగ ♦ మమ్ముచెలీయిటువంటివంచనల్. ౯౮.

క. వలపెవ్వరియొడలేవా, యలికచనీతల నెవేగ ♦ నామాత్రోడన్
బలుకకదాఁమిటఁగదయిం, తలుపుట్టుటలైన నేమి ♦ గలఁకనునమావిన్. ౯౯.

సీ. అతనుప్రతాపమూ ♦ ర్భితపృగ్స్యకలులపై, నమఁ ప్రునలసేగ ♦ ననఁగిరాదు
మదనశరాసార ♦ మాతృపృశ్నిఁ నిజ, ముఁ దుసారాంబువుల్ ♦ చినుకిరంగు

తతవిరహాగ్నిసం ♦ తప్తతనూజాతి, వల్లిపైమధువును ♦ బరపరాదు
మోహతమోగ్రస్త ♦ ముఖసుధాకరబింబ, మునఘనసారంబు ♦ నునుపరాదు
ప్రకటపులకాంకురావళి ♦ వ్యాజధూమ, గంధిలోష్మేయహృదయసం ♦ గతమహోగ్ర
భావభవవీతిహోత్రంబు ♦ ప్రజ్వరిల్ల, వెలఁదినెమ్మేనసురటీల ♦ విసరరాదు. ౧౦౦.

క. చెలులారయుచితగతులన్, మెలఁకువదప్పకుఁడటంచు ♦ మెలఁతలుతమనే
ర్పులుమెఱయఁగనికరంబున, జలజాక్షికిశైత్యవిధులు ♦ సలిపిరివరుసన్. ౧౦౧.

సీ. మహనీయహిమవారి ♦ మజ్జనంబొనరించి, వెడఁదక్రొవ్వెదఁగురు ♦ వేరుచెరివి
కరములనమృణాల ♦ కంకణమ్ములుపూన్చి, యుఱుతిముత్తెంబుల ♦ సరులమర్చి
యనఁటిలేఁజివురాకు ♦ టంగదట్టముఁగట్టి, యామీఁదఁజెంగావి ♦ నలవరించి
యలికానఘనసార ♦ తిలకమ్ముహవణించి, కలయంగనెమ్మేన ♦ గంధమెలఁది
చలువనెత్తానిచెంగల్వ ♦ కొలనికెలనఁ, దనుపన్నీటినీటిజం ♦ త్రపుదుమార
మలముకొనుచున్నజాబిల్లి ♦ పలుకరాల, నలుతిన్నియవిరిసెజ్జ ♦ నబలనునిచి.

చ. వనితలుగ్రుమ్మరించుహిమ ♦ వారితరంగిణులొక్కమొత్తమై
కనకనిభాంగియంగమున ♦ కాఁకలనింకఁగఁబొత్రిక్రమ్మఱన్
గనఁబడవయ్యెనట్లయగుఁ ♦ గాదెమహావిరహాంబురాశియ
త్యనుపమలీలపొంగునఁట ♦ యందుఁజొరంబడిమర్లనేర్చునే. ౧౦౩.

గీ. తరుణియురమునఁదాల్చిన ♦ తోరహార, పటలివిరహాగ్నినొండొండు ♦ పెటిలఁదొడఁగె
జాగరాణదీధితి ♦ చ్ఛటలునిగుడఁ, దారహారావళివసింపఁ ♦ దరమెచెప్పుమ.

క. చెలివేసలిఁజెరివిసచెం, గలువలుదగుమదనుఁడనుపఁ ♦ గావచ్చినయా
య్యొలగోలుమూఁకయుగసుల, గ్గలికమెఱయఁగ్రోధరసము ♦ గ్రక్కెడుననఁగన్.

గీ. విరులపాన్పునఁబొరలాడు ♦ వెలఁదిమేనఁ, గ్రొంజెమటనంటినప్రసూన ♦ పుంజమలరె
నాగ్రహవ్యగ్రుఁడైయుడు ♦ రంటనేయు, ప్రసవబాణునిసాయక ♦ పాళియనఁగ.

చ. కమలదళాక్షిమేనిసెకఁ ♦ గందినలేఁజిగురాకుముక్కనం
గమిచివసప్రియంబొకటి ♦ గ్రక్కునవాలుకపొక్కనార్తిచే
విముఖతనొందఁగాంచినను ♦ వేఁచినపాపఫలంబుతోడుతో
నమరెనెనీకటంచనఁగ ♦ నానగవాలులకిచ్చెఁబ్రాణముల్. ౧౦౭.

సీ. అభిలాషనిచయప ♦ స్యాంకురంబులనంగఁ, బూఁబోణినెమ్మేనఁ ♦ బులకలాదఁ
బులకలైపైరునఁ ♦ గలయంగసించిన, యుదకంబునాస్వేద ♦ ముప్పతిల్లె

స్వేదాంబునిధిలోన ♦ చెలఁగుఫేనంబునాఁ, బూసినగంధంబు ♦ పొంగఁదొణఁగెఁ
బొంగుగంధపుఁజేటు ♦ మొగులందిరమ్మద, రుచులసాజాగరా ♦ రుణ్యమహిరె
జాగరాగుణదీధితి ♦ చ్ఛటలునర్థ, సంఘటితతారకాప్రకా ♦ శంబుమిగుల
నడరియేప్రొద్దునెడఁబాయ ♦ కలరుచుండ, వెలఁదికనుఁగల్వలరమోడ్పు ♦ వీడవయ్యె.

సీ. వితతబాష్పాసార ♦ వృద్ధిదంబయిపస్వ, ననిలంబునానూర్పు ♦ లతిశయిల్లెఁ
జారుతనూలతా ♦ సంజాతముకుళప్ర, పంచంబునాఁగరో ♦ మాంచమొదవెఁ
జింతాపయోరాశి ♦ యంతంతకుబికిన, కరణిమైశ్రమవారి ♦ గ్రమ్ముకొనియె
నతనుశిలీముఖా ♦ హతికిఁదల్లడమందు, గతిననుత్కణముప్ర ♦ కంపమడరె
హృదియుమదనాధిగతహృషీ ♦ కేశసేవ, నానాసక్తినిబలెనింద్రి ♦ యమ్ములెల్ల
నిశ్చలతనొందుమునవంగ ♦ నివ్వటిల్లెఁ, బ్రత్యహమ్మునివ్వెఱ ♦ పాటుచెలికి. ౧౦౯.

మ. జలజాతాహితుఁడాప్రభాతమునిజ ♦ చ్ఛవ్యగ్నికీలావళిన్
నెలఁతన్ వేఁచుమనంతకుట్టుసురుతో ♦ నీలాబ్జనేత్రిన్ దయన్
నిలుపంగానుసురింతపోవజలజా ♦ నీకాళిమ్రోయంగన
క్షులుజైవాతృకవక్త్రియంమనునిచెన్ ♦ శ్రోత్రమ్ములందశ్రులన్. ౧౧౦.

మ. అరుణాబ్జాతనిరీక్షణంబతికులా ♦ యప్రోత్థపత్రిచ్ఛటా
గరుదుద్య్రదవగర్జితంబభిపత ♦ త్కంజాతబంధుప్రభా
పరికీర్ణాంబరచిత్రమంసలతమో ♦ భద్రచ్ఛిదాదక్షమై
హరిణాక్షీహృదయార్తితోఁదొడఁగెఁగ ♦ ల్యాద్వీపియత్యుగ్రతన్. ౧౧౧.

శా. నానారక్తపటీవితానఘణర ♦ త్నద్యోతముల్ మల్లికా
సూనతోత్కరకతీక్ష్ణదంష్ట్రిణునలి ♦ స్తోమాఖ్యవైషాగ్నిధూ
మానీకంబురురోదసీబిలముఖ ♦ వ్యాయత్తమజ్జేక్షణా
ప్రాణస్పర్శనకంపదంబగుచుమ ♦ ధ్యాహ్నాహిఁదోఁచెన్ వడిన్. ౧౧౨.

శా. స్ఫాయద్ధల్లకసద్మకంబుభ్రమరీ ♦ పాళీమదాసారమ
త్త్వాయామస్ఫుటసాంధ్యరాగకుధము ♦ ద్యత్తారకాపుష్కర
ప్రాయఃకీర్ణపయఃకణంబుహృతభా ♦ స్వద్బింబరక్తాబ్జమై
సాయంభద్రగజంబుచొచ్చికలఁచున్ ♦ శ్యామామనోదీర్ఘికన్. ౧౧౩.

మ. అలిగానాతిశయంబడంతునని చు ♦ య్యబ్జాక్షిపేవల్లకీ
కలనాదంబుఘటింపదానమిగులం ♦ గన్పట్టుసౌధస్థలా

కలితస్తంభనముల్ల నత్క్రీనలయ ♦ గ్రాసాతిమాద్యత్పికా
వలిరంతుల్ వలవంతగూర్పనగుభా ♦ వంబాత్మలో మెచ్చుచున్. ౧౧౪.

చ. చెలఁతవిభీతిసైంధవమ ♦ ణీపరినిర్మితశాలమానిత
ద్బలరిపునీలశాలఁ భ్రమ ♦ దంబునఁ జొచ్చితసంశుమాలికా
జలదవిలోకనృత్యదహి ♦ శత్రుతతింగనిడాఁగఁ బోవుచోఁ
దలవరులంచుమించుబలు ♦ తాపముచే వెడలున్ దనంతటన్. ౧౧౫.

వ. మఱియు నవ్వైదర్భిసుభ్రూవతంసంబు నిజవయస్య లన్యూనవ్రతంబుగ నవరించువివిధ శిశిరోపచారమ్ముల నంతంతకు విరహదవదహనఘోరం బపారం బగుచు విజృంభించుటయుఁ బంచశరుండు శంబరేక్షణాభిధానసంజనితసమగ్రతరదురాగ్రహంబునఁ జక్రరిపుబింబదంభసంభావితశాణచక్రంబు నపరాగవిస్ఫులింగంబు లెలుఁగడలం జెదరఁ గైరవశిలీముఖంబులు గావించి వంచనం బొంచి పొంచి నిగిడించిన యవి యరుంతుదంబులగుచు నంగంబునం దాఁకి వెన్నునం దటాయించినం గనిపించు మొనలచెలువునం జూపట్టుకుసుమశయ్యావివర్తననిషక్తకళికానికాయంబు వెంబడిం దోరఁగునపరిమితకుసుమరజస్సమ్మిళితపరిశ్రమవారిపూరంబులు క్రొడగండ్లఁ దొరఁగు వేఁడిరక్తధారల తెఱంగునం దురంగలింప ముహుర్ముహురుదంచితనిశ్వాసశ్వసనానుక్షణప్రవర్ధమానభావభవపావకసముద్భూతమ్ము లగుధూమరేఖాశిఖాకలాపధిసితమ్ముల నుల్లసిల్లునిజతాపమే చకితచందనానులేపనరసాలకిసలయవిసరఘనసారరేణుమిళితవిరహధవళిమమ్ములతోడి యంగవల్లి యుల్లసిల్లుటకు నవరించిన దోహదధూమస్తోమంబు ననుకరించు మఁ గ్రొమ్ముడివీడి యాక్రీడనంబుగా నిగిడి యెల్లెడల నావరించినచికురనికురంబును ఘనాఘనంబునం దోఁచు పృథులకరకానికాయజకణపంచలాకలాపంబులనం దగుపరిహసితక్కుసుమమాలికాప్రస్ఫుటతారహారముక్తాఫలప్రఫుల్లహల్లకమల్లికాదామంబు లనునిర్ఝరనికరతరుచ్ఛలత్సలిలశీకరగైరికధాతులేఖాభిరామంబు లగునత్యోరుహాస్తోణీధరంబులఁ గనంబడుశైవాలమాలికయును కాళికయందుఁ గ్రందుకొను బలాకశ్రేణిఁ గ్రేణి సేయుచు రాణించు నందితమృణాలవాళంబుల గముచు వేడుక గతాగతంబులు సలుపుమరాళీనిచయంబు లుల్లోలకల్లోలంబుగా నుల్లసిల్ల నాయుల్లకమహార్ణవతరంగంబుల తెఱంగు నంగీకరింప మాటిమాటికి గాటంబుగా నిగుడుకాటుకకన్నీటివెల్లువలు పెల్లుబికి విరహదవదహనపాండురంబు లగుకపోలముకురఫలకంబుల[illegible]మిడిం గ్రమ్మకొను క్రొంబొగలు గగనమధ్యంబునం దనరు నరుణకిరణుని వేఁడిమి వాడఁబాఱిన

కుసుమమంజరుల కాలూఁదనోడి నెగయు బంభరడింభంబుల విజృంభణమ్ము నెరప వివిధదశావిశేషంబుల వేఁగుచున్న సమయంబున. ౧౧౬.

చ. పొలఁతియొకర్తుచెంగలువ ♦ పూవులబంతులకేలఁబూనిక
న్నులఁబలుమాఱునొత్తుచును ♦ నూల్కొనుప్రేముడిఁగన్నెలారయీ
కలికిమనోవ్యథాభరముఁ ♦ గంటిరెనేత్రపయోజనిస్సర
త్సలిలకణంబులౌరవెద ♦ చల్లెఁగడుక్ హరినీలరోచులక్. ౧౧౭.

గీ. అన్నమాత్రానరుక్మిణి ♦ కన్నుదెఱచి, చూచితనచెలిహరినీల ♦ రోచులనినఁ
బలుకుచెవులకునమృతంబు ♦ గులికినట్లు, లలరిమోమునకొకకాంతి ♦ తెలివిఁజెందె.

క. ఇందీవరాక్షులత్తఱి, నందఱునయ్యబలఁజేరి ♦ హర్షమునఁగడుక్
డెందములునలరుచుండఁగ, మందస్వనలగుచుననిరి ♦ మానినితోడక్. ౧౧౯.

క. ధీరోదాత్తవునీవిటు, లీరాటముఁజెందనాయ ♦ మారాకన్నెల్
కూరిమిఁజక్కనిరాసుతుఁ, గోరరొత్తఱములేక ♦ కూడదొయతనిక్. ౧౨౦.

క. మరుఁడేమిపులియొ మెలుఁగో, కరకరిపెట్టుటకువాని ♦ కాండములిలనె
వ్వరిదూసిచనియెనూరక, వెఱచెదవూయమ్మయిదివి ♦ వేకము తెఱఁగే. ౧౨౧.

చ. వనజదళేక్షణుండుద్విజ ♦ వర్యునిచేభవదీయవృత్తిముక్
వినినదియాదిగామరుని ♦ వీఁకఁదపింపకయుండుటెట్లుని
న్గినిసిశరమ్ములేయుచును ♦ నిర్దయుఁడౌసుమసాయకుండువే
యనుననవేలవాహరిని ♦ యుయ్యలనూఁచుమజోలవాడునే. ౧౨౨.

గీ. అనినరుక్మిణిమీరన్న ♦ యర్థమెల్ల, నిజముచెలులారవానియా ♦ రజమువిన్న
కన్నెయెవ్వతెచేకాకు ♦ గాకయుండుఁ, గ్రొన్ననలకును వెన్నెల ♦ చిన్నెలకును.

క. యదుకులతిలకునిజగతిక్, మదనజనకుఁడనఁగవిందు ♦ మాటికినేఁడ
ట్టిదయయ్యెనేమిదెల్పుదు, హృదయేశ్వరుసంజ్ఞయింత ♦ యెంచుటకతనక్. ౧౨౪.

ఉ. ద్వారకకేగిభూసురుఁడు ♦ తత్పరతక్ మదుదంతమంతయుక్
శౌరికిఁజెల్పునాతఁడును ♦ సత్వరతక్ జనుదెంచునంచుమీ
రారసియుండియుక్ దెలియ ♦ నట్లువచించెదరింతకాకయె
వ్వారునెఱుంగరేయతఁడు ♦ వారిజనేత్రలనేఁచుచేష్టముల్. ౧౨౫.

గీ. తనభుజిత్కృష్ణపలంబుహా ♦ యనిపయోధి, కన్యవటుప్రోచితాపర ♦ గానిరూపు
నాల్గ్రిభూదేవివెన్నునఁ ♦ దాల్చితేచ్చెఁ, గూర్మిగణియింపనికినిది ♦ గుఱుతుగాదె.

క. విమలవ్రతకంచుకములు, తెమలన్ దనవచనములక ♦ ధీనలగునటుల్
భ్రమయించి త్రిపురదానవ, కమలవిలోచనల నెల్లఁ ♦ గలఁపఁడె యపలన్. ౧౨౭

క. ప్రాగ్రూపంబున రామో, విగ్రహవాన్ ధర్మ యనఁగ ♦ వెలసియు మనుమ
న్నుగ్రతఁ దునుమఁడె పృథులత, రాగ్రహమునఁ దాటకాని ♦ శాటవధూటిన్. ౧౨౮

చ. అవనితనూజపైఁ గదిసె ♦ నంచ్యొక నేరము మోపి రక్కసిం
గవయఁ దలంచు దానినవు ♦ గాదనకిల్లు బజీతు సేసెనో
కువలయనేత్రలార తన ♦ కూర్మి నిజంబగు నేని సీతన
త్యవిరళవస్యలన్ విడువ ♦ నానతి యీడె సమగ్రదోహ్యశన్. ౧౨౯.

మ. వృష గాదో చెలులార నాపలుకులీ ♦ కృష్ణుండు స్తన్యంబునన్
దృషదీర్ఘంజను దెంచు పూతనవృథా ♦ హింసించెఁ బ్రాగ్భాసనన్
విషమీవచ్చిన వారిజంపు టుచితం ♦ బేకాదె యన్నట్టిచో
విషరాసుల్ నిజకుక్షినుండ నకటా ♦ వ్రేఁగే విషంబింతయున్. ౧౩౦.

చ. మగలగణింపకందఱును ♦ మాటల నెంచక యన్నదమ్ములన్
దగదనకో హటింపకయుఁ ♦ దన్వరియించిన ఘోషసంస్థలో
మగువలఁ బాసి వచ్చియొక ♦ మాఱుతలంపఁడటన్న స్త్రీలపైఁ
దగులును గూర్మియుం గలదె ♦ తామరసేక్షణలార వానికిన్. ౧౩౧.

సీ. అతనిమనోవీథి ♦ నవతరించుటఁ గదా, విశదర్శికినింత ♦ వేఁడిగల్గె
నతనికి మాఱైఁ ♦ యతిశయించుటఁ గదా, మారుఁడన్ విఖ్యాతి ♦ మరునకొదవె
నతనిసెమ్మెయిచాయ ♦ ననుకరించుటఁ గదా, యళిశిలీముఖసంజ్ఞ ♦ నతిశయిల్లె
నాతనినామధేయ ♦ ముపవహించుటఁ గదా, మలసె వైశాఖాఖ్య ♦ మాధవునకు
నతనికేతువునకు భృత్యు ♦ లగుటఁ గాదె, శారికాకీరసితగగు ♦ చ్ఛక్రచయము
లకటకుటిలాలకలకు బా ♦ ధకములయ్యె, వింతలే వానిచెయ్దము ♦ లెవ్వలఁదులార.

వ. అని యిత్తెఱంగు నమ్మత్తకాశిని చిత్తజావేశంబునం జేసి యుపాలంభదురంధంబునం భోజలోచనుని సారెసారెకు సంస్మరించుచు సముద్రమధ్యగతుండగు నిజమగ్నాపల్లభుని వెదకవలయు ననుకుతూహలంబునం బలె సారెసారెకు నపారవిరహ[illegible]బున మునుంగుచు సఖీజనపునఃపునారచితవివిధశైత్యోపచారంబులం గొంతకొంత పారంబు నొందుచున్న సమయంబున సఖీజనంబు [illegible] యు న కాంతారత్నంబు ముఖోల్లాసంబు పడయం జాలమిఁ [illegible] లోకంబులు

నెఱపుచు వనవిహారంబునం గాని దీనిమనంబునం గల వనట దీఱదని నిశ్చయించి య య్యింతుఁ బోఁడిం గనుంగొని యిట్లనిరి. ౧౩౩.

ఉ. హల్లకపాణి నీవిటుల ♦ హర్నిశముందు దలేని దారుణా
యల్లక వేదనాగరిమ ♦ నార్తివహించెద వేలయమ్మ నీ
యుల్లము పల్లవింపనిక ♦ యోపవనాంతరవీథులందుఁ గం
జిల్లని కుంజవాటములు ♦ చేరినయూఱట గల్గునచ్చటన్. ౧౩౪.

క. అనియిట్లు విన్నవించిన, ఘనసన్నిభ వేణియపుడు ♦ కంజదళాక్షుల్
దనుఁ గొల్వ వనికిఁ జరిగెన్, మనమునఁ గలవంతకొంత ♦ మట్టుపడంగన్. ౧౩౫.

సీ. బహువిరహోద్భూత ♦ పాండురాగద్యుతుల్, కంజాతసాయకు ♦ గర్వమడఁప
విస్రస్తకబరీన ♦ వీననీరదపఙ్క్తి, మదమరాళశ్రేణి ♦ యెదుటుమాన్ప
జాగరారుణదీప్తి ♦ సారెచకోరాక్షి, మానితోద్ధత్యంబు ♦ మట్టుపఱప
ముహుహుదంచద్గాఢ ♦ మోహాతమస్స్ఫూర్తి, కోకలోకంబుఁ జీ ♦ కాకుసేయ
ఘనతరవియోగయోగసం ♦ జనితగతులె, యడరియారీతిసాహాయ్య ♦ మాచరింపఁ
జిత్తమునఁ గొంతయూఱట ♦ చెందియబల, యలసగతిఁ బూనివనవీథి ♦ కరిగెనపుడు.

క. చెలులంతనతులసంభ్రమ, కలనన్ జెంగటికిఁ జేరి ♦ కమనీయవనీ
విలసనములు చతురోక్తులు, దెలుపుచు నిట్లనిరియలస ♦ తీమణితోడన్. ౧౩౭.

సీ. చాంపేయసుమరజ ♦ శ్చామీకరాంబర, ప్రభలునల్దిక్కులఁ ♦ బరిఢవిల్ల
బలభిన్మణిశ్యామ ♦ వనకదంబనిజాంగ, కాంతులెల్లెడలను ♦ గ్రమ్ముకొనఁగ
బంధూకసుమపూజ ♦ బంధురద్యుతిపూర, కౌస్తుభచ్ఛాయలు ♦ కలయఁ బర్వ
మలయానిలాపూగ్య ♦ మాణవేణుధ్వని, మురళీనినాదంబు ♦ మురువు దెలుపఁ
బ్రకటవనవాసనిశ్చలా ♦ వికలహృదయ, శుకముఖానేకసద్ద్విజ ♦ స్తుతయుమానుఁ
దగుచు నిత్తఱి నీరాక ♦ కలరి యెదురు, చూచుచుండెను మాధవు ♦ సొబగుకంటె.

చ. పరభృతవృత్తిచేఁ బెరిఁగి ♦ పాటలలోచనదీప్తినిప్పులన్
గురియుచుఁ గాలమూర్తియనఁ ♦ గ్రూరతఁ జెందు పికంబు గానలోఁ
దిరుగుచుఁ బల్లవాళి నతఁ ♦ డీవ్రతపంబిటులెంత చేసినన్
గరివరయానవీమధుర ♦ కంఠనినాదముఁ జెంద నేర్చునే. ౧౩౯.

చ. కమలదళాయతాక్షియిదె ♦ కంటివె యీ కమనీయ పుష్పలి
ట్సముదయచారికా ప్రమద ♦ సంఘటకంబగు తేనె వానఘూ

జములను మేఘముల్ గురియఁ ♦ జాల్పుగఁ బండితనంత ప్రీలఁ దా
డిమఫలబీజపాళి ప్రక ♦ టించెను రేశ్వరచాపసంపదన్. ౧౮౦.

చ. కనుఁగొనుమబ్జనేత్రయుల ♦ కామిని క్రొవ్విరితీవె యూర్యొలన్
మునుకొని నిల్చి పాదముల ♦ ముందరి భూజముఁ దాఁచినంతఁ గ్రొ
న్ననలచటన్ జనించియరు ♦ ణద్యుతి తానె వెలార్చెఁ దత్పదా
గ్రనిహతిఁ గ్రొత్త నెత్తురులు ♦ గ్రక్కుడు కైవడిఁ గాననస్థలిన్. ౧౮౧.

సీ. చలువ గొజ్జఁగినీట ♦ జలకమ్ము సవరించి, తెలిదమ్మి జేకు పా ♦ త్తులఁ గదించి
కొమరారు కుసుమగు ♦ చ్ఛములను వెలిగ్రమ్ము, మధురసస్తన్యంబు ♦ మమత నొసఁగి
తేమ్మెర చేనూఁగు ♦ తీవె నున్దొట్లలో, నెయ్యానఁ జిగురాకు ♦ శయ్య నునిచి
చెవులకు నింపైన ♦ చిఱుతతుమ్మెదపిండు, రొద పేరి జోలల ♦ ముద మొనర్చి
ప్రేమ మునుఁ గాన నెందిర ♦ పెనుపమరఁడు, ప్రొద్దుప్రొద్దుకు నభివృద్ధి ♦ పొందియప్డె
పచ్చవిలుకాని విరహుల ♦ ఘంగపఱుప, దండు వెడలెడుఁ గంటె వే ♦ దండగమన.

క. అనివవవైభవమీగతి, వనజేక్షణ కెఱుఁగఁ దెల్పి ♦ వనితామణుల
త్యనుపమలీలాగతిఁ జే, కొనియటచని రపుడు విరులు ♦ గోయఁగ వేడ్కన్. ౧౮౩.

సీ. మధురసాస్వాదాతి ♦ మత్తాళిపఙ్క్తితో, వేణీభరంబులు ♦ వీయమందఁ
గుంజసంఘుస్ఫుట ♦ త్కుసుమవాసనలతో, గాత్రసౌరభ్యంబు ♦ కలయఁబర్వ
బహుతరవల్లరీ ♦ పల్లవావళులతో, లలితాంగుళిశ్రేణి ♦ చెలిమిసేయఁ
గలితసప్తచ్ఛద ♦ కదలికాతరులతో, మహితోరుకాండముల్ ♦ మైత్రి నెరప
మదమరాళనినాదసం ♦ పదలతోడ, మంజుమంజీరనినదంబు ♦ మాఱుమలయ
వనరమానవ్యసారూప్య ♦ మునఁ జెలంగి, వారిరుహనేత్రిలందఱుఁ ♦ గేరినగుచు.

క. నవనవరసాలమ్ముదుప, ల్లవలవనస్ఫుటనినాద ♦ లలితపరభృత
త్నవకరనిస్వనమాధురిఁ, జవిలెడు వనములు మెఱయఁ ♦ దరుణులు వరుసన్. ౧౮౪.

రగడ. మగువ క్రొవ్విరులు ♦ మాటకుమాటకు, మగఁటిమిసూపెదు ♦ మాటకుమాటకుఁ
జెలియపల్కు సుధ ♦ చిలుకకుచిలుకకు, చెలఁగు రోసమిో ♦ చిలుకకుఁ జిలుకకు
తరుణిమయూరముఁ ♦ దఱుమకు తెఱుమకు, వరణీయంబిది ♦ వనజాతరమకు
పొలఁతి క్రొవ్వలను ♦ బొగడకుపొగడకు, తులరాదిదిమన ♦ తోపులపొగడకు
జోటి మాటికిటఁ ♦ జూడకుచూడకు, సూటిగాదు చెలి ♦ సూనము చూడకు
పడఁతి శోకములఁ ♦ బట్టకుపట్టకు, పెడనెడఁ దిరిగెడు ♦ నవితమపొట్టకు

ఇంతిదూరమిఁక ♦ నేగకు మేగకు, మెంతలోఁతోయిది ♦ యీఁతకుపోఁగకు
చెలువచిల్కఁగమిఁ ♦ జెనకకు చెనకకు, మలిగినబాధక ♦ మదియే వెనకకు
మెలఁతభీతిచే ♦ మెదలకు మెదలకు, మెలమినివలఁగోను ♦ నీతు మైదలకుఁ
దోయ్యలిబిసములఁ ♦ ద్రుంచకుత్రుంచకు, మెయ్యెడజేవస ♦ మీఁకిడ సుంచకు
వెలఁదిపంతమును ♦ విడువకువిడువకు, మలఁతిగాదెనీ ♦ యంతటిప్రోడకు
చెలియపువ్వుఁబోదరుఁ ♦ జేరకు చేరకు, మళులుపొంచినవి ♦ యవిగో చూఱకు
బిత్తరిరోసముఁ ♦ బెంచకు పెంచకు, మిత్తతిరమ్మి ♦ యీపాదపంచకుఁ
గోమలిజాజులు ♦ గోయకుకోయకు, కాముఁడుఁనిగిరాఁ ♦ గలయదిచేయకు
సుదతి రాఁగదే ♦ చూతము చూతము, మదశుక మెదిరిన ♦ మనకువిఘాతము
తోయజేముఖియిటఁ ♦ గ్రుళ్లకుత్రుళ్లకు, మేదొడమెత్తురె ♦ యీపడిసుళ్లకుఁ
గొమ్మకోయిలకుఁ ♦ గొంకకుకొంకకు, మమ్మచెల్లరా ♦ దదినీవంకకు
నాతికనీనిక ♦ నమ్మకునమ్మకు, మీతతిపొంచిన ♦ దీగజనిమ్మకు
ముదితచిగురులివి ♦ ముట్టకుముట్టకు, కొదరుకోసమీ ♦ కోయిలఁదిట్టకు
వెలయుందినదీ ♦ విడువకువిడువకు, తొలుతటిపలెవ ♦ త్తునెనీగొడవకు. ౧౪౬.

చ. అనిలలితాంగులత్తతిస ♦ మంచితసౌరభవైభవంబునం
దనరెడువానిఁదుమ్మెదల ♦ తండము చేఁగసిగందకెంతయుఁన్
గనఁబడువానిఁదేనియల ♦ కమ్మదనమ్ములవ్రానివానిఁగ్రో
న్ననలొకకొన్నిఁగూరిచియ ♦ నంగునిపూజకు నేర్పరించుచున్. ౧౪౭.

సీ. తెలివిరిమొగ్గనే ♦ వళ్ళములచెలువంబు, హురుమంజిముత్తెంపు ♦ సరులఁదెగడఁ
దళుకొత్తుమైదీవ ♦ నలముపుప్పొడిచాయ, తాఁగందపొడియం ♦ దముహసింప
రంగారుతలిరాకు ♦ టంగదట్టపునిగ్గు, చెంగావిపావడ ♦ సిరివహింపఁ
గమ్మగేదఁగి రేకు ♦ కమ్మయొయ్యారమ్ము, కనకతాటంకయు ♦ గ్మంబుగెలువ
వనజముఖులెల్లబహువిధ ♦ వనవిహార, హారలీలావిశేషప్ర ♦ చారగతుల
యమరఁజేయనిసింగార ♦ మగుచుఁదనర, నతనునిజయేందిరలమాట్కి ♦ నలరిరపుడు.

క. సల్లలితవకుళముకుళో, ద్వేల్లితమకరందహీన ♦ విహ్వలమధుళి
ట్టల్లజగరుదాస్ఫాలన, హల్లోహలమగుచుశీత ♦ లానిలమొలయన్. ౧౪౮.

గీ. చానలీరీతిఁబుష్పాప ♦ చయవినోద, జనితముగుశ్రాంతిదీఱంగ ♦ జలవిహార
కాంక్షలిగురొత్తఁజనిచని ♦ కాంచిరెదుట, శ్రీకరంబగునొక్కప ♦ ద్మాకరంబు.

వ. ఇత్తెఱంగున నయ్యంగనారత్నంబులు తమకురంగటం దనరుసరోవరంబునుం గనుంగొని యభంగురసముత్తుంగతరంగమాలికాడోలికాకేళికాదరంబునం బొంగుసలిలాధిదేవత యుపరివిసృమరచలదరుణకమలమంజుమంజీరశింజారవంబుల సామంజస్యంబు నెఱపు హంసకులక్రేంకారనాదంబులకు మోదంబుం జెందుచు, నిజాగమనసంభ్రమకుతూహలంబులం గాసారకమలామణి తమ్మెదుర్కొనుమార్గంబునం గలయ నెల్లెడం బన్నిదట్టంబుగాం జిలికి వెలిపట్టుపావడలు పఱచెనోయన సంతతసమంతతస్తంతన్యమానమృదులపవమానమాణవకవికీర్యమాణశిశిరసలిలకణధవళసరసీరుహపలాశనివహంబులకు నివ్వెఱంగుఁజెందుచు, విమలసలిలాంతరాళంబునం దోఁచునిజబింబంబులసంరంభంబున నంభోరుహాకరరమారమణి తనదునెచ్చెలులం బనిచి మధ్యవినిహితదీపంబు లగుమరకతపాత్రికల హారతు లెత్తించెనోయన నితస్తతశ్చలనపరజలవిహంగమచలాచలనళినీపలాశసంసక్తరక్తారవిందంబులం గనుంగొని డెందంబులందు నానందంబు నొందుచుం, జీనాంబరంబులు ననూనమణిమయాభరణంబు లుజ్జగించి క్రమక్రమంబున వజ్రోపలనిర్మితంబు లగుసోపానమార్గంబుల జలంబు సొచ్చి వివిధవిహారణచాతుర్యంబు మెఱయింపం గడంగి రట్టియెడ. ౧౫౧.

లయగ్రాహి.

ఓలయనుచున్మునిఁగి ♦ నేలఁగనుచున్మగుడఁ, దేలినగుచున్మతిమ ♦ రాళికలవెంటన్
బాళిఁజనిపట్టుచును ♦ హాలిగిలకొట్టుచుని, జాలితతిఁదట్టుచును ♦ గేలుగొనియందల్
జాలుగొనఁజల్లుచును ♦ మేలుకనిగ్రుళ్లుచును, వేళముగముళ్లుచును ♦ లోలతనుదీప్తిన్
బాలకడలిన్బొడము ♦ బాలికలపోలికకుఁ, జాలిజలకేళిఁగని ♦ రాలలనలెంతిన్.

చ. నలినములుంబ్రసన్నవద ♦ నమ్ములుశైవలముల్శిరోజముల్
కలికిమెఱుంగుబేడిసలు ♦ కన్నులుఁదామరతూండ్లుబాహువుల్
దెలియఁగరాకయేకమయి ♦ తేజరిలన్సలిలాంతరస్థితిన్
బలుమఱుఁజాడఁబద్మినులు ♦ పద్మినులట్లచెలంగిరయ్యెడన్. ౧౫౩.

చ. వనరుహనిస్సరన్మధువ ♦ వారిఁబ్రోలుమిళిందమాలికం
గనియొకబోటిపంకరుహ ♦ కర్ణికవైవఁగనగ్రభాగభా
జనమధుపంబుచేరెసిత ♦ సారసముల్హరిచక్రధారచేఁ
దునిసినరాహుమస్తకము ♦ తోడనెచంద్రుఁగ్రసించుకైవడిన్. ౧౫౪.

ఉ. మొత్తముగూడికామినులు ♦ మోమునసీరముఁజల్లుచల్లఁగాఁ
గుత్తుకబంటినీటికొక ♦ గుబ్బెతవేచనినిల్చియుండఁద

శ్రోత్రేందదీయవక్త్రమున ♦ హారోజ్జ్వలనైజవిలాసస్ఫూర్తం
బెత్తినవేడ్కఁగన్గొనజ ♦ లేందిరయెత్తినదర్పణంబనన్. ౧౫౫.

శా. నారీరత్న మొకర్తునీటఁగనుమీ ♦ నద్వంద్వముల్ బట్టవే
నీరంబంజలినెత్తియందుఁగననా ♦ నేత్రద్వయింగాంచియం
దారూఢస్థితిఁజిక్కనంచుదరిదా ♦ యంభోయితాఁజల్లిత
త్తీరంబందవిలేకయుండుటకుఁజెం ♦ దెన్నిన్వ్వెలన్ముగ్ధతన్. ౧౫౬.

క. బాలామణులీగతిజల, కేళిన్ బాళింఘటించి ♦ కిలకిలనగుచున్
జాలించితటముఁజేరిరి, సోలెన్ సోలుచును భోజ ♦ సుతయున్ దాముల్. ౧౫౭.

క. చిలుకలకోలుకులుకుసక్తిణి, కులకలతోడియొత్తిచిత్రి ♦ తాంబరభూషల్
కలపముఘటించిమటియా, లలనామతిసుందార ♦ లంకృతలగుచున్. ౧౫౮.

గీ. భోజసుతకోరివట్లయుం ♦ భోజనయును, వేగమునఁగూర్పఁబోలుపూ ♦ వింటివేల్పు
వెలమిమీఱంగఁబూజింప ♦ వలయుననుచుఁ, దనరుపూజోపకరణముల్ ♦ గొనుచునపుడు

సీ. నెమ్మోముజాబిల్లి ♦ నిగ్గువెన్నెలతేటఁ, గఱఁగెడునెలరాల ♦ దరులఁదొరఁగు
తెలినీటనెనసిన ♦ యలరుతేనియవాఁక, క్రేవలనలరులే ♦ మావిగుమురు
చలువలంబెరిఁగిన ♦ వలికప్రపుటనంటి, చెంగటఁదనరుగో ♦ జ్జంగిపొదల
నల్లినద్రాక్షల ♦ నలమినపిరవాది, తీవెలకిరవైన ♦ క్రోవికలనఁ
గ్రమ్మునేలకిజొంపపు ♦ మమ్మరమ్ము, తెమ్మకెమ్మగుపొగడపూ ♦ రెమ్మనలరు
కమ్మతావులయిమ్మునఁ ♦ జిమ్మిరేఁగి, వచ్చుతెమ్మెరవేడుక ♦ లిచ్చుచోట. ౧౬౦.

ఉ. చల్లనికమ్మతావివెద ♦ చల్లఁగఁజాల్ కుగుపేరుసెజ్జలోఁ
బల్లవతల్లజప్రకర ♦ భద్రవితర్దికదీర్చియందుపై
మొల్లలపాన్పుతమ్మివిరి ♦ ముద్దియగద్దియయందుమీఁదభా
సిల్లనమర్చిప్రోడలగు ♦ చెల్వలుమేల్వలిదమ్మియాకునన్. ౧౬౧.

సీ. కామినీశ్లేషణం ♦ గతకుంకుమరసంబు, మేలుచందురుకావి ♦ చేలగాఁగ
భామినీపరికీర్ణ ♦ పటవాసమునఁదోఁచు, శశపదాల్ ముత్యాల ♦ సరులుగాఁగఁ
బ్రియమోవితేనియల్ ♦ నయముకోఁగ్రోలుట, నవక్ర్తతసీరసా ♦ ంబుగాఁగ
దయితార్పితాధర ♦ దంతక్షతములొడు, కలచినఁజెందుప ♦ ల్లంబుగాఁగఁ
బ్రేయసీహాసపూర్వక ♦ శ్రితనునోజ్ఞ, ఘనతంగ్లేపదృఢవేణి ♦ కాగుహాగ
లాంగనిమ్ములుసరివెన ♦ ల్గాఁగమిగుల, వీగశృంగారములఁబూ ♦ వలయూల్ల,

గీ. హరువుమీఱ నమరులిఖించి ♦ యచటనుంచి, యతనికెలఁకులశుకశారి ♦ కాళిమలయ
పవనశరధరమాధవ ♦ పరభృతముల, వరుసలేఁజివురాకుల ♦ వ్రాసియునిచి. ౧౬౩.

క. అలరువిలుదాల్పువేల్పున, కలరంభోఁడులుసమంచి ♦ తాగమలీలా
కలితమతులగుచుఁబూజల్, సలిపిరికృతషోడశోప ♦ చారశ్రీలన్. ౧౬౪.

క. జలజాక్షులురుక్మిణిచేఁ, జిలుకపతాణీవయాళి ♦ జేజేదొరక
ర్శిలిమీఱవిరులఁబోయ్శులి, యలవఱచిరిభక్తివిరచి ♦ తాంజలులగుచున్. ౧౬౫.

క. పలువగలనభినుతించిరి, చలపాదిన్ గీరసాది ♦ నరసద్రాక్షా
ఫలలలితమధురగుణసం, కలితశుకీవచనరచన ♦ గడలుకొనంగన్. ౧౬౬.

శా. శ్రీనాథుండఁటతంద్రిఁదల్లియఁటల ♦ క్ష్మీకాంతవాగీశ్వరే
శానేంద్రుల్ భవదీయభృత్యులఁటనీ ♦ సామర్థ్యమెవ్వారికిన్
గానన్ రాదఁటయిట్టినిన్నుఁబొగడన్ ♦ గాంతాజనుల్ శక్తులే
మీనాంకానిరుపాధిసత్కరుణనీ ♦ మీనేక్షణంబ్రోవుమీ. ౧౬౭.

క. పలుదెఱఁగులనీశరములు, తలపైఁదరియింపకుండు ♦ దైవముగలదే
చెలులనఁగనెంతవారలు, తలఁకకనీయాజ్ఞఁగడవఁ ♦ దామరసాస్త్రా. ౧౬౮.

మ. అవికారంబమలంబమేయమనఘం ♦ బవ్యక్తమాత్మస్థితి
ప్రవణంబాగమవేద్యమైతగుపర ♦ బ్రహ్మంబునీచేఁబ్రకృ
త్యవియుక్తంబయిలోకసృష్టికలనన్ ♦ బ్రాపించెనానిందిరా
ధవగౌరీపతిభారతీశ్వరులకృ ♦ త్యంబెన్నఁగానేటికిన్. ౧౬౯.

క. దితిజపురహృతికవిశిఖా, కృతియైహరినిన్ సహాయు ♦ మెంచన్ విసమే
అతిశయతేతనుజాత్రో, వితరన్ కశ్చిన్నిజేన ♦ విభశ్రేణయసన్. ౧౭౦.

శా. సూనంబుల్ బలువిల్లునుంగుఁజెలియున్ ♦ సూనాకరుండస్త్రముల్
సూనంబుల్ శితఖడ్గముల్ గవచముల్ ♦ సూనంబులిట్లున్నచో
నీనానావిధసూనజాలములునీ ♦ కేమిచ్చిప్రార్థించుటల్
భానోద్దీపసమగ్రణంబనిదయం ♦ భావింపుమబ్జాంబకా. ౧౭౧.

మ. మునిపత్నీసూనసంబుఁజేసినఁగదా ♦ ముగ్ధానలోమాధవుం
డనుఁగున్నెచ్చెలిఁబాసిదుఃఖములపా ♦ లైయుండుటల్ కావునన్
వనజాక్షుల్ పయనీయలీవునునయున్ ♦ వామాక్షులంబ్రోచినన్
జనసంస్తుత్యశుభంబులౌవనరమా ♦ సాంగత్యమామాధవా. ౧౭౨.

శా. క్షీరాంభోనిధిజన్మభూమివిబుధ ♦ శ్రేణీసముజ్జీవనం
బారూఢస్థితినీసుదర్యతగని ♦ త్యావాసముల్ సర్వలో
కారాధ్యుండగునీశుమౌళిజగదా ♦ హ్లాదప్రదంబెన్నఁగా
నీరూపంబటుకానఁగావుమిఁకనీ ♦ నీలాబ్జనేత్రన్ శశీ. ౧౭౩.

క. దక్షిణభూభృజ్జననము, నీక్షితిలోనీకుఁజెలికి ♦ నేకంబగుటన్
రక్షింపుమునీచెలియలి, దాక్షిణ్యంబాత్మమిగులఁ ♦ దగునుసమీరా. ౧౭౪.

క. అనియిట్లుచెలియలందఱు, వనజాస్త్రునిఁదత్సమీప ♦ వర్తులమాధ్వీ
పనితరమణీయసూక్తుల, వినుతులుగావింపనపుడు ♦ విస్ఫుటలీలన్. ౧౭౫.

క. మాంగల్యకసూచకానే, కాంగికసునిమిత్తగతుల ♦ నండజనికరా
భంగురవాగీరితములు, సంగసీకెఱిఁగించెనిప్పి ♦ తార్థావాప్తిన్. ౧౭౬.

ఉ. అత్తఱిభాగ్యదేవతత ♦ నంతటసన్నిధిసేయురీతిఁవి
ప్రోత్తముఁడందురాఁగనిమ ♦ హోత్పలపత్రవిశాలనేత్రప
ల్లొల్కుత్తుముదంబుతోఁబులక ♦ లొక్కటఁజెక్కులఁబిక్కటిల్లఁగాఁ
జిత్తరుబొమ్మనాఁగనిలి ♦ చెన్ జెలియించుకవిస్మయంబుగన్. ౧౭౭.

గీ. చెలియలంభోజదళనేత్ర ♦ చెంతఁజేరి, యిటకువచ్చినయొజ్జల ♦ కింపుదనర
నతియొనర్పకయుండఁగ ♦ నతివతగునె, యనఁగరుక్మిణియొదురేగి ♦ యతిముదమున.

క. భూదేవకులోత్తంసుని, పాదాంభోజములకెరఁగ ♦ బ్రాహ్మణుఁడంతన్
సాదరముగఁజెలిఁగనుఁగొని, మోదముతోననియెనగవు ♦ మోమునఁదొలఁకన్.

గీ. అతివనీకుమనోరథా ♦ వాప్తిరస్తు, టంమదీవనయొసఁగియో ♦ యంబుజాక్షి
నీదుకోర్కులుఫలియించె ♦ నిక్కమిపుడు, చింతనందకయూఱటఁ ♦ జెందవమ్మ.

క. అనిపలుకునంతనటకును, మనుజేశ్వరురాణివచ్చి ♦ త్మాదేవునకున్
వినతియొనర్పఁగనతఁడును, ఘనఁబోఁణిన్ జూచిపలికె ♦ నవ్యమృదూక్తిన్. ౧౮౧.

సీ. భవదనుజ్ఞనుజేసి ♦ ద్వారకకేఁజని, కమలలోచనుసము ♦ ఖంబుచేరి
బాలాలలామంబు ♦ భావంబులోనెంచి, యున్నట్టివిధముఁద ♦ దుచితలీల
ధరణీశుఁడీవును ♦ దలఁచినచందంబు, నట్టికార్యమునకు ♦ నంతరాయ
మగునట్లుగాన్రుక్మి ♦ యంతరంగంబునఁ, జింతించియున్నదు ♦ శ్చేష్టితంబు
విన్నవించినదైత్యారి ♦ వినిప్రమోది, కలితమానసుఁడగుచుశ్చం ♦ గారకీర
రసములొక్కటమదిలోనఁ ♦ గ్రమ్ముకొనఁగ, వదనమునవవ్వుదొలఁకంగఁ ♦ బలికెనిట్లు.

మ. కరసజ్జీకృతశార్ఙ్గచాపవిలస ♦ త్కాండప్రకాండాహతిన్
స్వరునిర్భిన్నగిరీంద్రబృందముగతిన్ ♦ వైరిన్ శరంబొక్కటం

ధరణిం గూలఁగఁ జేసి బల్మి నిసుధం ♦ దార్క్ష్యుండు వే తెచ్చిన
ట్లరవిందాస్యను దెత్తు భూతలనుప ♦ ర్వానీక చూడామణీ. ౧౮౩.

గీ. పురము వెలువడి రాకన్నె ♦ గిరితనూజ, కధికభక్తిని మ్రొక్కంగ ♦ నరుగు దేర
నటకు నేవచ్చి కూడిన ♦ యవనిపతులు, వెఱఁగుపడి చూడఁ గొనివత్తు ♦ విమలచరిత.

క. అనిపలికెఁ గాననింతట, వనజేక్షణుఁడిటకు వచ్చి ♦ వారిజనేత్రన్
దన యరదము పైనిడికొని, చనుటకు సందియము లేదు ♦ సామజగమనా. ౧౮౪.

వ. ఇట్లు పలికిన మహీసురోత్తమునకు సభక్తికరేబుగా నయ్యిందువదనలందఱును బునః
పునః ప్రణామంబు లాచరించి నీయట్టి హితబంధుండు గలుగుటం జేసికదా మా చెలియ
కోరినకోర్కె లీడేరె ననీ పలుమరును వినుతులు గావించె నంత భోజభూపతి దేవి
రుక్మిణిం దోడ్కొని యంతఃపురంబునకుఁ జని భూసురునివలన వినిన వృత్తాంతంబంతయు
మహీపతి కెఱింగించిన నతండును బ్రమోదభరితాంతరంగుండగుచును మఱునాఁడు
స్వయంవరాస్థానంబునకు సకలరాజలోకంబును వచ్చునట్లుగా నియమించి కుసూ
హలంబున నుండె ననిన శుకమహాయోగిం గనుంగొని యప్పరీక్షిన్నృపాలుండు
నవ్వలివృత్తాంతంబు నానతీయవలయునని యడిగిన. ౧౮౫.

మ. శ్రితరక్షైకపరాపరాపరసమ ♦ క్షేమామహాత్మాసిని
ర్జితదైత్యప్రకరాకరాకరమహా ♦ ర్చిస్స్ఫురచ్చక్రత్వోరా
హృతనక్రప్రవరాదరాదరమహా ♦ గ్రీవాబ్ధిరాట్కన్యకా
రతికృత్కేళిధరాధరాధరభృతి ♦ ప్రోష్ఠప్రపదాంభశ్చరా. ౧౮౬.

క. నాగేంద్రధ్వజసేనా, భోగమహావిపినహవ్య ♦ భుగ్దృగ్జాలా
భాగవతసతతవినుతయ, శోగంగాఝరివిశాల ♦ శుభకృల్లీలా. ౧౮౭.

భుజంగప్రయాతము. సితాంఘ్రిప్రవాహావి ♦ శిష్టావనోహా
హతాత్మీయమోహావి ♦ హంగేంద్రవాహా
కృతానేకలీలాస ♦ ఖీభూతబాలా
ధృతోత్తుంగశైలాను ♦ ధీబృందలోలా. ౧౮౮.

గద్యము. ఇది శ్రీమదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణప్రాప్తచతురతరసాహితీవైభవ చక్ర
పామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మార్గణవిశ్రాణితమహాఫల కోవి
దనుతభాగధేయ కోటీశ్వరనామధేయప్రణీతం బైనభోజసుతాపరిణయంబను మహా
ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము.



క. శ్రీరుచిరకీర్తిసాంద్రా, ఘోరతృణావర్తదనుజకుం ♦ జరదళనా
పారీంద్రానిర్వ్యాజ, స్మేరాననరుచివిశాల ♦ శ్రీగోపాలా. ౧.

వ. అవధరింపు మట్లడిగిన పరిక్షిన్నృపాలునకు శుకమహాయోగి యిట్లనియె. ౨.

క. రేపకడ రాకుమారులు, భూపాలనియుక్తులగుచు ♦ భూషణలీలా
రూపబలైశ్వర్యంబులు, చూపఱులకువిస్మయంబు ♦ సొంపొదవింపన్. ౩.

శా. రాజామాత్యులుతమ్మెఱుంగనియథా ♦ ర్హప్రక్రియాచాతురిన్
బూజల్ సల్పస్వయంవరోత్సవనవ ♦ ప్రోద్భాసిపంచాగ్రవి
భ్రాజత్కాంచనరత్నపీఠములపై ♦ రాణింపఁగూర్చుండిరా
భోజాధీశతనూజరాకకుమనం ♦ బుల్ మున్నె దుర్లోకల్పనన్. ౪.

ఉ. అంతకుమున్నభోజమను ♦ జాధిపుచెంతకు వేగఁజేరి కా
ర్తాంతికులిప్పుడొక్కటధ ♦ రాధిపులెల్లస్వయంవరాంగణ
ప్రాంతముచేరవచ్చిరిటు ♦ లంతికమయ్యె ముహూర్తమింతయున్
గంతువిరోధిగేహినిస ♦ కౌతుకవృత్తిభజింపరాఁదగున్. ౫.

క. అని తెలుపమనుజనాథుఁడు, దనమనమున వేడ్కఁదనర ♦ ధాత్రీజనులన్
గని పెండ్లికూఁతుఁజేయుఁడు, మనరుక్మిణిననుచుఁబలుక ♦ మదవతులెల్లన్. ౬.

క. పాటలుపాడుచుఁగుంకుమ, పాటీరనిశాదిదివ్య ♦ వస్త్రప్రతతిన్
బాటలగంధులునలుఁగిడి, బోటికిజలకంబులార్చి ♦ భూషణవితతిన్. ౭.

గీ. తగనలంకృతఁగాఁజేసి ♦ ధరణివిభున, కప్పుడెఱిఁగింపనాతండు ♦ నంబుజాక్షి
హరునిదేవికిమ్రొక్కంగ ♦ ననుపవలయు, ననుచు మదినెంచి పరిచారి ♦ కాళిఁజూచి.

గీ. తగినవస్తువులొనఁగూర్చి ♦ తరళనయన, రాజశేఖరపత్నిని ♦ బూజసేయ
నిపుడె తోడ్కొనిపొండని ♦ నిపుణులైన, వారలనుగూర్చియునిచెన ♦ త్వరత మెఱయ.

క. అంతటఁజెలులారుక్మిణి, చెంతకుఁజనితడవుసేయఁ ♦ జెల్లదు వేగన్
గంతురిపుపత్నిపూజకు, నింతీచనవలయుననఁగ ♦ నెంతేసొక్కన్. ౧౦.

క. వేదండగమనయొక్కతె, కైదండయొసంగరూప ♦ కలనాసుమనః
కోదండరమణిరుక్మిణి, యాదండధరారినారి ♦ కర్థిలిమ్రొక్కన్. ౧౧.

గీ. ఇరుగడలఁజామరలు వైచు ♦ నిగురుఁబోండ్లు, కనకనవరత్నకంకణ ♦ క్వణనములకుఁ
జరణయుగమంజుమంజీర ♦ సరసనినద, మెదురుకొననగరువెడలె ♦ ముదితయపుడు.

వ. ఇవ్విధంబున నయ్యిందువదన మందమందగమనంబునఁ గక్ష్యాంతరంబులు గడచి యిరుగెలంకులఁ గరతలసజ్జీకృతవీజ్యమానధవళచామరంబు లాననపర్వేందుబింబకళావిలాసంబుసొంపు సంపాదింప వేణీభరసంవేల్లితోత్ఫుల్లమల్లికామతల్లికాదామసంజనితసౌరభాలోలపుష్పంధయస్తనంధయనినాదంబులు మాత్సర్యంబున వెన్వెంటం దవులుమకరధ్వజధనుర్జ్యాఘోషంబని తలంచి భయంబున మరలిచూచునెడఁ దిర్యక్ప్రసారితంబు లగుకటాక్షంబు లనునీలోత్పలశ్రేణులవలన నభిరామంబు లగు కేదారంబుల ననుకరించుప్రాంగణతలనిబద్ధనిశాకాంతకాంతమణిప్రభాపూరంబులఁ గొలంగి చనం గమకించుసఖీకదంబమంజుమంజీరనినాదంబులతోడ మల్లచఱచు పోషితమల్లికాక్షతల్లజక్రేంకారంబులతోఁగూడఁ గలయఁబర్వుదర్శనోత్సుకజనోత్సారణసంభ్రాంతవేత్రిశ్రేణీచలాచలకరాంబురుహభాస్వరమణికంకణఝణఝణత్కారసంగతావరోధవధూకటితటవిలంబిరశనాదామసముల్లసత్కింకిణీనిచయఘణఘణత్కారంబులతో నెనసి చెలంగుమాగధవైతాళికాంగనాగానానుకూలవేణువీణాక్వణనపల్లవితహర్మ్యతలస్తంభకిసలయగ్రాసాతృప్తమావార్యమాణపికానీకార్భటులకుం గయిదండ యొసంగఁజాలు విప్రవనితలుం బాడుధవళంబులయులివును మంగళతూర్యనినాదంబులును భేరీప్రముఖవాద్యఘోషంబులును నొక్కుమ్మడిఁ జెలంగ కలశపాథోరాశిమధ్యంబు వెలువడుసరోరుహగేహినిచాడ్పునఁ గాసారంబు నిర్గమించు రాయంచపోలిక హజారంబు వెల్వడి చతురంతయానం బధిరోహించి సౌధాగ్రంబులనుండి పుణ్యాంగనలు పెల్లు వెదచల్లుముత్తియంపుసేసపాలువలును నభస్స్థలంబున నున్నసుధాంశుసీమంతినీనివహంబులు గురియుకుసుమవృష్టియు నీరంధ్రంబుగాఁ దొరఁగుచుండ మందమందగమనంబున మందాకినీధరగేహినిమందిరప్రాంతంబుఁ జేరి శిబికావతరణంబు గావించి హస్తపాదప్రక్షాళనం బాచరించి యొక్కబిబ్బోకవతి కరతలంబు నిజపాణిపంకేరుహంబునం గీలించి కతిపయాళిజనంబును వృద్ధబాడబాంగనలు మున్నుగా నడవం జని సర్వమంగళాసన్నిధానంబు సేరి పుష్పాంజలి యొసంగి ప్రణామం బాచరించి కేలు మొగిడ్చి వినయవినమితోత్తమాంగయై యిట్లు వినుతింపం దొణంగె. ౧౩.

శ్లో. జయశ్రీకంఠదయితే, జయపుండ్రేక్షుధారిణీ
జయలోకైకజనని, జయకల్యాణిపార్వతి. ౧౪.

దండకము. శ్రీమన్మహారాజరాజశ్రీరాజీవజీవాతుభవ్యప్రభాపూరకల్పస్వదేహప్రభాభా
స్వరాశేషలోకే కృపాసాంద్రలోకే మహాతోయమధ్యస్ఫురత్కూర్మకందోదితో
దారశేషాహినాళానువిద్ధాఖిలక్షోణిచక్రారవిందాంతరుద్భాసిహేమాద్రిరాట్కర్ణికా
పర్యుదంచత్సుధాసింధుమధ్యే మణిద్వీపదేశే సదానల్పకల్పద్రువాటీకుటీరేషు నిత్యం
వసద్భిర్వసంతాదిభిశ్శక్తిమద్భిస్సుసంభావితే యోగిహృద్భావితే రత్నసాలో
చ్చయాకల్పనీపద్రుఫుల్లప్రసూనస్రవన్మాధవాస్వాదనాలోల భృంగాంగనాసంఘ
సంగీతభంగీసమాసక్తమాతంగకన్యాసమావిష్టగేయాఖ్యచక్రాధిదేవ్యానఖైస్సాదరం
వల్లకీంవాదయంత్యా వదంత్యా మనోజ్ఞస్వరానుక్రమం కీరయోషాసమాలాపమాకర్ణ
యంత్యా నయంత్యా శిరఃకంపమత్యంతమానందముద్భావయంత్యా రుచిం శక్రనీలస్య
నీలాంబరారాధ్యసత్పాదుకాసీమయా శ్యామయా వందితే శంకరానందితే విశ్వ
సంపాదనస్థేమసంహారకృత్యప్రవీణైస్స్వవక్త్రాబ్జవక్షస్స్థలీవామభాగస్థిఃస్వస్వకాం
తాభిరాలింగితైరేవభావం వదద్భిర్మహద్భిస్సురైః పూజితే భూషణస్తోమవిభ్రాజితే
జాతరూపప్రభాభాసమానాసమానారవిందోదరామందనిష్యందభాస్వన్మరందోరు
బిందుప్రణాళీమిళద్ధిమిళిందభ్రమత్పక్షవిక్షేపనిర్ధూతపుష్పాల్పగాగారుణోద్ధారమం
దానిలాందోళితోద్దండదండాపవిద్ధాంబుజచ్ఛాయసంలీనహంసావళీశాలిపద్మాటవీ
గర్భసంపాదితాదభ్రవిభ్రాజమానాతిమానాతులాగారరత్నద్యుతిద్యోతితాశావకా
శప్రకాశస్వభాభాసురాశేషదేవీభిరత్యాదృతే సువ్రతే సంవృతానేకసంతాన
వాటీచరత్కీరసంఘైరసంఖ్యైర్విపాకారుణీభూతబింబీఫలభ్రాంతిముగ్ధైః పికైరన్యశోక
ద్రుమాసక్తమాకందమంజూచ్చలన్మంజుమంజరసంగీతిభిర్యాన్నతనోదంచితాత్యంతశోణ
ప్రవాళభ్రమభ్రాంతచిత్తైర్భృశాకృష్టకాంతిచ్ఛటాభిః కృతే చింత్యచింతామణీభిర్గృ
హే చక్రకోణస్థితాభిః శ్రియాత్యంతసౌందర్యసంపన్నయా సంగతాభిర్నతాభిః స్పృగు
శ్రోణివక్షోజభారేణ హారేణ నిర్వ్యాజచంద్రాననాకారేణ హాసేన కుందప్రకాశేన ధి
క్కారిభిర్గాఢమీపుష్పముచ్చండశోణాంశుకైర్భృంగసంఘప్రభాబంధపాశేన మం
దారపుష్పస్రగేకాంతదేశేన సత్కేశపాశేన నిత్యం లసంతీభిరాహ్లాదయంతీభిరాలో
కనేనాత్మనో మానసైశ్శక్తిభిర్భూషితే న్యాసనిర్న్యాసలాస్యోరసస్యందబోధప్ర
బోధామందరోచిఃపరిస్పందనాస్కందితోదారరాజీవరాగోపరాగప్రమాపాదపద్మోపల
శ్రేణికాబద్ధకోటిస్ఫురత్పాదుకాయుగ్మలగ్నారుణాశోకనవ్యోల్లసత్పల్లవస్థానిషా
శారవిందద్వయీసక్తదేహీకచక్రీపరిష్వక్తముక్తామణీచారుమంజీరవత్త్రిమదభృంగ

సంఘాతసంజాతఝుంకారధికాఙ్కారిసంఙ్కారవానోద్ధితదుష్కారిరాగేణశంభోరివాకా రిణాతీవరాగేణసంయోగినాలోపి తేనాతిసూక్ష్మేణలోలేనచేలేనబాలాతపే నేవసం వ్యాపినానీతరంభాయుగస్పర్ధిశుండాముదధ్వంసివృత్తోరుకే గుప్తవందారుకే వైపుల్య ముర్వ్యానితంబేనసౌక్ష్మ్యంవలగ్నేనఖస్యాపి బింబాధరేణ ప్రభావం సుధాయా వసం తానిలస్యశ్రియంశ్వాసవాతైఃస్థితంమండలస్యస్తనాభ్యాంచ తేజోనిధేర్భాస్కరస్య ప్రసాదేననిర్ధూతభూతాధికే శ్రేయసస్సాధికే పాణిపద్మాంతపాశాంకుశోదగ్రపుం డ్రేక్షుచాపప్రసూనాశుగశ్రేణికే ప్రోల్లసద్వేణికే వక్త్రశీతాంశుబింబామృతస్యంది బిందుప్రతీతోరునాసామణిజ్యోతిషాహాసదీధిదాయినాపాటలోష్ఠస్ఫురత్పల్లవాంతో దయత్స్వప్నలీలావతాశోభితేనాసమానేనమాణిక్యతాటంకబింబగ్రహోన్నిద్రతోన్మణీ కుండలాదర్శకల్పేనలీలావతంసోత్పలాంతర్భ్రమద్భృంగభంగీజుషాలోచనాం తేనపీ తోజ్ఝితే నేవమాధ్వీరసేనార్తకారుణ్యపూరేణసంప్లావితే నేవలావణ్యదీవ్యత్కపో లేనఫాలేనకస్తూరికాచిత్రకాలంకృతేనార్ధచంద్రేణకించిత్కళంకాంకితే నేవసంరా జితే భక్తిమద్భ్రాజితే చారుసౌందర్యపాథోధివేలాలలాటాంతవృత్తాలకశ్రేణికా వర్తనిర్యత్ననిర్యన్మహోదారశృంగారసారప్రవాహప్రభూతాణుభంగక్రమభ్రాడ రాళాలకాంతే, మహాదేవకాంతే, భవత్పాదపంకేరుహధ్యానసక్తస్యవాచస్సుధా సమ్మితాభారతీకంఠహారాయమాణాః స్వతస్సంభవంతి ధ్రువంతత్స్తుతౌ స్సుధాసింధు కన్యానివాసాబ్జరూపాః స్తదంగశ్రియోరూపలావణ్యభాజస్సరోజేక్షణాదృష్టిచి త్తాపహారా విహారాస్తదీయాజగత్పాలసౌహార్ధభూతాస్తదీయావిశేషాః క్షణాద్విశ్వ సృష్టిస్థితిక్షోభకార్యప్రవీణాస్తతోనంతరూపై నమోనాదిబోధస్వరూపాత్మమూర్త్యై స్వతంత్రప్రకృత్యై నమోలుప్తదోషాయై నమస్తేస్తు సర్వజ్ఞతానిత్యభావాత్మికాయై నమస్తేస్తు దేవ్యై నమోమజ్జనస్యై నమస్తే నమస్తే నమస్తే నమస్తే. ౧౫.

మ. అని యీరీతి బహుప్రకారముల న ◆ య్యబ్జాక్షి ఫాలాక్షు గే
హిని బ్రార్థించియు దూర్వహాగమనబం ◆ హిష్ఠప్రమోదంబునె
మ్మనమున్ గ్రమ్ముకొనంగ నంగనలు ప్రే ◆ మం గొల్వఁ గాఁ దత్త్రిలో
చనకాంతాసదనంబు వెల్వడి యెసా ◆ జ్ఞొల్లక్ష్మి చందంబునన్. ౧౬.

సీ. వెను వెంటఁ జనుదెంచు ◆ ననవింటిదొరప్రోల, గాజిల్లు పడిదాగె ◆ తేజియనఁగఁ
దనసహోదరుఁడైన ◆ వనమాలికి గిరీశ, లలనవంపెడు చంద్ర ◆ కళయనంగ
మాధవాగమనంబు ◆ మదిఁ గోరి చిట్టాడు, రతిదేవి పూఁదోఁట ◆ లతికయనఁగ
ననమానశృంగార ◆ రసనరోవరకేళిఁ, బొదలెడి రాయంచ ◆ శోదమయనఁగ

వీరనృపసంఘహృదయాబ్జ ♦ విదళనప్ర, వీణసుమబాణసమ్మోహ ♦ విస్మయనఁగఁ
జెలులు వేవేలు తనవెంటఁ ♦ జేరికొలువ, కీరవాణిఁ జిత్తరుకత్తి ♦ దేసిపెడలె. ౧౭.

క. ఈరీతి వెడలియపుడా, నారీతిలకంబు మనుజ ♦ నాథులు దన్నున్
నూరెలనిలిచికనుంగొన, వారల వేర్వేఱఁ దెలియ ♦ వలయునటంచున్. ౧౮.

క. తనమదిని గోరుచుండఁగ, జననాయకుఁడది యెఱింగి ♦ సకలమహీభృ
జ్జనన గుణరూపశీలము, లనువుగ వచియించు దాని ♦ నచటికిఁ బనిచెన్. ౧౯.

క. పనిచిన యారసమంజరి, యును భోజకుమారిఁ జేరి ♦ యున్నతసింహా
సనములవసించు రాజులఁ, గనుఁగొని వివరించి తెలుపఁ ♦ గాఁ దొడఁగుతఱిన్. ౨౦.

చ. బలిమిని యేనిచైద్యునకు ♦ బాలనొసంగుదునంచు నాత్మలోఁ
దలఁచు చుకక్షిచాపసము ♦ దంచితహస్తుఁడు తీవ్రసాయకో
జ్జ్వలితనిషంగుఁడుం గవచ ♦ సంవృతగాత్రుఁడు నైముదంబునన్
జెలఁగుచు కక్షిణీసవిధ ♦ సీమవసించె నహంక్రియోద్ధతిన్. ౨౧.

ఉ. పంకజలోచనాశలిమ ♦ పార్శ్వయుగంబున రత్నఖేటకా
ణాంకకళావిలాససము ♦ దంచితచామరసత్కలాచికా
సాంకవముఖ్యచిహ్నములు ♦ సజ్జకమైకొని కొల్చియుండ దూ
ర్వాంకమభూకమాలికఁగ ♦ రాజ్జమునప్పరియించి వేడుకన్. ౨౨.

క. తరుణీమణియగు రుక్మిణి, ధరణీపతికవ్రజంబుఁ ♦ దరళదృగిందీ
వరములసరములగప్పుచు, నరుదెంచెన్ గొదవరాజ ♦ హంసియుఁ బోలెన్. ౨౩.

క. అయ్యెడనలర సమంజరి, తొయ్యలికడఁ జేరి జనప ♦ తుల వేర్వేఱన్
నెయ్యముచతురత చెలిమియుఁ, దియ్యనదగు వచనములకుఁ ♦ దెచ్చెన్ వరుసన్. ౨౪.

క. పంచాస్త్రసమాకారుఁడు, సంచితపాండిత్యసత్య ♦ సరసాత్మకుఁడీ
పాంచాలుఁడు లలనాజన, పాంచాలుఁడు వీనిఁ జూడు ♦ పంకేజముఖీ. ౨౫.

సీ. వీనిచక్కఁదనంబు ♦ వెరఁగంటికనఁ గాదె, యనిమిషేక్షణశౌరి ♦ యమగసహులు
వీనిప్రతాపంబుఁ ♦ బూనినిర్జింపంగఁ, గాదె స్వాహాసేన ♦ కదలిఁబడియె
వీనియౌదార్యంబు ♦ వినినంతటనె కాదె, సంతానవితతిపం ♦ చత్వమొందె
వీనిధైర్యవిభూతి ♦ వెలసినంతన కాదె, సౌవర్ణభూధరంబు ♦ చట్టుపడియె
తరుణి వీనిభుజాగ్రసం ♦ స్థానమహిమఁ, గాదె వసుమతి యచలమై ♦ ప్రోదగనియె
వీఁడుగుణరాశి కెల్లను ♦ వీఁడుచూడు, వేడ్కఁ గలదేని వరియింపు ♦ సీనినయల. ౨౬.

గీ. ఇంతియీతండుకుండలా ♦ ధీశ్వరుండు, ప్రాక్కుధరశృంగమునఁదోఁచు ♦ భానుకరణిఁ
గనకసింహపీఠివసించి ♦ కమలనయన, నిన్నుఁగనుచున్నవాఁడాత్మ ♦ నెనరుదొరల.

క. కందళితతీవ్రనిజభుజ, సందోహనివారితారి ♦ శార్వరుఁడీరా
ణ్ణందనుఁడువిబుధజనహరి, చందసుఁడువరింపుమితని ♦ శచిహరిఁబోలెన్. ౨౭.

గీ. పంకజేక్షణయీతండు ♦ పాండ్యనృపతి, కనకముక్తాకవాటసం ♦ కలితమగుచు
మహితగతినెప్పుదక్షిణ ♦ మధురనేలు, మేటిలేరెందునీతని ♦ సాటిదొరలు. ౨౮.

ఉ. ఎంతటిభాగ్యశాలియితఁ ♦ డెంచఁగవేరకుమారికాతటీ
సంతతవిస్ఫురత్ఫలవి ♦ శాలరసాలమహీరుహావళీ
ప్రాంతవిహారహారిశుక ♦ రాజమరాళసమగ్రశారికా
సంతతగీతికాశ్రవణ ♦ సాదరుఁడైవిహరించునెప్పుడున్. ౩౦.

క. ఇతనివరియించువేడుక, సతినీమతిఁగలుగునేని ♦ సమకూరుదివ
స్పతితోడివిహృతిరచికిన్, జతగూడినరీలిపీని ♦ సహవిహరణముల్. ౩౧.

పంచచామరము. స్మరుండురూపసంపదన్ద్వి ♦ షద్విశోషణక్రియా
హరుండుకిన్నరుండుగీతి ♦ కాశ్రీరూప్యచాతురిన్
వరాటనీనివారితారి ♦ వర్గుఁడైచెలంగునీ
మరాటభూవిభుండుకంటె ♦ మానినీశిరోమణీ. ౩౨.

శా. భద్రేభంబులఁగూల్చుసింగముగతిన్ ♦ బ్రత్యర్థిభూపాలురన్
రౌద్రోల్లాసవిలాసముల్ మెఱయఁబో ♦ రంగెల్చినానాదిగ
క్షుద్రక్ష్మీలకునాటపట్టగుచుఁదా ♦ లుప్పావాసవుఁడోయనన్
మద్రాధీశుఁడితండుమాచితిపద్మశ్రీ ♦ మద్రాజసింహాననా. ౩౩.

స్రగ్ధర. పూరించున్ గానవారిన్ ♦ భువనవిలయుకృ ♦ ద్భూరిదానానలశ్రీ
శౌరంధర్యప్రకర్ష ♦ స్ఫుటితవిమత ♦ భూనీవన్నమ్మహీష్మ
గ్మారాత్యంతప్రశస్య ♦ ద్బహుజలనిధులన్ ♦ బ్బొమ్మిలుండివ్యలెంచన్
సౌగంధ్యస్ఫూర్తిభాస్వరుండన్ ♦ జనపతిసకలా ♦ శ్చర్యసౌందర్యనుస్ఫూర్తి ౩౪.

క. ఆసుమచాపుడుపలివిధో, ల్లాసమ్ములుమెఱయుముంగ ♦ లనిలిచనఁగన్
భాసిల్లుచున్నవాఁడీ, కోసలపతియితనిఁజూడు ♦ కువలయనయనా. ౩౫.

లయగ్రాహి.

అంగనరపాలుఁడితఁ ♦ డంగనకనుంగొనుమ, నంగుఁడువరాకృతిఁబ ♦ తంగుఁడు[illegible]
జంగమసుమేరువుభు ♦ జంగమకులాధిపుఁడ, భంగురకళావిభవ ♦ సంగతిగణించన్

ముంగిటినిధానముత ♦ నుంగనినుతించుకవి, పుంగవులకుఁ గోదమ ♦ సింగమనియెంచుఁ
సంగరమహీతలము ♦ నంగినియుశాత్రవకు, రంగములువీనివౌర ♦ యంగలరెయన్యల్.

మత్తకోకిల. భాసురాత్మయశోవిశాలవి ♦ పాండురాబ్జనివాసనో
ల్లాసబంధురబంధరార్భక ♦ లక్షితాంబరమండలుం
డాసితాచలచందనాచల ♦ హారిసద్గుణధుర్యుఁడీ
కోసలావనిభర్తమత్తచ ♦ కోరలోచనచూచితే. ౩౭.

తరళ. జగతినద్భుతచండకౌశిక ♦ సంయమీశ్వరసత్కృపా
నుగతినూర్జితవిక్రమోదయ ♦ నూత్నవైభవభాస్వరుం
డగణితోజ్జ్వలతేజుఁడైత్తన ♦ రారుచుండుమహోన్నతిఁ
మగధభూతలనాథుఁడీతఁడు ♦ మత్తసింధురగామినీ. ౩౮.

సీ.. పశుపతియాగార్థ ♦ బంధితానేకదు, ష్పాదనానృపతిసం ♦ దానుఁడితఁడు
ప్రబలభుజాక్లిష్ట ♦ పటుగదావినిపాత, చకితమాఘరజన ♦ స్వాంతుఁడితఁడు
సుగరపరాభూత ♦ శౌరిపరిగ్రాహి, తాపూర్ణజలనిధి ♦ ద్వీపుఁడితఁడు
సంతతవితరణా ♦ వంసికేతనసవ్య, నిజనికేతనగిరి ♦ వ్రజుఁడితండు
తరుణిసామాన్యుఁడెయితండు ♦ తరణితనయ, విస్తృతనియుద్ధచాతుర్య ♦ విభవజనిత
హార్షితదధీనకృతచతు ♦ రంగసంఘు, మేదురితమాలినీపుట ♦ భేదనుండు. ౩౯.

క. మంజులవచనమ్ములరస, మంజరియీరీతినృపకు ♦ మారులగుణసా
మంజస్యముబహువృత్తము, లుంజతురతమీఁగాఁదె ♦ లుపుచునువరుసన్. ౪౦.

క. హృద్యానవద్యభూషా, ప్రద్యోతితభూనభోంత ♦ రాళుండగున
వైచ్ఛద్యన్నృపాలునిఁజూపుచు, మాద్యత్స్వరభృతనినాద ♦ మధురిమననియెన్. ౪౧.

శా. ఖద్యోతంబులుతిగ్మరశ్మియెదుటం ♦ గన్పట్టఁగాలేనియ
ట్లుద్యోతంబగునేతదుద్ధతమహో ♦ వ్యూహానలజ్వాలికా
పద్యన్యాన్యదరివ్రజంబులెలభ ♦ ప్రాయంబగుఁజిత్రమీ
వైద్యత్మాతిఖిల్లభూతిదుతలఁపన్ ♦ సామాన్యుఁడేరక్షిణీ. ౪౨.

క. అనిపలుకుచెలియమాటల, ననాదరమొనర్చితపణి ♦ యప్పలికనగన్
మనమ్మున నెంచుట్టయింగిత, మునఁదెలియుచుస్సక్కిగనిసి ♦ ముదితవసననియెన్. ౪౩.

గీ.. [illegible]ఖ్యాతంబుసామాన్య ♦ నృపతియనుచు, నీమదిఁదలంపకుముభుజో ♦ న్నిద్రభద్ర
విక్రమాక్రాంతనిర్ధూత ♦ విమతధరణి, పాలుఁడసర్గ్గఁగనుశిశు ♦ పాలుఁడబల. ౪౪.

సీ. కంబుకంఠమువాఁడు ♦ కమనీయరమణీయ, చారుశోభనకటా ♦ క్షములవాఁడు
మొలకనవ్వులవాఁడు ♦ మురిపెంపుటురిపెంపు, గరిసించుబాహాయు ♦ గంబువాఁడు
నిడుదకన్నులవాఁడు ♦ ఒడిదంపుటడిదంపుఁ, దళుకుమైపురువునఁ ♦ గలుగువాఁడు
తళుకుఁజెక్కులవాఁడు ♦ వెలిదమ్మివెలిఁజిమ్మి, యలరారుకీర్తుల ♦ వెలయువాఁడు
కాంచనధరాధరాధిత్య ♦ కావిభాస, మానబాలారుణాతప ♦ మసృణఘుసృణ
పంకసంకీర్ణలసదురో ♦ భాగలిప్త, చందనుండింటిసాత్త్వతీ ♦ నందనుండు. ౪౫.

తరళ. ఉదుటుమీఁఅధరాధరంబున ♦ నుండిదేండిమగంటిమిన్
గోదమసింగమువచ్చునోజన ♦ కుంఠతేజుఁడితండురా
యదుకుమారులువీనిఁగాంచిమృ ♦ గార్భకంబుల్గచొప్పునన్
బెదరినల్గడఁబాఱుచుందురు ♦ భీతబాలమృగేక్షణా. ౪౬.

మ. అరవిందాహితపుత్రికాతటయుగ ♦ ప్రాంచన్మహోద్యానభా
స్వరమాకందతమాలతాళబదరీ ♦ జంబీరనారంగకే
సరముఖ్యద్రుమపల్లవప్రసవగు ♦ చ్ఛస్ఫారమాసిస్థశ్రీ
పురసామ్రాజ్యరమాధురంధరుఁడుపూఁ ♦ బోఁడీయితండెన్నఁగన్. ౪౭.

మ. సఖులైవీనియెడన్సుయోధనజరా ♦ సంధాదిధాత్రీపతుల్
సుఖులైయొప్పుచునున్నవారనుటచే ♦ చోద్యంబువృత్రద్విష
న్ముఖబర్హిర్ముఖులైనమిత్రులయియా ♦ మోదంబుసంధిల్లఁగా
నఖిలాశాపరిపాలనస్ఫుటనిజ ♦ వ్యాపారులైయుండఁగన్. ౪౮.

గీ. నయముభయమునుదోఁపను ♦ నయములాడు, మాటలనుసవ్యసాచికో ♦ గాటమగుచు
చింతవలవంతయంతంత ♦ చిగురుఁబోత్త్ర, తత్తఱముతోయసూత్తముఁ ♦ దలఁచియున్నియె.

సీ. నీదుపేరుగనుప్రై ♦ నివసింపనేనేమి, కలశాబ్ధికన్యనా ♦ కమలనాభ
నినుఁజిన్ననాఁడెపెం ♦ డిలియాడనేనేమి, నీలావధూటినా ♦ నీరజాక్ష.
నీయంకతలమున ♦ నెక్కొనవేనేమి, రాధావధూటినా ♦ రాజసిం...
నినుఁగూడిపండువె ♦ న్నెలనాడనేనేమి, గోపాలబాలనా ♦ ...
యేలననుఁగోరివచ్చెద ♦ విటకుఁగృష్ణ, యేలనను బాళిఁ...ఁదు ♦ విపుడు...
యేలననుఁగాఁగిటఁగదింతు ♦ విపుడుశౌరి, యేలనానో...నోఘులీ ♦ ...దిప.

క. బ్రహ్మణ్యుఁడుగోవిందుఁడు, బ్రాహ్మణవచనములకొండు ♦ ...
బ్రహ్మర్షులచేవిందుము, బ్రాహ్మణుపలుకిట్టులేల ♦ రాయిడిఁబెట్టెన్. ౫౧.

వ. అని బహుప్రకారంబులం దలంచుచు న చ్చంచలేక్షణయుదంచితవిరహదవదహన
దోధూయమానమానస యగుచు నుండియు నండజగమనలతోడ నెప్పటియట్లన
నగుచు సహజదరహాసకందళీతుందిలామందమందాక్షసంకుచితనిజావలోకనమ్ముల
రాకుమారులు ధైర్యమ్ములు వదలియును మోహాతిరేకంబునం బొదలియును గాంభీ
ర్యంబులు విడిచియును గౌరవంబులు మఱచియును బిరుదమ్ము లుడిగియును నర
దమ్ములు డిగియును నాయుధమ్ములు వైచియును నాయాసమ్ములు సైచియును నేయునది
లేక కుసుమసాయకునిధాకం జీకాకువడి జంత్రపుంబ్రతిమలవిధంబున నప్రతిహమమ
తాశయంబునం గనుంగొన వారలంజీరికిం గొనక కనకవసనుండు వాఁడొకో యను
తలంపున నెల్లదెసలం గనుంగొను చున్నసమయంబున. ౫౨.

సీ. ముంగలనతిఘోర ♦ లాంగలాయుధమహో, ద్దండుఁడైతాళధ్వ ♦ జుండునడవ
సూరెలవీరాది ♦ వీరులైసాత్యకి, ప్రముఖానుజన్ములు ♦ బలసినడవ
వెన్నంటిబలులింక ♦ వృష్ణ్యంధకానేక, బాంధవస్తోమంబు ♦ ప్రబలినడవ
నవలసంరక్షకుఁ ♦ డైయుగ్రసేనుండు, చతురంగబలసము ♦ ద్ధతులనడవఁ
బణవఢక్కాహుడుక్కాది ♦ బహువిధవాద్య, ఘోషములవైరినృపతుల ♦ గుండెలద్రువఁ
గేసరికిశోరవిక్రమో ♦ ల్లాసహారి, శౌరినళినాక్షియెదుటసా ♦ క్షాత్కరించె. ౫౩.

చ. ఉదుటుననిట్టులయ్యదుకు ♦ లోద్వహుఁడద్భుతభంగిఁదోఁచియ
మ్మదవదరాతిభూపతుల ♦ మానసముల్ కడుతల్లడిల్లబె
ట్టిదముగసింహనాదముక ♦ దిండిమగంటిమిసంఘటించియ
మ్మదవతిఁజూచెలేనగవు ♦ మన్ననయుందళుకొత్తనత్తఱిన్. ౫౪.

క. సతియునుజూచెన్ యదుకుల, పతినపుడుదృగంచలముల ♦ బాలికఁజూచెన్
బలియునునిదిగనిడగ్గఱి, రతిపతితనతూణయుగము ♦ గ్రక్కునఁజూచెన్. ౫౫.

సీ. పాంచజన్యశ్రీల ♦ పరినయంబునఁబోలెఁ, గంఠంబుమీఁదను ♦ తక్కాంత నెరపు
నందకవినిహితా ♦ నందంబునంబోలెఁ, గరికినూఁగారుపైఁ ♦ జెలిమి నెగపు
శార్ఙ్గశరాసల ♦ స్తకమైత్రిచేఁబోలె, యరిదిలేఁగొనుపై ♦ నాస నెరపుఁ
జక్రసంఘరణవీ ♦ క్షాధురీణతవోలె, కటిమండలంబుపైఁ ♦ గాంక్ష నెగపు
నెరపుగలమేనిజిగిపేరి ♦ యుదధిదుమికి, యూరుకదళియుగముబట్టి ♦ యోలలాడు
కంబుకంధరసకలాంగ ♦ కంబులందు, మురహరునిచూడ్కిచుట్టాల ♦ సురభిమాడ్కి.

క. తొట్టుతొలుతయదుకులేంద్రుని, యలఘుంజూపులతాంగి ♦ యానసనీమణ్
నిలిచెఁగుసుమాస్త్రశాబరునియు, రులనఁదగుదుమెలఁజగిలి ♦ యుండెనసంగిన్. ౫౬.

ఉ. క్రందొనరించుమాగధము ♦ ఖక్షితిపాలసహాయసాత్వతీ
నందనభూరిభూషణక ♦ నత్కనకద్యుతిదప్పియుండఁగో
విందముఖారవిందమొక ♦ వింగుఘటించెమృగేక్షణేక్షణేం
దిందిరపాళికిం బ్రియము ♦ నెక్కొనహాసమరందధారలన్. ౫౮.

ఉ. కోమలిచూడ్కులక్షియుగ ♦ కోటరముల్దిగనాడిసంభ్రమో
ద్దామగరుచ్ఛలందనరు ♦ తప్తసుభద్రకకర్ణపత్రముల్
భూమికిఁ బ్రాలఁగృష్ణముఖ ♦ పూర్ణశశిద్యుతిఁగ్రోలిక్రోలిబల్
ప్రేముడిమర్లనమ్మరుని ♦ పెంపుడువెన్నెలపుల్గులో యనన్. ౫౯.

గీ. నాతితమిఁజూపుచూపుల ♦ న్నలినయను, రకపుఁజూపులడాసిసా ♦ తెనుమరలఁ
నతనిమదిఁ బ్రేమఁదనవారి ♦ నడిగియడిగి, తెలిసిక్రమ్మఱిలలవరుఁ ♦ జెలుపననఁగ.

శా. బాలారత్నముచూపులున్ గమలనా ♦ భప్రౌఢదృష్టుల్ సము
ద్వేలప్రేమపరస్పరాస్పదములై ♦ దీపించుచున్ గేళినీ
హేలావత్యవతంససూనశరభా ♦ గిందీవరేందీవర
శ్రీలన్ చాలఁ జెలంగె సర్వభువన ♦ క్షేమంకరస్ఫూర్తితోన్. ౬౧.

ఉ. అంతమురాంతకుండు గడు ♦ నగ్గలికన్ దగుదిగ్గజంబునా
వింతహొయల్ సెలంగనట ♦ వేగమెపన్ని చెంతఁజేరియా
వంతయుఁగొంకులేకనలి ♦ నాననచాననటింపఁజేయనేఁ
డింతయుదేలసిగ్గనుచు ♦ నెత్తురఘంబుననిల్పెఁబోల్పఁగన్. ౬౨.

వ. ఇత్తెఱంగున మెఱుంగు నపహరించువలాహకంబుచందంబునం బునఃపునరాలోకనోత్పాదితసితాంభోజవస్య యగుభోజకన్యను బ్రతిపాదితనిజమనోరథం బగు రథంబున నధిరూఢం గావించుకొని హసితరుచిదళితకుందుం డగుముకుందుండు నిజభుజవిక్రమక్రమోద్రేకంబది లోకంబున కసహ్యంబుగా నభంగసంగరక్రియాకౌశలకృతవర్ణ యగుకృతవర్మయు దళితపరనాయకసాయకక్షోభితాన్యదానుం డగుయుయుధానుండును ముసలహాలసంఘాతభీతదితిజాతవిలోకనప్రవర్ధమానబలదేవుం డగుబలదేవుండును వెంట నంటి రా వివిధవిహారసమగ్రజాగ్రదుగ్రసేనుం డగు నుగ్రసేనుండును బరిపంధినిర్వాపణక్రూరుం డగునక్రూరుండును నిరుగెలంకులం బలసి నడువ విడువనిచలంబున బలంబున కగ్రభాగంబునఁ బ్రతిపాదితధనుర్వేదపరాయణు లగునారాయణగోపాలురు చనుదేర ద్వారకాభిముఖుం డై పోవు నవసరంబునం గనలి నళినబాంధవకరప్రకరసమశరనికరశోషితవిపక్షసేనాసిం

ధుండును సమధికగంధుండును మదాంధుండును యాచకాభీష్టదానసంఘటిత
మహాసంధుండును నగుజరాసంధుండును విపక్షశిక్షకచాపవిద్యావైశద్యం బగు
చైద్యుండును ముహుర్ముహుఃకథితనిజబిరుదకథోదంతవక్త్రుం డగుదంతవక్త్రుం
డును ద్విషత్సముత్పాదితభయవిసూరుం డగువిదూరుండును విమతసమాసమా
హామరీచికానిషేషణఖల్వుం డగుసాళ్వుండును స్వకీయదోస్సారనిర్మథితమహాప్రద
పౌండ్రుం డగుపౌండ్రుండును గూడుకొని పిచండిలగండమండలస్రవన్మదధారా
విభ్రమదభ్రిమరప్రభాసందోహంబు చేహంబు కాంతులతో నంబరంబునం బర్వ
దుర్వ్యూహంబు లగుఘనాఘనంబుల ననుకరింపఁ దద్గతవిద్యుల్లతా వితానంబు
భంగి నరుణధాతుకేతుమణికాంతు లుల్లసిల్ల నిబిడశరశీకరంబు లాసారంబుగా
బృంహితంబు లనుగర్జల నూర్జితంబు లగుచు వర్షాదినంబులగండు మెండుకొన
వేదండంబులును ఖచితకాంచనబింద్వుసుందరంబు లగునీషాదండంబులును సుకల్పిత
కూబరాక్షవరూథంబులును గేతనవిద్యోతమానంబులును గింకిణీజాలాభిరామం
బులును నీశావిశేషంబులం బరిణతంబు లగుచు మనోమారుతజవంబుల నపహసించు
యుగ్యంబులుం దనరి వైయ్యాఘ్రచర్మసంవృతంబు లగుచు జంగమంబు లగుధరా
ధరంబుల ననుకరించునరదంబులును బహువిధంబు లగువర్ణంబులును గుఱుచ
లగుకర్ణంబులునుం గలిగి సింధుపారసికకాంభోజారట్టబాహ్లీకదేశసంభవంబు
లగుతురంగంబులును నయోమయంబులును బహువిధంబులగువర్మంబులుంగలిగిపరిఘ
పట్టిసప్రాసగదాముసలముద్గరకరవాలశూలభిండివాలశక్తితోమరకుంతక్షురికాదిసా
ధనంబులం బూని యుద్భటాటోపదీపితు లగుపదాతులునుం బరివేష్టింప
నిలింపకోటికద్భుతం బగుపరాక్రమాతిశయంబునం దనరి జ్యాఘోషంబులును
శంఖనిస్వనంబులును సింహనాదంబులును నాస్ఫోటితక్ష్వేళితంబులును భేరీపటహ
మృదంగడిండిమగోముఖకాహళాదివాదిత్రనాదంబులును భూనభోంతరంబుల నిండ
యాదవవాహినీసముదయంబుల వెన్నాడి నడుచు నవసరంబున స్వసహజాపహరణ
జనితాంగోపాకులస్వాంతుండును శూరాభిమానియు నగురుక్మి సముత్తుంగమాతంగ
తురంగశతాంగసంగతులగుచు రుక్మబాహుప్రముఖు లగుతమ్ములు పరివేష్టింప సజ్జీకృత
శరాసనుం డగుచు జరాసంధప్రముఖులం దలకడచి ఘోరంబుగా శరాసారంబుల
వృష్ణిబలసంతానంబులం గప్పుచు నడరునతనియిరుగెలంకులఁ బశ్చాద్భాగంబున
శిశుపాలమాగధప్రభృతులు బరివసంబు చేసిన హలాయుధుండు కనలి జననాయ
కులం గనుంగొని సర్వతోభద్రవ్యూహంబు సంఘటించి యందు వలపటఁ జేకితాన

సహితుండై సాత్యకియునుం దాపటఁ గృతవర్మయును బూర్వభాగంబున నుగ్రసేనుం డును బశ్చాద్భాగంబున నక్రూరుండును నారాయణగోపాలపురస్సరంబుగా గరుడకేతనాభిరామంబును సైన్యసుగ్రీవమేఘపుష్పవలాహకనామతురంగశోభి తంబు నగురథంబున శంఖచక్రగదాఖడ్గశార్ఙ్గాది దివ్యసాధనసమన్వితుండై మధ్య భాగంబునఁ బుండరీకాక్షుండును నిలిచిరి. హలముసలమండితబాహుదండుండును నీలాంబరుండును దాళకేతనవిరాజమానరథుండును నగుచు బలిమియు నగ్రభాగంబునం బన్ని నిజానీకంబులతోడం జేర్చి యెదిర్చి నడచెఁ. ౬౩.

సీ. శరగరుత్సంభూత ♦ జంఝూనిలంబుల, సంక్షోభితంబయ్యె ♦ జగతియెల్ల
భూరిభేరీరవం ♦ బులఁగులాచలగుహా, సంఘాతములు ప్రతి ♦ స్వనమెలిసెఁ
గంఖాణబృందరిం ♦ ఖాఘట్టనంబుల, క్షోణీతలం బెల్లఁ ♦ జూర్ణమయ్యె
మత్తమాతంగస ♦ మగ్రయానంబుల, ఫణినాయకుఁడు ఫణా ♦ పటలిముడిచె
దిక్కులెల్లవివర్ణతా ♦ దీనమయ్యెఁ, జండభానునికిరణముల్ ♦ సాగవయ్యె
జాతరోషజరాసంధ ♦ చైద్యవృష్ణి, ధాపణీశచమూసము ♦ ద్ధతినపుడు. ౬౪.

క. అడరెడుకినుకనుగన్నులఁ, బొడమెడుసాంద్రారుణాంశు ♦ పుంజమ్ములఁ జి
క్కడునవనవాస్త్రధారల, కడుగనితోషవయ్యెబలము ♦ లొక్కటఁ గదియన్. ౬౫.

చ. ఖరకరుఁ గప్పుచున్ బలలము ♦ గంబునయోధులు క్రోధమాత్రయా
ధరఁ జతురంగముల్ చదియ ♦ దారుణబాణములన్ నిగుడ్చుచోఁ
గరితురగాశ్వసద్భటని ♦ కాయము కొండహళన్ నిజారితో
బెరయక మున్నె కూలెసుర ♦ బృందములచ్చెరువందిచూడఁగన్ ౬౬.

క. తమకించిబలములొక్కట, సమరముఖంబుననుగూలు ♦ చతురంగములన్
సమదగతిఁ ద్రొక్కికొంచును, విమతులపైనడరెఁ గ్రోధ ♦ వివశంబులుగన్. ౬౭.

సీ. అరుణలోచనదీప్తు ♦ లాత్మగాత్రాసక్తి, సిందూరరుచులతోఁ ♦ జెలిమిసేయ
ఘంటానినాదముల్ ♦ కంఠాంతరోత్థిత, బృంహితధ్వనులతో ♦ బెరసినిగుడఁ
గరవలన్నిగళని ♦ ర్ఝరనీలరోచులు, చలదలిపటలితో ♦ నెలవుకొనఁగ
నిజకేతుపటపట ♦ నినదమాధోరణా, స్ఫాలనధ్వనితోడ ♦ సరసమాడఁ
దోమరాంకుశహతులకుఁ ♦ దూలిపోక, జోదులొక్కటఁ గొల్వను ♦ న్మాదవృత్తి
బరబలావలులొండొండ ♦ బడలుపడఁగ, దంతిసంఘంబులడరెను ♦ ద్దండవృత్తిఁ.

మ. ఖురవిక్షుణ్ణధరాపరాగములది ♦ క్కుల్ మిన్ను నేకంబుగాఁ
గరయాద్ధత్యము చేతఁ బల్లటిలిసం ♦ గ్రామంబు సాలింపుచున్

బరసేనాశ్వికకోటిబెట్టొమఁగశుం ♦ భద్విక్రమాటోపతక్
బరఁగెక్సాదిమనోజ్ఞవృత్తములన ♦ శ్వంబుల్ రణక్రీడలక్.    ౬౯.

సీ. రత్నధ్వజంబుల ♦ రమణీయకాంతులు, రధికభూషణదీప్తి ♦ రహిఁవహింప
భూరినేమిస్వనం ♦ బులుశరోత్సర్జన, శింజినీరవములఁ ♦ జెనసిమిగుల
వివిధాయుధంబుల ♦ నవనవదీప్తులు, మాణిక్యమకుటాంశు ♦ మహిమమీఱ
రధ్యఖురాఘాత ♦ రవముసారధిముఖో, ద్భూతంబులగునద ♦ ల్పులుఁజెలంగ
నాత్తసంస్థితయోధశ ♦ రాసనోత్థ, బహుశరాసారములశత్రు ♦ బలములెల్లఁ
బెల్లగిల్లంగనెల్లెడఁ ♦ బృథులరభస, తుములముగఁదేరులడరెను ♦ ధురతనిగుడ.

శా. మోదంబాత్మఁబెనంగొనఁగఁగొప్పుచమూ ♦ ముఖ్యుల్ నిజాస్త్రాహతిక్
ఖేదంబందిధరిత్రిపైఁబడఁగసం ♦ కీర్ణాత్మబాహాబల
ఖోదీభూతశతాంగఘోటకకరి ♦ స్తోమంబుగానెల్లెడక్
బాదాతంబడరెక్మహోదధికథా ♦ పారీణసంచారమై.    ౭౦.

సీ. చరణఘాతమ్ములఁ ♦ జదిపిరథ్యమ్ములఁ, గరములనొగలుచీ ♦ కాకుచేసి
దంతఘట్టనముల ♦ ధరసారథులదుల్చి, పృథుగండనిహతుల ♦ రథులఁగూల్చి
రథములఁగ్రుంచితు ♦ రంగంబులనుగెంటి, వాలంబులాడిసిదు ♦ ర్వారలీల
సాదులతోడర ♦ సాస్థలిక్రేవేసియు, నంబరంబునకెగ ♦ యంగమీటి
సమయఁజేసిపదాతుల ♦ గములభయద, దారుణోద్భటశృంఖలో ♦ దాత్తవిహర
ణమ్ములంగీటడంచిజ ♦ న్యంబుసలిపెఁ, ద్వరితగతిమీఱిసైన్యమా ♦ తంగసమితి.    ౭౧.

సీ. నారాచహతులవం ♦ తములెల్లనుగ్గాడి, భల్లంబులనుగర ♦ పజ్క్తిఁదునిమి
యర్ధచంద్రంబుల ♦ నగలించికుంభముల్, క్షురములఁబాదముల్ ♦ నఱకికరుల
భంజించిహయముల ♦ పైఁజనియంజలి, కమ్ములకంధముల్ ♦ నుమ్ముచేసి
కూర్మనఖంబులఁ ♦ గుదియించిచంపిరి, రౌతులతోడతు ♦ రగ్రహతుల
వాజులవధించికర్ణని ♦ సాతవత్స, దంతనాళీకములనుబా ♦ దాతములను
గేరిన్గ్గాడిరొండొండ ♦ కెరలియుభయ, సైన్యరథికోత్తములుబాహు ♦ సారముసను.

మ. కరులంగిట్టినిసాదివర్గములతో ♦ ఖండించియుగ్యాత్మకహా
బరసూతధ్వజపాళితోరథికులక్ ♦ భంజించినానాయుధో
త్కరసన్నద్ధపదాతివర్గములవీఁ ♦ కంద్రుంచిరొక్కుమ్మడిం
బరగక్రేణులనూఁకియాశ్వికవరుల్ ♦ దోర్గర్వమొప్పారఁగక్.    ౭౨.

సీ. ముసలశక్త్యృష్టుల ♦ వెసరథంబులఁగిట్టి, పిండిపీచంబుగా ♦ వించువారు
కరవాలశూలము ♦ ద్గరకుఠారంబుల, వారణఘటలను ♦ వ్రచ్చువారు
ప్రాసతోమరకుంత ♦ పట్టిసశ్రేణులఁ, దురగసంఘాతమ్ముఁ ♦ దున్మువారు
చాపనిర్ముక్తార్ధ ♦ చంద్రనాళీకాంజ, లికవిపాఠతురంగ ♦ నికరములను
బఱపియిడియిదియనకయే ♦ పోఁజునైనఁ, జొచ్చిచెండాడిశూరులు ♦ పిచ్చలింప
బాహుబలదర్పములఁజాలఁ ♦ బరఁగువారు, రణమొనర్చిరియోధవీ ♦ రవ్రజంబు. ౩౫.

ఉ. ఒక్కఁడుపల్వురందొడరి ♦ యొర్చియుఁ నొచ్చియుఁబల్వురొక్కనిన్
మిక్కిలినొంపఁబాటియును ♦ మేకొనినిల్చిసహాయవృత్తిచే
నక్కడనిక్కడందొలుత ♦ నందినకయ్యపువారుగుంపులై
పెక్కుతెఱంగులన్దొడరి ♦ భీకరగర్జలఁబోరిరత్తఱిన్. ౩౬.

చ. కరముఁగరమ్ముతోఁబెనచి ♦ గాఢరదక్షతఁగుంభమౌక్తికో
త్కరములురాలఁదోమరని ♦ పాతములంబయిమూఁకతుల్వర
స్వరమునునొంచుచున్ధరణిఁ ♦ బద్దనువీడసిరోషవృత్తిచేఁ
గరులుపెనంగెఁదప్పలయు ♦ గంబునదారుణవిక్రమంబునన్. ౩౭.

సీ. తనునొవ్వనేయునా ♦ తనిఁగూడనొంచుచు, నిరువురుమూర్ఛల ♦ నొరఁగువారు
హయసారథులఁజంపు ♦ నతనినట్లనచేసి, కొంచకధరికులం ♦ ఘించువారు
దారుణాస్త్రాహతిఁ ♦ దమమూర్ఛనొందింప, లేచియట్లనెవాని ♦ నేఁచువారు
ఒకరిచేనొక్కరు ♦ వికలాయుధత్వంబు, చెందినియుద్ధంబు ♦ చేయువారు
చెలులుబంధులుపగరచేఁ ♦ జిక్కువారి, కైపెనంగుచుమరణంబు ♦ గాంచువారు
నైబలద్వయరథికుల ♦ నల్పశౌర్య, మెచ్చఁగాఁబోరిరమరులు ♦ పిచ్చలింప. ౩౮

సీ. కరవాలహతులను ♦ గడికండలుగఁజేసి, రూపుమాపియునతి ♦ క్రూరవృత్తి
డొంకెనవాట్లనా ♦ కోపంబుసడలంగ, సమయించియునుశక్తి ♦ సంహతులను
గుండెలుపగులంగ ♦ గ్రుచ్చియొత్తియుఁదోమ, రమ్ములుపైచిచీ ♦ రమ్ములెడల
గుండెలుపగులంగ ♦ గ్రుచ్చియొత్తియుఁదోమ, రమ్ములువైచిచీ ♦ రమ్ములెడల
గడపియుసబళంబు ♦ లెడనెడఁబరఁగించి, ధరఁబడఁజేసియుఁ ♦ దరతంరబు
కఱకుటంపరలేసిప ♦ క్షకరోరు, కంఠముఖ్యాంగకమ్ములు ♦ తక్కటముగాఁగఁ
ద్రుంచివైచియునాశ్వికుల్ ♦ రోషమగ్న, లైచలంబునఁబోరిరి ♦ యందునిందు.

చ. గదగదశక్తిశక్తిపరిఘన్బరి ♦ ఘంబునుగాఁగఁగైదువుల్
పొదువుచునొండుతోనొకట ♦ భూరికృశానుకణంబులొప్పఁగాఁ

జదల మెఱుంగులుప్పతిల ♦ సాంద్రశరాహతి నెత్తురొల్కఁగాఁ
దదవసరంబునన్నడిఁబ ♦ దాతులుపోరిరివిక్రమంబునన్. ౮౦.

సీ. కూలురథంబులుఁ ♦ సోలు సారథులును, బొడియగుచక్రముల్ ♦ కెడ యురథులు
వమ్మైనకేతువుల్ ♦ వ్రయ్యలౌకుంభముల్, సమ సెడిజోళ్లు ♦ చచ్చుకరులు
తెగినమేల్వాగెలు ♦ పగిలినమోరలు, సురఁగెడుసాదులు ♦ తొరఁగుహరులు
చిదురుపలాకాళ్లుఁ ♦ ఛిన్నంబులౌవ్రేళ్లు, నుగ్గైనకైదువుల్ ♦ మ్రగుభటులు
నయ్యు సైన్యంబులందు సాహసమిమీఱ, యోధులొండొరులతోఁ బోర ♦ నుగ్రభంగి
రౌద్రబీభత్ససాధ్వస ♦ రసము లేక, మైశరీరంబు దాల్చిన ♦ యట్టులుండె. ౮౧.

మ. గురుచాపప్రవిముక్తదారుణశర ♦ క్రూరాహతిన్ ద్విట్చమూ
కరపాదోరుశిరఃకపోలకటిము ♦ ఖ్యాంగంబులింతింతలై
నురుమైపోవఁగ జేయుచున్ భుజబలా ♦ నూనప్రభావంబుతోఁ
బరపెన్ సాత్యకి తేరు చైద్యునిపయిన్ ♦ భ్రామ్యన్మణారావుఁడై. ౮౨.

లయగ్రాహి.

లాంగలఘనాహతుల ♦ నంగములు వ్రీలిరిపు
పుంగవులు ధాత్రిఁబడి ♦ త్రుంగ ముసలంబున్
పంగతము సేయుచున ♦ భంగురగతింగలిసి
సింగపుఁగడంక మెయి ♦ సంగరములో మా
తంగములఁగూల్చియుశ ♦ తాంగములరాల్చియుఁదు
రంగములవేల్చియుఁబ ♦ తంగుఁడనదీప్తిన్
బొంగుచునుమాగధుప ♦ యింగవి సె రేవతీభు
జంగుఁడతివీరుఁడప ♦ ముంగురియువీఁకన్. ౮౩.

మ. శితనారాచపరంపరానిహతులన్ ♦ ఛిన్నంబులై శత్రుసం
తతులత్యంతభయంబుతోఁ దొలఁగనా ♦ నాహేతిఘోరాహవో
ద్గతబాహావిభవంబుచూపఁటకవిం ♦ తల్ సేయఁగా సాళ్వుపైఁ
గృతవర్మండు గడంగె యాదవచమూ ♦ క్షేమంకరారంభియై. ౮౪.

శా. చక్రోద్యన్నినదంబుగర్జగతినా ♦ శార్ఙ్గేణులంబర్వని
ర్వక్రోద్యన్మణిదీధితుల్ చదలశం ♦ పాస్తోమతంగాంచఁగా
విక్రాంతిన్ శరవృష్టిసంతతనివ ♦ ద్విడ్వహ్ని చల్లాఱఁగా
నక్రూరుండువిదూరు పైనడరెఁగ ♦ ల్పాంతాంబుదాటోపియై. ౮౫.

ఉ. భూరిధనుఃకలావిభవ ♦ భూషితదోఃపరిఘూర్ణితోద్యమ
ద్ధారుణహేతిపాతములఁ ♦ దద్దయులావతిశత్రుసంఘముల్
భూరణిఁ బ్రాలఁ బాంద్రజుని ♦ డాఁకెఁ దదీయచమూపతుల్ వెఱం
గూరఁగ నుగ్రసేనుఁడున ♦ కుంఠితధైర్యవిలాసధుర్యుఁడై. ౭౬.

మ. మతిఁ జెయ్యల్ జేయఁగలట్టి యోధులు రిపు ♦ క్ష్మాపాల సైన్యంబుపైఁ
దఱుమన్ మాగధ చైద్యముఖ్యులును ను ♦ ద్వృత్తోగ్రధదీప్తాక్షతిన్
శరజాలంబుల యాదవావలికిఁ దో ♦ శ్చండత్వముం జూపుచున్
ధరముల్ కంపము నొందఁగా నడరె ♦ ద్వంద్వంబయ్యె యుద్ధంబటన్. ౭౭.

క. కరి యును గరియును నరదం, బరదము వాజియును వాజి ♦ యశ్రయమునఁ గా
ల్బ్వరుఁ గాల్వురు నొండొరుతో, నరునుగఁ బోరాడుచుండు ♦ నా సమయమునన్. ౭౮.

ఉ. బంధులకెల్ల హర్షముగ ♦ బాహుబలంబున శత్రువాహినుల్
బంధురమంథరక్షుభిత ♦ వార్ధి తెఱంగున సంచలించఁగా
గంధగజాశ్వసద్భటుని ♦ కాయముల్ బరిమార్చుచున్ జరా
సంధుఁడు దాఁకె నబ్బలుని ♦ జ్యాస్వననిస్వనదబ్జజాండుఁడై. ౭౯.

ఉ. తాఁకి శరాళిఁ బేరురము ♦ దాకఁగ నేయుచు సీరి కిట్లనున్
వీఁకఁ గడంగినావొకట ♦ వీరునిఁ బోలెన టింతచేనినున్
నీకొలఁదే నెఱుంగనెవ ♦ నిష్ఠ జనాలను గాచువానితో
నాకెటు సేయనౌను గద ♦ నంబటులైన నుగీ ర్తిగల్గు నే. ౮౦.

ఆ. గొల్లపల్లెలోనఁ ♦ గొన్నాళ్లు తిరుగాడు, మండి పెరుఁగి పిదప ♦ నొకనిఁ గొలిచి
బ్రతుకు నిన్ను గెల్వ ♦ పసయే మికీ స్తులు, నింగు నుక్కుమొక్క ♦ నీచు నోర్వ. ౮౧.

క. వినను గంసునిఁ జంపుట, చేనాఁ డుండుచున్న ♦ చిరసంచితరో
షానలము నిన్ను గ్రసించినఁ, గానియుఁ కేమంబు పొంద ♦ ఘనపినిహాళిరుకన్. ౮౨.

శా. ఈరజ్జుల్ పనిలేవు మాగధత్వని ♦ యేతత్వము గోపతా
ధారం బైనమదీయవృత్తమును ♦ క్షత్రి నిలో ... పతుల్
తారీత్కంచెదరంచులాంగలహ ♦ వక్కెతుయంత్రాశ్వసం
హారంబున్ సమకొల్పి యేచె నుగ్రం ♦ బత్యంత మార్గంబుగన్. ౮౩.

గీ. విరథుఁడై జరాసంధుఁడు ♦ ద్విపికినిడాఁటి, హనిశగిరిసారమగుచున్ ♦ శాఖ రాకు
కనకపట్టయుతంబగు ♦ గదయు పూర్చి, పేర్చియార్చను రిపుకోటి ♦ బిచ్చలింప. ౮౪.

క. హలధరుఁడుఁ దాను సెక్కటి, బలుగదఁ జేఁబూని రిపులు ♦ పల్లటిలంగా
నలువొప్ప నార్చి మాగధుఁ, గలనన్ మార్కొనియె బాహు ♦ గర్వంబలరన్. ౯౫.

వ. ఇట్లర్కప్రతాపు లగునయ్యిరువు రొండొరులం దార్కొని పేర్కొనినకడంకఁ జిత్రంబు లగుగదాసారణంబులం గ్రమ్ము రత్నప్రభాసందోహంబులు చండబాహుదండమండితకేయూరమణిగణాగణితవిభావిభాసమానంబు లగుచు నభోభాగంబునం బర్వి మర్విషహం బగునింద్రచాపంబు ననుకరింప నితరేతరఘట్టనంబులం బొడము పావకశిఖాకలాపంబులం గదలువిలయసమయసూచకమహోల్కాయుగంబు ననుసరింపఁ బర్యావృత్తంబును వృత్తంబును సుపరిప్లవంబును ననుప్లవంబును దిర్యక్ప్రసరణంబును మొదలగు గతివిశేషంబుల మెఱయుచు నొండొరులయంతరంబులు వేచుచు నాలీఢంబును బ్రత్యాలీఢంబును ననుస్థానవిశేషంబులం జెంది పరస్పరంబును దెమల్పంజాలక జవాతిశయంబునఁ బూర్వభాగంబునం దోఁచి పశ్చాద్దేశంబున నుద్భవించి దక్షిణపార్శ్వంబునం బొడసూపి యుత్తరప్రదేశం గనుపట్టి కరిణినిమిత్తంబు దంతమ్ములం గ్రుమ్ములాడు మత్తమాతంగంబుల తెఱంగున ధేనువునకై తీక్ష్ణమ్ము లగుశృంగమ్ములం దొమ్ములాడు వృషభంబులకైవడి నాహారమాంసంబునకుఁ గోఁజల సమరంబు సల్పుక్రోల్పులుల చందంబున నేకగుహానివాసజనితామర్షంబుల నఖంబులం జిమ్ములాడుపంచాస్యంబులభంగిఁ బెనంగునెడ జరాసంధుండు బలదేవుని దాఁపటం బెట్టి వలపటంజుట్టుకొనివచ్చుచు విచిత్రంబు లగుసారణమ్ముల మెఱుంగు లుప్పతిల్ల గద నూఁచి వేయునవసరంబున హలాయుధుండును దొడన భ్రమరివాఱం దిరిగి విపక్షునిగద నిజగదాఘాతంబునఁ బైకి నుబుక నడచి తిరుగ నతండు సవరించునంతనఁ బార్శ్వభాగంబున వ్రేసిన వాఁడును బన్నెలపునం దప్పించుకొని ప్రలంబమర్దనునిఫాలభాగంబు బెట్టడిచిన నతండును వామనీకృతగాత్రుం డగుచుఁ దదీయప్రహారంబు నిష్ఫలంబు గావించి సింహనాదంబు సేసిన మాగధుండును రోషభీషణాకారుం డగుచు విఫలీకృతప్రహారం బగునిజగదాదండంబు పుడమిం బడకుండ మగుడ సవరించి నీలాంబరునకుం బ్రోవ యూఁక పదియడుగులకొలంది వెనుకకు లంఘించి నిలిచినం దోడనె బలుండును గుప్పించి పరిపంథిగద నిజగదతోడం బెనచి ముందరికిం దిగిచిన నతండు వసుధాతలంబు చిక్కం ద్రొక్కి పెట్టిన పట్టు తీయక తాను నట్లన తిగిచి యిద్దరు నొండొరులఁ దెమల్పం జాలక యితరేతరసమాకృష్యమాణశుండాదండంబు లగుశుండాలంబుల చందంబున నుండునవసరంబునఁ బ్రతిపక్షునిగదతోడం బెనచి యున్న నిజగదా

దండంబు పెనఁకువం దప్పించి మాధవాగ్రజుండు జరాసంధుని దలంబు వ్రేసిన నుజ్జ్వలితప్రవ్రేటున మహాసమీరణకంపితం బగు నుర్వీరుహంబుచందంబున సంచలించుచు ధైర్యం బవలంబించి నిజగదాదండంబున ముష్టికొంతకునిదక్షిణాంస ప్రదేశంబుం బెట్టు మోఁదినఁ దద్గదాఘాతంబునం బెట్టువడినకరంబునుండి పడిన గద పరవీరునకుం దోఁప కుండ మగుడ సవరించి మించినరోషాతిరేకంబునం బోవ విచిత్రంబు లగుగదాపరిభ్రమణంబుల జరాసంధునికనుంగవ మిఱుమిట్లు గొన ఫాలంబును గపోలప్రదేశంబును నంసంబులును హనుభాగంబులును బక్షంబులును బార్శ్వదేశంబులును బలుప్రవ్రేటుల నొప్పించుట నునశనిపాతంబులం జలితం బగుకులాచలంబుచందంబున నతండు పుడమిం బడి మూర్ఛిల్లుటయు రౌహిణేయుండును మహామేఘంబుచందంబున గర్జిల్లుచు మాగధవాహినీసముదయంబులం దఱిమి జయంబునం బొదలి నిలిచె నంత. క.

సీ. దంతవక్త్రుండును ♦ జింతానుకుండును, బోరఁ గోఁజైన్యుండు ♦ భూరిశక్తి
నయ్యాదవుని నొంప ♦ నతఁడుభల్లంబుల, దంతవక్త్రుని కేతు ♦ దండచాప
ములఁద్రుంచినారాచ ♦ ములనుమర్మంబులు, నొవ్వ నేసినవాఁడు ♦ క్రొవ్వుచెడక
బలుగదవైచినఁ ♦ బ్రదరముల నిగుడించి, దానిఖండించియు ♦ దండవృత్తిఁ
జేకితానుండుశాత్రవు ♦ నీకచెఁదఁగ, సారథినిద్రుంచనశ్వముల్ ♦ సంచలించి
చైద్యరథమీడ్చుకొంచును ♦ సమరభూమి, వెడలిచనె వృష్ణివీరులు ♦ కడఁగినవ్వ.

సీ. కృతవర్మసాళ్వుని ♦ శితశరంబుల నొంప, వాఁడునుంభోజేశు ♦ వాఁడియంప
వెల్లువచేముంప ♦ వివరంబుఁబొందక, కృతవర్మశాత్రవు ♦ సరయమున
మర్మాస్థిబంధముల్ ♦ వర్మంబునారాచ, ద్రుంచి పేరురమునఁ ♦ దోఁపనవిశి
ఖమ్ములుపగఁగించి ♦ కడుగయంబునఁజక్ర, గక్షకులవధించి ♦ గయుముఖోత్కఁ
జాపకేతనసూతులఁ ♦ జక్కుచేసి, రథ్యములనీఁదఁగ్రూరకా ♦ రస్తులేయ
విహ్వలుండైనసాళ్వుతో ♦ వేగరథము, నీటిదెసనీడ్చెనశ్వముల్ ♦ జెగడుచెంగి.

లయగ్రాహి. ధారుణివడంకఁగిరి ♦ దూరఁడరిసేనహయి
బోరుననుదాఁకఁగని ♦ చేగుచునుదాన
క్రూరుఁడనివార్యగతి ♦ దారుణశరాహతుల
వైరినుదమెల్లఁజెడఁ ♦ బౌరుషముచూపన్
దేరునుతురంగములు ♦ సారథిమఱిపూలినను
జేరుపవసించుతేర ♦ వారిగుణునుదర్పం

బీరసముతోఁ గొనుచు ♦ రారిపుఁడుగ్రుంచియవి
ఘోరమగుభల్లహతి ♦ గౌరవముగాంచెన్. ౯౯.

చ. నిరుపమశక్తిఁ బౌండ్రకుఁడ ♦ నేకశరంబులనుగ్ర సేనునిన్
దరమిడి నొంచుచోనతఁడు ♦ దారుణకోపముతోడసూతునిన్
దురగములన్ వధించిబలు ♦ తూపులు పేరురమాన నేసినన్
వెరపునఁ నోడిపాఱెయను ♦ వీరులు సంతసమందిచూడఁగన్. ౧౦౦.

క. సాత్యకియ త్తఱిసమరో, ద్ధత్యమ్మునవితతబాహు ♦ దర్పముసుభట
స్తుత్యమ్ముగమధ్యాహ్నా, దిత్యునిక్రియ మెఱసి సాత్వ ♦ తేయునిఁదాఁకెన్. ౧౦౧.

క. శిశుపాలుండునుగ్రోధవి, వశుఁడై తనరథమువృష్ణి ♦ వర్యునిమ్రోలన్
విశదగతినిలిపియార్చుచు, దశదిశలద్రువంగఁజాప ♦ ధరుఁడైయనియెన్. ౧౦౨.

ఉ. నిక్కముబంటువోలెనిటు ♦ నిన్ననునీకులమీవెఱుంగఁ జే
పక్కనఁజూచువారలును ♦ బాంధవులున్నగునట్టులయ్యయో
యొక్కరికిచ్చినట్టివిక ♦ చోత్పలలోచన బట్టినంత నే
దక్కనెసిమీకనన్న విని ♦ ధైర్యఘనుండగువృష్ణివర్యుఁడున్. ౧౦౩.

క. అక్కటనీచాత్మకనీ, వెక్కడభోజేంద్రతనయ ♦ యెక్కడతగునే
నక్కకుమృగేంద్రసుందరి, యిక్కావరమెల్లనిపుడ ♦ యేఁగ్రక్కింతున్. ౧౦౪.

సీ. అనితనబలువింట ♦ సునిశితాశుగములు, నూరుసంధించియా ♦ శూరవరుఁడు
శిరమునసురమునఁ ♦ జేతులమూఁపుల, నలికమ్ములందును ♦ గళమునంగు
గండభాగమ్ములఁ ♦ గటమరలందును, బరియసీఁజొనుపన ♦ ప్పగతుఁడార్చి
యన్నిబాణములఁదా ♦ నట్లనెఱయొనరింప, నలిగియొంతయునుస ♦ త్యకసుతుండు
వాఁడిబలుకోలనొక్కట ♦ వానిరథము, కేతువిలఁగూల నేసినఁ ♦ గినిసియతఁడు
భల్లమొక్కంటనాతని ♦ విల్లుదునిమి, ధరణియద్రువంగసింహనా ♦ దంబుచేసె.

తే. చేఱొకవిల్లు గేలఁగొని ♦ వృష్ణికులోద్వహుఁడుగ్రలీలన
వ్వైరిచలింపఁదీక్ష్ణశర ♦ వర్గమనర్గళభంగి సేయనా
ఘోరమహాగ్రగణ్యుఁడుడి ♦ కోపనిబంటుతనంబు పెంపునన్
దారుణబాణవర్షమునఁ ♦ దద్దయు నొంచెయదుప్రవీరునిన్. ౧౦౫.

గీ. దానమిగులంగనలిగియా ♦ దవవిభుండు, సత్తఘంటనినాదభీ ♦ షణత నొప్పు
కుంతమొక్కటిచేఁబూని ♦ పంతమడర, నే శిశుపాలు నెదఁదూఱ ♦ నేసె మెసఁగ.

క. అలుకశరమ్ములఁ జైద్యుఁ, డ్మోరమణుఁడు దానినడుమ ♦ ఖండించియెడల్
దూఱఁగఁబదిశరములయను, వీరుని నొప్పించియార్చె ♦ విస్ఫురణంగన్. ౧౦౯.

గీ. సటలు వెఱికినఁగినుక నె ♦ సంగుమేటి, సింగమన సాత్యకివిరోధి ♦ భంగపఱుప
నెమ్మదిఁదలంచియొక్క భ ♦ ల్లమ్మువింట, నపుఁడుసంధించియఱమంట ♦ లడరనేసె.

చ. అదియునువిరోధియూథభయ ♦ దాకృతిమైఁ జనిచేదిభూవిభుం
డదరకయేయుసాయకము ♦ లన్నియుఁగీటునఁబుచ్చిమిణ్గురుల్
చదలునఁబర్వనాతనిభు ♦ జద్వయమధ్యముగాఁడిదుస్సిఘో
రదశశుఁబాలు చేసినధ ♦ రంబడెనాతఁడుమూర్ఛమున్గుచున్. ౧౧౦.

వ. ఇవ్విధంబున నమ్మహావీరుండు మూర్ఛిల్లి నేలఁ ద్రెళ్లినం జూచి తత్సైనికులు హాహాకారంబులు సేసి రట్టియెడ వానిసారథి రథంబు నవరోహించి మైమఱచియున్న గించిత్తును మొగంబునం దెలివిదప్పక యెప్పటట్లన కలకల నవ్వెడువిధమ్మున నున్న యన్నరివరునిఁ గౌఁగిటం బొదివి గ్రుచ్చి యెత్తి యెప్పటియట్ల స్యందనంబున నిడుకొని సంగ్రామరంగంబునకుం దొలంగం గొనిపోయె. సత్యకతనూభవుండునుం గెలుపు గొనినయాటోపంబున రోదసీకుహరంబు భేదిల్ల సింహనాదంబు గావించుచు బలు దెరంగులతూర్యస్వనంబులు చెలంగ నిజభటానీకమ్ములనిబిడకోలాహలమ్ములు నింగి బగులఁ దన్న నన్న యగుబలభద్రుం డున్నచాయకు నడచి యతని మన్ననం బడసి సకలసైన్యంబుతోడ నుత్సాహదోహలుం డై యున్నసమయంబున. ౧౧౧.

గీ. పసిఁడినీఁటిప్రాత ♦ పనిమించుహొంబట్టు, హరువుతెరఁబొసంగు ♦ నందలమున
భోజకన్యనునిచి ♦ పురమునకనిచియా, శౌరిసమరభూమిఁ ♦ జేరవచ్చె. ౧౧౨.

క. వచ్చిబలరాముజయమున్, మెచ్చుచుసాత్యకినిఁగాంచి ♦ మిగులంగూర్మిన్
గ్రుచ్చికవుంగిటఁబొనుపుచు, నచ్చక్రధరుండువార ♦ నలరించెఁగడున్. ౧౧౩.

క. ఆలోనరుక్మిగుణుశిశు, పాలజరాసంధులట్లు ♦ బవరములోనన్
జేలుపడంగనుఁగొనియు, ద్వేలక్రోధుండయిసమర ♦ ధీరతదోఁపన్. ౧౧౪.

గీ. నడచిమురవైరియొక్కఁడె ♦ క్కఁడనటంచు, నాత్మభటమంత్రిజనముల ♦ నడిగికొంచు
రభసమునఁదాఁకుటయునప్పు ♦ డుభయసైన్య, ములును దారసమయ్యెభూభువనమదర

క. తేరులుఁదేరులు నొక్కటు, వారణములువారణములు ♦ వాజులువాజుల్
వీరులువీరులుఁదలపడి, పోరఁగనమ్ముత్తరసంబు ♦ పొంగెన్మిగులన్. ౧౧౫.

సీ. ఒండొంటితోఁదాఁకు ♦ నుద్ధతిబ్రద్దలై, పగులు వేదండకుం ♦ భములతోడఁ
గొమ్ముకత్తులబిట్టు ♦ క్రుమ్ములాడెడువీఁకఁ, జెక్కులౌనమ్మైని ♦ సిరులతోడ

బల్లెంపుఁబోటుల ♦ జల్లెడకంతల, ట్లమరిననిడుదతోం ♦ డములతోడ
నీటెబల్పోటుల ♦ నెగడొందునెత్తురుల్, దఱుగకఁగురిసెడు సా♦దములతోడ
రథికకార్ముకనిర్ముక్త ♦ పృథులబాణ, వర్షనీరంధ్రమర్మ ♦ ర్యారరుధిర
పూరములతోడనింతేని ♦ భీరువోక, భటులుగొనియాడమాతంగ ♦ ఘటలుపోర.

క. ఏమనఁగవచ్చుఁదాహ్రళ, సామజసంగ్రామమునను ♦ జాల్కొనురుధిరో
ద్దామప్రవాహములలో, వేమఱుఁదేలెఁ గతాంగ ♦ విపులప్లవముల్. ౧౧౭.

ఉ. ఘోటకముల్ కరీంద్రముల ♦ కొమ్ములకై యెగఁబ్రాకిసాదిచే
యీటెలపోటులకదనువు ♦ లెల్లకడంగునియంగమావుతుల్
ల్లాటికిఁగూలునట్టులుగ ♦ లావునుజేవయుఁజూపఁజూపియుల్
నూటికొకండెవచ్చుపలు ♦ నోళ్లనుతించిరిమించివేడుకన్. ౧౧౮.

సీ. అరదంబులరదంబు ♦ లడరనడ్డముదాఁకి, కుంజరమ్ములునేలఁ ♦ గూల్చునెడలఁ
గరులుఁగరుల్ దాఁకఁ ♦ గడఁగిబల్ తేజులు, నూరారువెడఁదాఁకి ♦ బోరునెడలఁ
దేజులుఁదేజులే ♦ తీర్చిపోరఁగఁదాఁకి, వడిఁగుంతములఘటుల్ ♦ ద్రచ్చునెడలు
భటులుభటుల్ పోరఁ ♦ బటురథాంగతురంగ, గజములుక్రిందగాఁ ♦ గవియునెడలఁ
గలిగిసమరాంగణమ్మురక్త ♦ ప్రవాహ, కేళికాలోలజేతాళ ♦ బాలికాపి
హారరమణీయమయిసునా ♦ శీరముఖసు, పర్వులకుఁజూడలోచన ♦ పర్వమయ్యె.

వ. అట్టియెడ నవ్విదర్భరాజనందనుండు రెండవఖండపరశునిమాడ్కిఁ బ్రళయకాలంబునం దోఁచునంతకునిపోలికఁ బౌలస్త్యయూథబలసంహారంబునకుంగడంగు రఘుపుంగవుని తెఱంగున మహార్ణవంబుఁజొచ్చి కలంచి యాడెడు తిమింగిలంబుచందంబున భండనక్రియావిజృంభణంబు నెరపుచు వేదండతండంబులబృంహితధ్వనులును ఘంటానినాదంబులును శతాంగసంఘంబుల నేమిస్వనంబును గేతనకింకిణీసంఘులక్వణనంబులును రథికవరులవిజయశంఖధ్వానంబులును ధనుర్గుణారావంబులును తురంగమంబుల హేషాఘోషంబులు ఖురవిఘట్టనసముద్భూతకఠోరనిర్హ్రాదంబులును వీరభటులచటులతరభుజాస్ఫాలనజనితనిర్ఘోషంబులును హాలాహలసన్నిభంబు లగు కోలాహలంబులు నెక్కుడుగ నిఖిలదిక్కులఁ దనరథంబుఁబరపి కొఱవిఁద్రిప్పిన తెఱంగునఁ బర్ణిభ్రమింపుచుఁ దూర్పునం దోఁచి పడమట నురవణింపుచు నుత్తరంబునఁ దోఁచి దక్షిణంబున నక్షీణపరాక్రమంబు మెఱయింపుచుమహోత్తాళసన్నిభంబగుధనువు సారింపుచు నర్ధచంద్ర నారాచక్షురప్రకంకపత్త్రప్రముఖంబు లగుశిలీముఖంబులు పుంఖానుపుంఖంబులు గా నిగుడ్చుచు నర్గళికమీఱ విడివడినదిగ్గజంబు

చండంబునఁ బెంపు దీపింప సాత్యకిప్రముఖయనుకుమారుల మిగుల నొప్పించి నేల కుం గోలకుం దెచ్చినఁ గని బలంబులు చెదరి బెదరి నలుగడలఁ బఱచుట యుంగనుంగొని యప్పుండరీకాక్షుండు మందస్మితంబు వదనారవిందంబునం గందళింపఁ బాంచజన్యం బు పూరించి యెల్లవారల నుల్లసితకుతూహలంబున మరలునట్లు గావింపుచు సారథి యగుదారుకుం గనుంగొని యిట్లనియె. ౧౨౧.

చ. అదె కనుఁగొంటె భోజతన ♦ యాగ్రజు తేరు సితాశ్వయుక్తమై విదితపతాకమై సమరి ♦ వీధి వెలిం గెడు వానిఁ దాఁకి దు ర్మదమడఁగింపఁగావలయు ♦ రథ్యములన్ వడి మీఱఁ బోవని మ్ముదితమదీయబాహు యుగ ♦ శౌర్యత వేల్పులు మెచ్చఁ జూడ పెదన్. ౧౨౨.

ఉ. ఈతఁడు నన్ను కించుకయు ♦ నెంచఁడు నిక్కము బంటు వో లేదు ర్నీతిపరుండు గాఁగ భగి ♦ నీహరణస్ఫుటరోషదారుణా న్వీతమనస్కుఁ డై మిగుల ♦ నిచ్చట వచ్చుచునున్నవాఁడు నా చేతుల లావుఁ జూడుము మిఁకఁ ♦ జిక్కులఁ బెట్టెద వీని దారుకా. ౧౨౩.

క. అనుటయు నుదారుకుండ, ట్లనతని రథము రయంబ ♦ లరభోజన్నపా లు నితని యెదుట నిలుపఁగ, వనజాతాక్షుండు నెట్టి ♦ వానెడు చూడ్కిన్. ౧౨౪.

గీ. రుక్మిఁ గనుఁగొని తనుకా ♦ ర్ముకమునంగు, తూపులొకనూఱు నిన్నూఱుఁ దొడిగి యేయ నావిదర్భేంద్రతనయుండు ♦ నన్నిశరము, లన్నిశరముల వారించి ♦ యాగ్రహమున.

క. మూఁడు శరమ్ములు కృష్ణుని, పోఁడిమి సెడనేసి కినుక ♦ పొంగఁగఁ గడిమిన్ వాఁడిబలు తూపులొక్కట, నేడింటను మతియు నేసె ♦ నీశులు మెచ్చన్. ౧౨౫.

గీ. అంతఁ బోక విదర్భభూ ♦ కాంతసుతుఁడు, మేటికరలాఘవంబున ♦ మెఱసి మిగుల చిత్రశరముల నాతనిఁ ♦ జిక్కుపఱచి, యనియె దరహాసభాసురా ♦ ననము తోడ. ౧౨౬.

సీ. గొల్లలు నీవు మెండంకొని ♦ కోడిగపున్ వగలు ల్లసిల్ల వే పల్లెల లోన వెన్నలును ♦ బాలును దొంగిలి తిన్నయట్లయో బల్లిదులైన రాసుతుల ♦ బల్మియెఱుంగక యిట్లు తెన్ని నా చెల్లెలిఁ గాసనేసి యివి ♦ నీయని వవ్వ రనిన్ను భూజనుల్. ౧౨౭.

చ. తెలియవు గాక రుక్మి సము ♦ దీర్ణ పరాక్రమ లీల నీవ కా దలహరుఁడైన నిల్వఁ గలఁ ♦ డాలికఁ టించి యిఁకేల కేల నో విలుధరియించి నిల్తువటు ♦ వేలుపు లెందఱు గూడి గ్గైకొ లలనఁ గ్రహించి పోవఁగఁ ద ♦ లంచెని జంబలశాలికేవియున్ ౧౨౮.



క. కురిసెంబువ్వులవానలు, నెరసెందివియెల్లఁదూర్య ♦ నిబిడస్వనముల్
దొరసెన్ వంది స్తవములు, విరిసెన్ మునిమానసార ♦ విందములంతన్. ౧౪౦.

గీ. ఇట్లుజయలక్ష్మిఁ గైకొని ♦ కృష్ణుఁడప్పు, డన్నబలరాముఁడెంతయు ♦ నాదరింప
సాత్యకిసమగ్రశక్తిమై ♦ సాఁగిమ్రొక్క, నలవుబలిమియుమెఱయసై ♦ న్యములుగొలువ

క. పూరించెఁ బాంచజన్యము, వైరించిన్మిగులఁదనిపి ♦ వైరముడిపియున్
భైరవభేరీరవములు, బోరుకలఁగఁదనదుసైన్య ♦ ములనడిపించెన్. ౧౪౨.

వ. అంతనక్కడ.

క. చాపునకుఁదప్పిమగుడం, జీవితులైనట్టిమగధ ♦ శిశుపాలన్నృపుల్
త్రోవజతఁగూడిచనిరిని, జావాసమ్ములకునాన ♦ నానతముఖులై. ౧౪౪.

క. అలరుక్మిరుక్మవసనుఁడు, తలయునుమూయియునుగోర్గి ♦ తనువిడుచుటకున్
విలపించుచునేవగను, న్గెలుతున్ శౌరిననియందె ♦ నెలకొనియుండెన్. ౧౪౫.

క. అర్ధనుజధమనుఁడంతట, నుద్ధవిడిన్ నడచినడచి ♦ యుత్సాహముతో
నద్ధింపుబిల్లకైవడిఁ, బొద్దొకబారెంటనున్న ♦ పోలికఁదోఁచన్. ౧౪౬.

మ. బలదేవున్ గవిమీరుసాత్యకినుతుం ♦ గస్తత్తమాతంగపు
ష్కలగంధర్వశతాంగవీరభటసం ♦ ఘాతంబుతో నొప్పనీ
విలసత్సైన్యముభక్తిమైఁగొలువఁగా ♦ విచ్చేసితద్ద్వారకా
నిలయంబెల్లనలంకరింపుఁడుశుభా ♦ న్వితక్రియాచాతురిన్. ౧౪౭.

క. ఈవేళకురైవతక, గ్రావంబుననిల్చి రేస ♦ కడనదుగెంతున్
నావినియట్లనకొకని, రేవతిరమణాంశుచనిపు ♦ రిన్ నివసించెన్. ౧౪౮.

క. అనుటయునభిమన్యుసుతుం, డనఘాత్మకభోజకన్య ♦ హరిపరిణయమై
తనిపినకథయాద్యంతము, వినవేడుకయయ్యెఁదెలుప ♦ వేయనియనుగన్. ౧౪౯.

శా. శ్రీవత్సాంకితవక్షయాదవప్రభీ ♦ సింహాసనాధ్యక్షల
క్ష్మీవరఫణ్ణికటాక్షరాజచరణం ♦ శ్రీరాతహార్యక్షనా
నానాచంయమిలక్ష్మభక్తజనతా ♦ నందక్రియాదక్షరా
జీవశ్రీకలితాక్షఘూరికరుణా ♦ సిక్తస్ఫురద్వీక్షణా. ౧౫౦.

క. కృష్ణావ్యసనవికర్శన, తృష్ణాసంతానదంశు ♦ రితవ్యాత్మమలా
కృష్ణాహిసమభుజాయుగ, కృష్ణావ్యాయమోచితప్ర ♦ కృష్ణాఘఘనా. ౧౫౧.

ఉసజాతి. దానవ్రపాలాగమనవిలోలా ♦ తతభుజకలితసుదర్శనలీలా
ఆనతకోలాహలపరశీలా ♦ యతపదకటకమహోదవఖేలా

భానుసమానాభరణవితానా ♦ పరమపదమథనప్రకటాద్యానా
దీననిధానాధికరుచినిచయా ♦ ధీనఖగేనాదివిజవిధానా. ౧౫౩.

గద్యము.

ఇది శ్రీమన్మదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణావాప్తచతురసాహితీవైభవ
చక్రపామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మా
ర్గణవిశ్రాణితమహాఫలకోవిదనుతభాగధేయ కోటీశ్వర
నామధేయ ప్రణీతం బైన భోజకన్యాపరిణయం
బను మహాప్రబంధంబునందు

చతుర్థాశ్వాసము.

# పంచమాశ్వాసము.



క. శ్రీవసుదేవమహాన్వయ, పావననిజచరణచిహ్న ♦ పరిశోభితబృం
దావనసఫలీకృతపద, సేవకకరుణావిశాల ♦ శ్రీగోపాలా. ౧.

వ. అవధరింపుము పరీక్షిన్నృపాలునకు శుకమహాయోగి యిట్లనియె. అట్లు గోపాల
దేవుండు కామపాలు వెంబడి నిజసైన్యంబుల ద్వారకాపురంబునకుఁ బనిచి తనుపాం
తంబునం దనరురైవతకధరాధరసమీపోద్యానానవద్యనిర్ఝరతటంబునం గనుపట్టు
పున్నాగకాననంబున నివసితస్కంధావారుం డగుచుఁ బచ్చనూరెపుడింపుఁబటకుటీ
రంబునఁ గతిపయపరిజనంబులు గొల్వఁ జైద్యమాగధభోజనందనులపరాభవంబును
దమవిజయంబులును బహుప్రకారంబుల యదుకుమారులు వేర్వేఱఁ గీర్తింప నిష్టా
లాపంబులఁ బ్రవర్తిల్లుచున్న సమయంబున. ౨.

చ. మనుజతనున్న తావకకు ♦ మారిమనోరథమెల్లసార్థమై
తనరెడునట్లు బాహుబల ♦ దర్పమెలర్పఁగఁ గంసవైరిదు
ర్జనులఁ దృణీకరించిన్నృప ♦ సంపదగా నొనరించెనంచుఁ దో
యనిధికిఁ దెల్పనో యనఁగ ♦ నబ్జహితుండు ప్రతీచికింజనెన్. ౩.

మ. స్వకవిద్యోతవసువ్రజంబడరస ♦ ర్వంబుల్ బరక్షోణిభృ
న్నికటోద్యత్కటకంబుఁ జెందియుఘనా ♦ నీకానురాగాదియై
సకలోర్వీజనసేవ్యుఁడయ్యెనినుఁడెం ♦ చన్ భూరితేజుండు శ
త్రుకులాంతస్థితుఁడయ్యుఁ బూజ్యుఁడె కదా ♦ రూపింప నెవ్వారికిన్. ౪.

చ. రమణుఁడపత్యరాప్తివన ♦ రాశినివేగము చెంద నేగు
సమముగ నేగలేక వెను ♦ చక్కినిఁ జిక్కుచుఁ జాయ, వచ్చుమా
ర్గమునకుఁ జుట్టిరానభిము ♦ ఖంబుగఁ బోయెదనన్న మాడ్కిఁ బ
శ్చిమదెసమానితూర్పునకుఁ ♦ జేరెనుదంచితదీర్ఘరూపతన్. ౫.

చ. అలవనమాలిరూపమున ♦ నంబుజమిత్రుఁడు తాను బశ్చిమా
చలమునవిల్వఁదత్కులము ♦ సొమ్ములు చాలఁదదీయభాగ్యపు
ష్కలతనుసంతసిల్లి పొడ ♦ గానఁగఁ దెచ్చినహాటకాంబర
మ్ములకరణిన్ నగాగ్రములఁ ♦ బొల్చె జరత్కిరణప్రకాండముల్. ౬.

మ. అతిసంధ్యారుణితాంబరోల్లసదుదా ♦ రాబ్ధీశదిక్కామినీ
గతుఁడై యేగెఁ ద్రయీతనుం డనిజప ♦ క్షస్థద్విజవ్రాతముల్
వెత చెందంగను దేజముం దొరఁగియు ♦ ద్వేలానుబంధంబుతో
డుతపాతిత్యము గాంచె సత్పథము పాం ♦ థుల్ మానియంతంతటన్. ౭.

మ. *అరి సేవ్యుం డగు ప్రాణభర్త సమయా ♦ యత్తుండు గాఁ గన్ బ్రకా
శరమల్ప్వెఁ బరవాహినీపతిభజిం ♦ చన్ జూచి పత్త్రస్రవ
ద్గురుమాధ్వీకరసాశ్రుపూరయగుచున్ ♦ దోడ్తో వికాసత్వమున్
దొరఁగెన్ బద్మిని సారశాస్యవిగళ ♦ ద్రోలంబనిశ్వాసయై. ౮.

గీ. కరములొకవేయు గలిగియు ♦ దరణి దైవ
వశత మున్నీటి మునిఁగిన ♦ వార్తవిని
వితతి దెలుపంగఁ బద్మినుల్ ♦ విని మొగమ్ము
ముడిచె నననీటఁ గలపద్మ ♦ ములు ముడింగె. ౯.

మ. కరుణన్ బ్రోచిన మిత్త్రుఁ డేగెనుగళం ♦ కంబూను చెల్లప్పుడున్
గురువిద్వేషినిశాచరుం డనుచులో ♦ కుల్ నిందగావించుని
ష్ఠురభావుం డిరు దేరఁ గీడ్పడుచునం ♦ చున్ విచ్చుమొగ్గ చనెన్
జరితార్థాత్మకశత్రవృత్తమగుచున్ ♦ జక్రద్విజవ్రాతముల్. ౧౦.

మ. సమయజ్ఞోత్తలభర్తపశ్చిమదిశా ♦ శైలేంద్రమన్ లోహనా
శమునాత్నంబుగ సంఘుటించి దృఢతన్ ♦ లక్షింపఁ బద్మాప్తబిం
బము పేరం దగు గుండుఁ బూన్చి నిగుడిం ♦ పం దన్మహోపాతసం
భ్రమభీతిం బలె జోడు వీడుచు నుజ ♦ క్రంబుల్ చనెన్ దిక్కులన్. ౧౧.

సీ. ఉదధిరాజన్యుని ♦ యొడ్డోలముగ నంచుఁ, బట్టిన దీపికా ♦ పాళియనఁగ
నంజనద్విపరదా ♦ గ్రాఘాతనిర్ధూత, పరమహీధరధాతు ♦ పటలమనఁగఁ
ద్వరనేగు రవిఁగూడి ♦ యరుగఁ జాలక వెన్క, నిలిచిన జరదంశు ♦ నికరమనఁగ
సమయనిదాఘుకా ♦ లమున నెక్కటిఁ దోఁచు, వనధనంజయమహా ♦ జ్వాలలనఁగ
మందమందేహదేహని ♦ ష్యందిబహుళ, వర్ధితోదారరుధిరస్ర ♦ వంతులనఁగ
నపరజలనిధిగర్భర ♦ త్నాంశుతతికి, దాయయో యనసంజకెం ♦ జాయదోఁచె. ౧౨.

* అరి=చక్రవాకము, శత్రువు.

చ. ఇనుఁడపరాద్రిఁ గానఁ జరి ♦ యించుచుఁ జీఁకటివేఁటలాడఁ గాఁ
జనుట యుఁదస్మహోగ్రహన ♦ చారిజనమ్ములు నూకరాదికా
ననమృగపాళికం గలఁప ♦ నల్గడలం దవిలించినట్టియ
య్యనలమనంగ సంజరుచి ♦ యద్దెసనుద్దవిడింగనంబడెన్. ౧౩

మ. దివసగ్రీష్మమరీంతనుర్దశ వెసం ♦ దీఁఱంగ రంగద్రథాం
గవిహంగాహ్వయహంసము ల్దెసలు ద్రావా ♦ కన్ బాంథహృత్పద్మముల్
దివులొందన్ వడిఁ గ్రీష్మమేఘతతిరీ ♦ తిన్ గాఢదీవ్యత్తమో
నివహంబొక్కటనాక్రమించెయమునా ♦ నిర్యత్ప్రభాధోరణిన్. ౧౪.

సీ. ప్రకటీకృతగుహాంత ♦ రంగికత్వంబయ్యు, నుపచితభ్రములుతార ♦ కోద్యమంబు
దూరితళమనివి ♦ హోరాతిశయమయ్యు, గర్వభ్రమదులూక ♦ కలకలంబు
వినిహితప్రజ్ఞాన ♦ యనభోజనమ్మయ్యు, జహదబ్జబాంధవ ♦ జాతవృత్త
మాపాదితశ్యామ ♦ లానుభావంబయ్యుఁ, బరిభూతమాతంగ ♦ వైభవంబు
నగుచుఁ గనుపట్టె వెసనంజ ♦ నాభ్రవిభ్ర, మభ్రమరవారసారస ♦ మగ్రజాగ్ర
దక్షసారమసారవి ♦ హారహారి, భూరిసంతమసప్రభా ♦ భూతమహిమ. ౧౫.

మ. మొనసెన్ లోకములోన నెల్లెడల సం ♦ పూర్ణంబుగా నంగజా
తుని తేజోమయవహ్నియస్మతికిగు ♦ ద్ధుల్గానిరుల్ ధూమమై
యునికిం జెందెనుగాక తక్కిననుయో ♦ యోధూమవాన్ సోగ్నిమా
ననుతర్కానుగతోక్తిసద్విబుధలో ♦ కారాధ్యమైయొప్పనే. ౧౬.

చ. వనజదళేక్షణుండగుచు ♦ వర్తిలుభానుఁడు యోగనిద్రకై
వనధిఁ జొరంగ ముక్ గుహాల ♦ వారనిశీథనడంగియున్నయ
ద్దనుజకులమ్ము నల్గడల ♦ దర్పవిలాసములుప్పొల్లఁబై
కొనియెననంగఁ గప్పడిరియె ♦ ఘోరతమోవిభవంబ పారమై. ౧౭.

గీ. యమునజాహ్నవిమీఁదిరో ♦ సమునగిడి
మించిముల్లోకములనాక్ర ♦ మింతుననుచుఁ
బెరిఁగెనోయనదట్టమై ♦ యిరులుగవిసె
మెండుకొనియుండుకౌటుక ♦ కొండయనఁగ. ౧౮.

సీ. రేరాయనికిఁ బొక్కు ♦ తారావఘామణి, కటిచాయనునుబట్టు ♦ గాధరింప
చేయుకన్నులవాని ♦ దాయ నెంచునహాల్య, నీలాలసరులంచు ♦ బాళిఁదాల్ప

దహనునాత్మఁదలంచు ♦ తపసిరాయిల్లాంద్రము, కప్పుకుప్పసములు ♦ గాఘటింప
శివునిమరులొక్కన్న ♦ వివిధతాపసకాంత,లిందీవరములుగా ♦ నెంచిముదుప
నిగిడెజగములఁగలకంఠ ♦ నీలకంఠ,కంఠకాదంబకరదంభ ♦ ఖంజనాభ
కజ్జలద్యుతిహారినీల ♦ ఘనతమాల,ఘోరరుచిపూరమగుచంధ ♦ కారమపుడు. ౧౯

చ. సమయమహావణిగ్వరుఁడు ♦ సాంద్రమయూఖగుణప్రసక్తిచే
నమరినమండలాఖ్యమగు ♦ నట్టికటాహమునన్ ఘటించియ
క్కమలహితున్ వరార్ణవము ♦ ఖంచెనడించమునింగియాతఁడో
క్కమొగివెలార్చుముత్తెముల ♦ కైవడిఁదారలెసంగెబోరునన్. ౨౦

క. రవిమండలగండోపల,మ్మవలన్ జరమాద్రినుండి ♦ నంబుధిఁద్రెళ్లన్
గవనెగసినజలకణముల,హావణునఁదారకలుమింట ♦ నంతటఁదోఁచెన్. ౨౧

మహాస్రగ్ధర.

కువలాధీశత్రియామల్ ♦ కుతుకపరిణతిన్ ♦ గూడుపెండ్లిన్ దిశాళుల్
రవితేజస్తప్తనక్ష ♦ త్రపథకగగన ♦ భ్రాష్ట్రిమందుంచివేఁచన్
యువతీమానాఖ్యధాన్యం ♦ బుఱకపెటులో ♦ నుద్భవల్లాజలోనా
దివిఁదారాస్తోమమొప్పెన్ ♦ ధృఢనిజమహిమన్ ♦ ధిక్కృతాధ్వన్యమోచున్.

సీ. సంధ్యాభుజంగికా ♦ సంజనితాండముల్, తారాధ్వపున్నాగ ♦ కోరకములు
పద్మాప్తహాయముఖో ♦ త్పతితడిండీరముల్ ♦ ‡ దిష్టశగత్సమా ♦ కృష్టహంస
లధివిష్ణుపదసము ♦ ద్యత్పునర్భవములు, రాజాగమవికీర్ణ ♦ లాజచయము
లభ్రమహార్ణవో ♦ ద్యద్బుద్బుదమ్ములు, రవికరతప్తాంబ ♦ రశ్రమాంబు
లధికనృత్యద్గిరీశోత్త ♦ మాంగవిభ్ర,మద్దివిజలోకవాహినీ ♦ మహానుదగ్ర
వీచికాన్యోన్యఘట్టనా ♦ విదళితాభ్ర,శఃపతచ్ఛీకరములొప్పెఁ ♦ దారకములు. ౨౩.

ఉ. ఉరవడినొక్కమొత్తముగ ♦ నుర్వియునాకసమావరించిభా
స్కరుఁడపరాబ్ధిఁద్రెళ్లునెడఁ ♦ గ్రక్కునఁదోఁచిమహాంధకారమ
త్తరణిమయూఖసంతతుల ♦ ద్రొళ్లనుద్రేలఁగఁగట్టినట్లమం
దిరములకజ్జలాంకనవ ♦ దీపకలాపములొప్పెనయ్యెడన్. ౨౪.

మ. సమదాహంకృతినున్న సంతమసవ ♦ ర్షాకాలమున్ బోవవి
క్రమలీలన్ గుముదాంబుజన్ములలరం ♦ గాఁగాశసంఘప్రసూ

---

‡ దిష్టము = కాలము.

నము లైచుక్కలు పర్వఁ జూచితనయం ♦ తం జేరుహంసాళి వా
నము రెక్కదూర్పనఁ దెల్పుప్రాక్కపటకాం ♦ తామందహాసంబనన్. ౨౫.

శా. జీవంజీవకులాన్నరాశిరజనీ ♦ శీతప్రభోద్వాహవే
శావేల్లత్ప్రతిశీరసంతమసవ ♦ ర్షాపశ్చిమద్యోతక
ప్రాచీణ్యోదయసప్తపర్ణసుమనః ♦ పాంసూత్కరంబో యనన్
భావింపందగె శుభ్రదీధితిసుప ♦ ర్వశ్రేష్ఠదిగ్వీధికన్. ౨౬.

క. ఆకాశసింధుమధ్యత్, లాకల్పితచంద్రమణ్డ ♦ లాభిధవిలస
ద్వ్యాకోచపుండరీక, వ్యాకీర్ణపరాగములన ♦ నలరెను దీప్తుల్. ౨౭.

వ. వెండియు నప్పండువెన్నెలలు పథికజనదండనమ్మునకు దండువెడలెడు పుండరీక కోదండుని యఖండితజయసమృద్ధిం గోరి యతని యండ జగమున నిండుకొనుకుతూహలంబున నిండారం జల్లెడు బొండుమల్లియల తండంబు లనియెడు సేసవెల్లువల తోడి హల్లీసకవిలాసమ్ముల నుల్లసిల్లుచు దివసనమయంబున క్షుత్పిపాసల వలన నగునాయాసంబు సైరించి కించిన్నిమీలితమ్ము లగునయనంబులతోడఁ బరితాప దుస్సహమహాగహనదహనమధ్యంబున సకుటుంబంబుగఁ దపంబు నవరించుచున్న తమకు దైవవశంబునం దపఃఫలంబుచందంబునం బొడకట్టిన బృందారకబృందకీర సందోహబింబం బగు నిందుబింబంబు లోచనానందంబు సంధిల్ల నాలోకించి బందుగులకెల్ల విందు సేయం బూని సితకైరవపరాగశర్కరాసారంబును నాలబ్ధముగ్ధ హిమకరపరిణతకిరణదుగ్ధంబును నాముక్తనక్తంకరశిలాప్రసవదచ్ఛసలిలంబునుంగా నామెతకుఁ జేరిన యనుంగులుం దాము బంతులు దీరి క్రొత్తవెన్నెలలఁ గుత్తుకల బంటిగా మెక్కి తమతమ చక్కెరబొమ్మలం గలసి ముక్కుముక్కునం గదియ నొక్కుచు నెక్కుటెక్కులం గదియ నక్కునం జేర్చి మిక్కుటం బగుతమిం జొక్కుచుఁ గడుపు నిండినం ద్రోచుటకునుంబలె మెడలు నిక్కించి యెల్లదిక్కులం గనుంగొను మదచకోరవారంబుల తోరంబు లగునానందరసపూరంబులం గలసి యినుమడించెనో యనం గులకించుచు నంబురుహామిత్రుం డస్తశిఖరిశిరంబున కరిగినది మొదలు నాత్మవల్లభులం బాసి యాయల్లకొలి రేకంబునం బొరలు జక్కవ జవ్వనులమిక్కుటం బగు నెవ్వగలం గనుంగొనం జాలక పరితపించుచుఁ గమలాకరాధిదేవత కన్నుమొగిడ్చెనో యన ముడింగెడు నెత్తమ్ములం దొరంగి యంగజ బిరుదకాహాళస్వనంబులం బోని నిజస్వనంబు లనియెడు మేలుకొలుపుపతమ్ముల మేలుకొను నిందీవరంబుల కరిగి యందునవలుగడలం జిందుమకరందబిందువుల

సందడిం గ్రంసుకొనునిందిందిరమ్ముల నసితోత్పలంబులం దీర్చిన యచ్చనగండులని పట్టి యాడం బోయి యవియునుం దవుల కవలఁ జనం జూచి నవ్వెడు కామినుల హాసంబుల కనుప్రాసం బై ప్రాణవల్లభులతోడ నపరంజిగిన్నియల నించినమధుర మధురసంబులు మఱియుమఱియును బర్వంబునం ద్రావు పువ్వుఁబోణుల తార ప్రహారభాపూరంబులచే రాజిల్లుచుఁ బ్రసవచాపప్రతాప దావానలంబున రజతా చలంబును నీరుగాఁగఱంగిన సరసిజభవాండకుహరంబున వెల్లివిరిసెనోయన భువన త్రయంబును నాక్రమించిన పంచబాణజనకుని పాదారవిందంబునంబొడమిన కారణ గుణంబున భాగీరథీదేవి తానును లోకత్రయంబు నెల్లెడ నావరించం గడంగెనో యన విష్ణుపదంబగు వియత్పదంబునకుంగలవి స్తీర్ణత్వంబు తనకులేకుంట కారణం బేమియని విష్ణుపదంబు యగుకలశవారాశి వలన నంతయుం బెరిఁగివచ్చెనోయనం జూపట్టె. అట్టియెడ యదువీరుండు పటకుటీరాంతరంబుననుండి యక్కుండినపు రాధిపతికూఁతుం దలంచి మదనమాధవ మలయమారుత మధుకరనికర మత్తపర భృత మరాళప్రముఖంబులగు మానసోద్దీపకంబులకు మఱియు మఱియునుం దల్ల డిల్లుచు హల్లకరచితసమల్లసితపర్యంకభాగంబున మేను చేర్చి విరహతాపంబునం బొరలుచుం దనమనంబున. ౨౭.

శా. ఆమోమాతలిరాకనందగినకే ♦ లాచిన్ని చెక్కిళ్లడా
లా ముద్దుల్ వెదచల్లు మోవిజిగియా ♦ యందంపుఁగన్దోయితీ
రామాయంపు మెఱుంగుఁ గౌనుభళిరా ♦ యజ్ఞాత్మలందెందులే
దేమోమన్మథుఁడిట్టివస్తువునుదా ♦ సృష్టించెబల్ నేర్పునన్. ౨౯.

క. అనుచుంబలువిధములన, వ్వనజేక్షణఁదలఁచితలఁచి ♦ వసరుచురాఁడో
యినుఁడుదయశిఖరికనుచున్, ననుచుందమితోడవృష్ణి ♦ నాథుండుండన్. ౩౦.

గీ. ఉడుపథంబునుకడలిసె ♦ ల్లెడలఁబరఁగు, ఫేననికరంబుతత్ప్రహ ♦ యానిలంబు
కడఁగియొకమూలఁద్రోచెనాఁ ♦ గనఁగనయ్యె, నస్తగిరిఁదేజమెడలియ ♦ య్యమృతకరుఁడు.

మ. మదభృత్కోకిలకాకలీనినదశుం ♦ భజ్జన్యసంరంభపూ
ర్వదశాసూచకకాహళోగ్రరవమై ♦ వర్తిల్లు సైన్యంబుతో
నదయుండైమరుఁడాప్రభాతమునుబొం ♦ ధానీకము న్నొంచిసెం
చిదయన్ధర్మపువారవట్టెననమ్రో ♦ సెన్దాగ్రమచూడఘుముల్. ౩౨.

మ. అరవిందాప్తుఁడుపశ్చిమాచలతటిం ♦ బ్రాపించునవ్వేళనా
త్మరుచుల్ పావకునంముఁదాఁచుటమదిం ♦ దర్కించిచంద్రుండునా

త్తరుచుల్ పావకనందుఁడాఁచె నెయినన్ ♦ దర్శింపఁగా నయ్యెమం
దిరదీపంబులు పాండురప్రకటదీ ♦ ప్తప్రక్రియాధుర్యతన్. ౩౩.

చ. కరములు చల్లఁజేసిజన ♦ కౌండములన్ గుముదాప్తిఁ గూడఁగా
నరసినరాజునిట్టులప ♦ రాగతఖేదము చెందవచ్చునా
ఖరకరుఁడాత్తనీనవసు ♦ ఘాతకుడన్ భయమక్త్రైలోపలన్
జెరసియదృశ్యులైరటుగ ♦ ణింపఁగనయ్యెడుచక్రసైనికుల్. ౩౪.

ఉ. మేలుగఁబత్త్రినీస్థలిని ♦ మిక్కుటమౌతమినుండినాథుఁడౌ
హేళివివృద్ధరశ్మలర ♦ హింజను దేరఁదదీయవర్ణకో
ద్వేలరుచుల్ నిజాంగమున ♦ వింతయికన్పడుచుండపల్వడెన్
లోలగరున్నవాంశుకము ♦ నోహరమైభ్రమరంబుగ్రక్కునన్. ౩౫.

శా. కౌలంబోనిజధామమిత్రతతపో ♦ కంగుందు రేరాజు పెం
పాలంబొందకభీమలక్షణగదా ♦ వాప్తిన్ గళత్ప్రాగఁడై
దీలంఖస్థలిద్రాలఁజూచిప్రమదో ♦ దీర్ణాస్యతన్ భాస్కర
శ్రీతెల్లన్ విలసిల్లెలోకమునసం ♦ జీభూతదిక్చక్రమై. ౩౬.

ఉ. మీఱుపరాశఁజెందితన ♦ మీఁదిరుచిన్ విడనాడిపోవఁగాఁ
గైరవిణీవధూటిపత్తిఁ ♦ గన్గొనరోసిగళాంతనిర్గళ
ద్భూరిహిమాంబునేత్రజల ♦ పూరముపత్త్రగణంబులందువే
మాఱునుజింనువందవుచు ♦ మానకరాకమొగిడ్చెఁగన్నులన్. ౩౭.

సీ. ఉదయసౌధముచేరు ♦ నుగ్రభానునిమ్రోల, వఱలు చెంగావిపా ♦ వడలనంగఁ
బఱరామికెదభీతి ♦ పరఁగమేలుకొని యున్న, శచిదృగంచలఘున ♦ చ్ఛాయయనంగ
నినురాకవినినంత ♦ నెను రేగునలరఖాం, గములమనోద్ధరా ♦ గంబనంగఁ
బ్రాబ్జ్నగవాళిక ♦ ప్రవసుండుదాల్చిన, సరిగంచుతోపుప ♦ చ్చడమనంగ
వైజయంతమహాహర్మ్య ♦ వర్ణనీయ, తప్తహాటకమయకుంభ ♦ ధామమనఁగ
నడరెనంతంతఁదోలుచక్కి ♦ నాక్రమించి, పూరితజగజ్జనావంధ్య ♦ పూర్వసంధ్య.

సీ. చక్రపాలనవృత్తి ♦ సవురుగాంచినమేటి, తమ్ములకెల్లమో ♦ దంబువాఁడు
గతవసువులుమగ్లఁ ♦ గనినట్టిగుణశాలి, కర్తకోటులనెల్లఁ ♦ గనినవాఁడు
దోషోన్నతినిబాయఁ ♦ ద్రోచినతేజస్వి, యామ్నాయపూర్ణదే ♦ హంబువాఁడు
తన్నుఁజెందినరాజుఁ ♦ దన్నుపూర్ణగుణుండు, జడగతినిరసించు ♦ కడిమివాఁడు

దనరెంబూర్వధరాధినా ♦ థప్రశస్త, సేవ్యమానసింహాసన ♦ శిఖరమందు
మహితధాత్రీసురాఘన♦మత్ప్రసక్తి,ఖండితాత్మీయదుర్వ్యాద ♦ కొండుఁడగుచు.

వ. ఇత్తెఱంగునఁ బ్రభాతసమయంబగుటయు న య్యదుకులాధ్యక్షుండు తుంబురునారద ప్రముఖు లగుదివ్యగాయకులు ప్రాభాతికగానసంపద మేలుకొలుపులు వినిపింప నిసుర మేలుకని సుఖశయనంబు నుడుగునుద్ధవాదుల నాదరావలోకనంబుల నాదరింపుచుఁ గాల్యకరణీయంబులు దీర్చి వివిధమణిగణనస్యూతవిచిత్రతరసభాభవనసదృశంబుగా సంఘటించినపటకుటీరసభాంగణంబునఁ దద్దయునమర్చిన యుదిరకెంబట్టుగద్దియ నధివసించి బిరుదపదకట్టకచటులరుచిపుంజరంజితచరణకంజాతయుగళుండును హిమసలిలసేకసమ్మిళితగంధసారకస్తూరికావిరచితనిజాంగరాగతరంగితసౌరభాభోగసంవాసితనూనభోంతరుండును హారకేయూరకంకణాంగుళీయకమకరకుండలకిరీటాదిదివ్యభూషణభూషితుండును హిమసలిలసేకసమ్మిళితగంధసారకస్తూరికాది నిఖిలజనమనోహరమాల్యకనకవసనాలంకృతుండును నగుచు మంత్రిజనబుధకవీంద్రవైణికవారకాంతామణులు సముచితప్రకారంబునం గొలువ నిలువుటద్దంబున నిజరూపసౌష్ఠవంబాలోకించి యంగవంగన్యపాలపుంగవుల కుమారులు వింజామరలును మాళవుండు తాళవృంతంబును గుకురునరపతి ముకురంబును గాశ్మీరుండు కాళాంజియును గళింగుం డడపంబును సౌరాష్ట్రమండలాధిపతి గిండియును బూని తమతమ యవసరంబు లెఱింగి తరంగితభక్తిం గొలువ వేత్రధరసహస్రసాహోనినాదంబుల మేదిని యదర ధరగహ్వరంబులం బ్రతిధ్వానంబులు నిగుడ బహువిధోపాయనపురస్సరాయాతనూతనభూతలాధీశ్వరప్రణామంబులు కటాక్షవీక్షణంబుల నంగీకరించుచు సుదంచితవైభవంబుననుండి సైన్యసుగ్రీవమేఘపుష్పవలాహకతురంగమసంగతంబును గింకిణీశతసంకులంబును నవర్ఘ్యమణివిభూషితస్తంభసంభృతవైనతేయచిత్రకేతనవిభూషితంబును నగుశతాంగంబు నధిరోహించి ద్వారకానగరంబున కరుగందలంచి కదలి రైవతగిరిసమీపంబు చేరి తదీయశిఖరసౌభాగ్యంబులు కనుంగొన నవధరించుసమయంబున. ౮౦.

కం. దారకుఁడపుడిట్లనియెన్, శౌరికి రైవతకశిఖర ♦ సాలవిశాల
శ్రీరుచిరతావలోకన, హారికిమృదుమధురసముచి ♦ తాలాపములన్. ౮౧.

సీ. శిఖరసంశ్రయణవి ♦ స్ఫురితదిత్యపత్యరా,డత్యాహితాదిత్య ♦ పత్యనీక
మవిరళకటకఘా ♦ సవిలోలగవిరథ్య,దీర్ఘీకృతతుషార ♦ దివసచయము

సానుపతజ్ఝరీ ♦ జలకణవ్యాక్లిప్త, ఋక్షసమ్మిళితాంత ♦ రిక్షపదము
నైకగైరికవిభా ♦ నవకోరకచ్ఛటా, సురుచిరకింశుకా ♦ శోకభూజ
మిందెకనుఁగొంటెకిన్నరీ ♦ మృదులగాన, తానమానవితానైక ♦ తానభుజగ
రాజఫణరత్నసతతనీ ♦ రాజనోప, చారశుభహారియానగ ♦ స్వామిశౌరి. ౪౨.

ఉ. కంజభవాదిదేవతలుఁ ♦ గాననిదేవరరాకకెంతయుఙ్
రంజిలియాధరాధరము ♦ గ్రక్కునఁబూవులదోయిలిచ్చెనా
మంజుగతిం జెలంగెడుస ♦ మగ్రనితంబతటీగళద్ఝురీ
సంజనితాంబులేశవిల ♦ సన్నవమౌక్తికపాళి నెల్లెడన్. ౪౩.

ఉ. ఎన్నఁగరోహణాచలమె ♦ హేమనగేంద్రమురూప్యభూధరం
బున్నిజసంపదన్ సకల ♦ ముత్తమవస్తుము దెచ్చియీగిరిం
బన్నుటఁజేసియోయనఁగ ♦ భాసురరత్నసువర్ణరూప్యమై
మిన్నులుముట్టుచున్నయది ♦ మించినవేడ్కఁగనుంగొనందగున్. ౪౪.

సీ. కమలాకరానేక ♦ విమలాంబుజానీక, కమలావిభూషితా ♦ గ్రస్థలంబు
మలయానిలస్ఫుర ♦ ద్వలయావృతనికుంజ, నిలయామరీగాన ♦ నిబిడతరము
మణిలసన్మేఖలా ♦ ఘృణిగణభూతత, రణికిరణోచ్ఛటా ♦ రంజితంబు
కేసరాళిపరాగ ♦ ధూసరాళినినాద, మాసరాక్రీడస ♦ మంచితంబు
కిసలవిసరఫలాస్వాద ♦ మసృణనివద, పికశుకవ్రాతసంతత ♦ భీతపథిక
నిబిడసహకారతతివాస ♦ నిత్యసుఖిత, గరుడగంధర్వయక్షమి ♦ గిరివరంబు. ౪౫.

సీ. శిఖరచరత్సుర ♦ స్త్రీదర్పణీభూత, మసృణపార్వకచంద్ర ♦ మండలంబు
సంతతాకృష్టకీ ♦ చకికాగ్రవిచ్ఛిన్న, కరకాద్విరుక్తన ♦ క్షత్రకంబు
కనకవప్రాంభోజ ♦ గర్భసంవ్యానిత, నిర్మలమందాకి ♦ నీఝరంబు
బాహుప్రతాపప్ర ♦ భావవిభ్రాజిత, వీతగైరికరజో ♦ విస్తృతంబు
వకుళవన్యాసముల్లస ♦ త్సకుళగంధ, లోలవాచాలమధుకరీ ♦ జాలనినద
సంతతాకృష్టనంతాన ♦ సతతసక్త, మధుపనికరంబుకంటెయి ♦ మ్మహీధరంబు.

క. అనిదారుకుండుతనతో, వినుతోక్తులఁదెలుపవృష్ణి ♦ వీరుఁడుమిగుల
న్మనమునననలరుచునగ్గిరిఁ, గనుఁగొనుచుంజనియెనుచిత ♦ గతులంబురికిన్. ౪౬.

ఉ. పౌరులతోడవేడ్కబల ♦ భద్రుఁడుసాత్యకితన్నెదురొగ్రనన్
భేరులుఁదూర్యముల్మ్రోయ ♦ బృంహితహేషితసింహనాదముల్
భోరుగజంగుచుండయదు ♦ పుంగవుఁడప్పురిరాజవీధులన్

జారవిలాసినులన్౽గ ♦ వచ్చెవియచ్చరలిచ్చ మెచ్చఁగన్. ౪౮.

క. ఈరీతివచ్చిశౌరిహ, జారమ్మునరిలిచియనిచి ♦ జనపతులనిజా
గారములకుబహుకక్ష్య, పారంపరిఁగడచిచేరి ♦ బంగరు మేడన్. ౪౯.

క. మన్ననవలశెడియుడిగఁపుఁ, గన్నెలునీరాజనములు ♦ కడుభక్తిస్సొసం
గన్నలినాక్షుఁడుగ్గైకొని, యున్నతసౌఖ్యమునవలరు ♦ చుండెడినంతన్. ౫౦.

గీ. అపుడుబలభద్రునావతి ♦ నిపుణులైన, దండనాథులుగుమిగూడి ♦ తగువితానఁ
బురముకైసేయఁబనిచినఁ ♦ బరిజనములు, మహితశోభనవస్తుసా ♦ మగ్రిమెఱయ.

సీ. మేరువుల్ ఘటియించి ♦ రారూఢసురవర, ప్రతిమావిశేషసం ♦ పదలతోడఁ
గ్రముకముల్ నాటించి ♦ రమితఫలావళి, భరనమత్కదళికా ♦ తరులతోడఁ
గట్టిరితోరణాల్ ♦ కమనీయసహకార, పల్లవచామర ♦ ప్రతతితోడఁ
బరిమళంబులునించి ♦ రురుతరాగరుధూప, హిమసలిలావసే ♦ కములతోడ
హరువుపఱచిరిపందిరుల్ ♦ గురువిచిత్ర, సముధికౌంశుకకాయమా ♦ నములతోడ
నలవఱచిరెందుఁబచ్చల ♦ యరుగులందు, రంగవల్లులునవరత్న ♦ రాజితోడ. ౫౧.

చ. రహిఁదనరెక్కోత్తువింతయప ♦ రంజిసురంజాలనాడుమాత్రపుర్
బహుతరచిత్రభామినుల ♦ పైసురవర్యులుచల్లినట్టిస
న్మహితసురేంద్రభూరుహాసు ♦ మప్రకరమ్ములమాడ్కిఁగౌతుకా
వహమగుచుంజెలంగెఁబురి ♦ వాడలముత్తెపుమ్రుగ్గులెల్లెడన్. ౫౩.

సీ. కలయనెల్లెడఁజల్లు ♦ తెలితేటపన్నీటి, కాల్వలఁదగజల ♦ కంబులాడి
చకచకత్కనకవ ♦ స్త్రచ్ఛటాచరణంబు, చందనకాశ్మీర ♦ చర్చగాంచి
వివిధప్రసూనమా ♦ ల్యవితానమునమించి, వరధూపవాసనఁ ♦ బరిఢవిల్లి
సముచితాలంకార ♦ సరణిచేఁదనరారి, తౌర్యత్రికస్ఫూర్తి ♦ దగవహించి
యపుడునగరాధిదేవత ♦ హరివివాహ, శోభనారంభసముచిత ♦ వైభవమున
బహుపురంధ్రజనమ్ముల ♦ పగిదిఁదాను, నమితశృంగారవిస్ఫూర్తి ♦ నతిశయిల్లె. ౫౪.

సీ. ఏచాయఁజూచిన ♦ మోచామహీరుహా, పూగామ్రతరసాల ♦ పూర్ణగృహము
లేవంకఁజూచిన ♦ నిందీవరేక్షణా, నుత్కణాచరితగీ ♦ తక్షణంబు
లేకోటఁజూచిన ♦ వాచాటమధుకరీ, వారభృత్సుమదామ ♦ వైభవంబు
లేవీధిఁజూచిన ♦ హితసమీప్సితవాద్య, హృద్యతాండవితబ ♦ ర్హిణగణంబు
లెచటఁజూచినబహురత్న ♦ ఖచితరచిత, చిత్రనవభిత్తికావేది ♦ చిత్రతంబు
నగుచునలగోపురంబుతా ♦ నగుచుశ్రీకిఁ, గాపురంబయ్యెనలద్వార ♦ కాపురంబు.

వ. అట్టిసమయంబున విదర్భదేశాధీశ్వరుం డగు భోజనరపాలుండు కృష్ణుండు స్వయంవరోత్సవసమయంబున రాక్షసవివాహంబున శిశుపాలప్రముఖు లగునృపాలురం బరిభవంబు నొందించి తనతనూభవ నపహరించుటయు నది సహింపక నిజతనూజుం డగురుక్మి యెదిరి కదనంబునఁ బరాజితుం డగుటయును సప్రకారంబుగాఁ దెలిసి తత్క్షణంబునఁ బత్నీపరిజనసమేతంబుగాఁ గదలి ద్వారకానగరసమీపంబునకు వచ్చి తనరాక వసుదేవబలదేవుల కెఱుంగఁ జెప్పి పంచిన వారును దదాగమనంబునకు నెంతేని సంతసిల్లుచుఁ గృష్ణసమేతులై యతని నెదురుకొని తగువిధంబునఁ బూజించి పురంబునకుం దోడి తెచ్చి యుచ్చతరహర్మ్యశోభితంబును నుచ్చావచసువర్ణవితానమాననీయంబును నుపమానరహితసమస్తవస్తుసమన్వితంబును నగునొక్క భవనరాజంబున విడియించి నాటి రేయి వివాహముహూర్తంబనియును నేం దెలిపి రుక్మిణీదేవిని దదావాసంబునఁ గనిచి పరిణయాలంకృతం జేయింపుఁడన్ని స్వకీయకార్యంబులు నిర్వహించుచుండి రంత. ౫౬.

క. ఇభరాజవరదు పెండ్లికి, రభసంబున మీర లిపుడు ♦ రావలె ననుచున్
శుభపత్రికలంపించిరి, బుభువిభులకుఁ బుడమిగలధ ♦ రిత్రీశులకున్. ౫౭.

సీ. వచ్చిరి హరిదధీ ♦ శ్వరు లెల్లఁ బదినూరు, కన్నులమన్నీఁడు ♦ మున్నుగాఁగఁ
జనుదెంచి రవనిభృ ♦ త్స్వాములు పదియూరు, వన్నెగుబ్బలిరాజు ♦ మున్నుగాఁగఁ
బొడసూపిరి భుజంగ ♦ పుంగవుల్ రహిమించు, వెన్నునిబలు సెజ్జ ♦ మున్నుగాఁగఁ
గనుపట్టి రప్సరో ♦ వనితలు కరివేల్పు, గన్నయన్నులమిన్న ♦ మున్నుగాఁగఁ
దోఁచి రప్పుడు సప్తర్షి ♦ తుల్ మరీచి, మునికులధురంధరుండటు ♦ మున్నుగాఁగ
భువనకమనీయపరిణయో ♦ త్సవవిభాస్వ, దంబురుహనాభిసందర్శ ♦ నార్థులగుచు.

క. చనుదెంచిరి నలుదిక్కుల, జనపాలకులపుడు తురగ ♦ సామజరథకాం
చనవసనరత్ననివహం, బునుగానికగాఁగఁ గొనుచు ♦ మురహరుపురికిన్. ౫౯.

గీ. యాదవేంద్రపురోహితుఁ ♦ డైనగర్గ, మునివరుఁడు గీష్పతియుఁ దానును ♦ ముదమునదన
దేవతాధీశబలవసు ♦ దేవముఖ్యు, లైన పెద్దలయనుమతి ♦ నప్పుడు కాంక్షి. ౬౦.

క. హరికిన్ విదర్భజాతో, దరికిం గల్యాణసముచి ♦ తశ్రీలనలం
కరణములు సేయ వేలుపుఁ, దరుణులనైదువులఁ బనిచె ♦ తగుశుభవేళన్. ౬౧.

చ. సురవరదత్తమండనవి ♦ శోభితుఁడై హరియుల్లురుక్మిణీ
పరిణయకాంక్షనుండుటయు ♦ భామఁ దుగణ్ణోనితానునల్లు

హారికినవర్షురత్నముల ♦ నర్పణసేయఁదలంచియోయనఁ
బరువడిఁబశ్చిమాంబునిధి ♦ పారమునన్ నిలిచెన్ ద్వరాధ్యతన్. ౬౨.

ఉ. ద్వారవతీమహోత్సవవి ♦ ధానవిజృంభితదివ్యచందన
శ్రీరుచిరోరుధూపములు ♦ రిక్కలజాడలనెల్లదిక్కుల
న్దోరముగైకనంబడియె ♦ నోయననెక్కటనాక్రమించెమా
యూరశిరోధినీలరుచి ♦ నుర్విఁబునింగియునంధకారముల్ ౬౩.

ఉ. అప్పురుషోత్తముండుప్రమ ♦ దాతిశయంబునఁబెండ్లియాడునీ
యొప్పిదముంగనుంగొనఁగ ♦ నూర్జితవైభవలీలవచ్చిన
మ్మప్పదిమ్మూఁడుకోట్లసురు ♦ ముఖ్యులముంగలిదివ్వటీలనఁ
జొప్పడెఁజుక్కపుఞ్జములఁ ♦ జుక్కలుదిక్కులజాడలేర్పడన్. ౬౪.

క. తోఁచెనలచంద్రబింబము, ప్రాచిన్ సురగజమునెక్కి ♦ పద్మాక్షుఁడురా
నౌచితిఁబట్టఁగఁదెచ్చిన, భూచక్రపుగొడుగనంగఁ ♦ బూర్ణద్యుతులన్. ౬౫.

గీ. అఖిలభువనాధిపతియైన ♦ యబ్జనయను, పరిణయార్థమ్ముగవిరించి ♦ పద్మజాండ
మునసుధాలేపమొనరించె♦ననఁగఁదనరెఁ, బండువెన్నెలకన్నుల♦పండువగుచు.

గీ. అపుడువసుదేవబలదేవు ♦ లాదిగానైన, యాదవేంద్రులువృష్ణ్యంధ ♦ కాదులైన
బంధుజనములుఁగూడితే ♦ త్పద్మనయనుఁ, జేరిశుభలగ్నమెదిరికాం♦క్షింపుచుండె.

శా. చేరెన్ లగ్నమటంచుగర్గమునిసూ ♦ చింపంగఁదానున్ సునా
సీరుండట్లనహెచ్చరింపనపుడా ♦ శ్రీకృష్ణుఁడైరావత
స్ఫారోన్నద్ధతలాధరూఢుఁడగుచున్ ♦ బంధుప్రియంభావుకో
దారశ్రీవిభవంబునన్ వెడలెభో ♦ జావాసమున్ జేరఁగన్. ౬౬.

వ. ఇవ్విధంబున నవ్వసుదేవనందనుండు విబుధవరవేదండాధిరూఢుం డగుచు నిజమహస్సమూహధవళితం బగుపూర్వనగశృంగభాగంబునం బొదలుకుముదవనబాంధవునిచందంబున విమలతరపృథులముక్తాఫలలలితధవళాతపత్రసహస్రంబు లనియెడుతారకానిలయంబులనడుమ విలసిల్లుచు నుచ్చైశ్శ్రవంబు నెక్కి యగ్రప్రదేశంబున వివిధరత్నవిచిత్రితం బగువేత్రంబు కేలం బూని సందడి దొలంగఁ జేయుండనుచుఁ జనుపురందరునిహస్తప్రకరణంబునం బొడమినకారణగుణంబునంబలె నుచ్చావచవాద్యధరుల తిమ్మటపటహభేరిభాంకారంబు లంబరతలంబున నిగుడుదివిజమురజరావమ్ములతోడంగలసి నికటతటరైవతకశైలవిశాలగుహాగేహసందోహవిదళనాటోపంబు నాపాదింప సకలజనహృదయకుహరంబుల సమధికప్రవీణతంజేసి నానా

విధంబు లగురూపంబుల మెలంగుచాతుర్యంబు నిజప్రసాదంబునం గన్నవైశ్వానరుండు విశ్వనియంతయయి తనపురోభాగంబున ననేకరూపంబుల నాశ్రయించి సేవించుచున్నవాఁడో యన సద్యోఘృతప్రదీపితజ్వాలాయుతంబు లగుకరదీపికాయుతంబులును సాంద్రప్రభాన్వితంబు లగుచంద్రజ్యోతులును నగ్నియంత్రంబులును విశ్వంభరావలయంబునం గలయం బర్వి పట్టపగలు గావింపఁ గంధర్వసుందరీసందోహంబులు వేనవేలుగూడిన నివ్విదర్భరాజకన్యకారత్నంబు గాలిగోరునసుం బోలం జాలరిదికనుంగొనుమని యరవిందసంభవుండు యదుకులధురంధరున కెఱుంగఁ జేసి మెచ్చు వడయుటకును దెచ్చెనో యనం గరకిసలయమ్ముల నిక్షుఖండంబులుం దాల్చి యనన్యకన్యాసామాన్య రూపలావణ్యభాజనంబు లగు వేశ్యాజనంబులుం ముంగల న్నడువ మాధవోత్సవసమయంబు గావున మాకందమాధవీమల్లికాదిలతావితానంబులు మానినీరూపంబులు దాల్చి కిసలయకుసుమఫలప్రముఖంబు లగుకానుకలం బూని చనుదెంచెనో యనం గొంద అరవిందగంధులు క్రంతలు దీరి హరివాణమ్ముల మాంగలికవస్తుసామగ్రిం బూని యంగభవసామ్రాజ్యాధిదేవతల తెఱంగున ముంగలం జనుదేర నవక్రతరమహాచక్రవైభవంబున విరోధిచక్రంబులం దునుముని మ్మహామహుని నూనసాయకంబుల సాధింపనలవి యగునే యని కుసుమకోదండుండు పుండరీకాక్షునిమీఁద నడరింప నిజమాయాప్రభావంబున సృజించినచంచలేక్షణారూపచక్రనియుతంబుల తెఱంగునం గ్రాలు జనవినిర్మితంబు లగుయంత్రచక్రంబుల సవ్యాపసవ్యమార్గంబులం బరిభ్రమించు మించుబోణుల విలోకించుజనలోచనాసేచనకభావం బంగీకరింప యనుపంబభూషణ భవదీయపరిణయమహోత్సవంబు నవలోకింపఁ గింపురుషగంధర్వప్రముఖబర్హిర్ముఖులు గగనాంగణంబునం బట్టుచాలక నెట్టుకొని యున్నవారు వీరిం గనుంగొను మని సారెసారెకుం జేతు లెత్తి చూపుగతి వందిమాగధు లున్నమితహస్తులై నిజబిరుదగాథాకథనప్రవీణతం దనర నపరిమితభక్తిభావంబునఁ బాదచారులై వచ్చునంగవంగకళింగకాశ్మీరలాట భోటాదిభూపతులచరణపల్లవంబులు మేదినీతలన్యాసంబునకుం దాళఁ జాలునే యని తదీయభాగ్యాధిదేవతలు సవరించిపఱచిన వెలిపట్టు పావడలవడువున జానుదఘ్నంబుగా నిగుడఁ బుణ్యపుణ్యాంగనాజనపరితఃప్రకీర్యమాణకుందమందారమాలికాప్రముఖకుసుమవిసరంబులు తారాపథంబున కడరి హరిచందనకుసుమలగ్నంబు లగు భృంగంబుల ధరాతలంబునకు నాకర్షింప న ట్లనన్యనృపసామాన్యవైభవంబున భోజవరపాలక బిడౌజుని నగరిహజారంబుఁ జేరం జనుసమయంబున.

శా. భోజక్ష్మావరుఁడాప్తబంధువులతోఁ ♦ బుణ్యాంగనాశ్రేణితో
లాజల్ పూవులునక్షతంబులునుగ్రమో ♦ లంజల్లుచుక్ వేడ్కమై
రాజీవాక్షు నెసుగ్గొనంగనతఁడుం ♦ బ్రాలేయశైలోన్నత
శ్రీఁజూపట్టుగజంబుడిగ్గబహువే ♦ త్రిధ్వానముల్ మీఱఁగక్. ౬౯.

గీ. ఇటులనైరావతముడిగ్గి ♦ కృష్ణుఁడపుడు, సాత్యకికరంబుఁగరమునఁ ♦ సంఘటించి
నృపతిమంత్రిజనప్రద ♦ ర్శితసమగ్ర, మార్గమునవామనగరుమ్రే ♦ మమునఁజొచ్చి.

క. భోజనరపాలుపనుప్రన, రాజీవాక్షుండుపద్మ ♦ రాగశిలాసం
యోజితవితర్దికాస్థలి, శ్రీఁజెలఁగెడుపెండ్లిపీఁటఁ ♦ జేరిముదమునక్. ౭౧.

క. కొనలుత్తరముగఁబఱచిన, కనకపుఁజేలమునసిరులు ♦ కన్పడులీలక్
నునుపెండ్లిపీఁటనెలకొనెఁ, గనకాంబరుఁడపుడుప్రేమ ♦ గడలుకొనంగక్. ౭౨.

క. మధుపర్కమొసఁగెభోజుఁడు, మధువైరికివిహితగతిస ♦ మగ్రపుభక్తిక్
బుధవర్యానీతంబగు, సుధచేనదుగులనుగడిగి ♦ శోభనలీలక్. ౭౩.

ఉ. బంగరుగిండివంచితన ♦ భామినితోయమువోయభోజరా
ట్పుంగవుఁడప్డురుక్మిణివి ♦ భూషితహస్తముఁగేలఁబట్టియ
య్యంగజకోటిసన్నిభున ♦ కర్మిలిమీఱఁగధారవోసెను
త్తుంగమృదంగవాద్యముల ♦ తోసురదుందుభులంటిమ్రోయఁగక్. ౭౪.

గీ. కాంచనాద్రివిచిత్రసం ♦ గతివిచిత్ర, బహుళరత్నపరిస్ఫూర్తి ♦ సహితమగుచుఁ
దనరుతెరవంచిరైదువల్ ♦దగుముహూర్త, సమయమిదిచేరెననిబృహ ♦స్పతివచింప.

క. గుడజీరకంబుల ర్మిలిఁ, బడఁతుకశిరమునఘటించెఁ ♦ బద్మాక్షుండ
ప్పడఁతుకయువిభునియౌదల, నిడియెక్ గుడజీరకమును ♦ విహితరీతిక్. ౭౬.

చ. అతులితభక్తిమైఁబ్రియవ ♦ యస్యలునెన్నడుమంటిపట్టిను
న్నతమునగెత్తముత్తెములు ♦ నాతిముదోయిటనుంచిపట్టియ
చ్యుతుతలఁబ్రాలువోసెమధు ♦ సూదనుఁడుందలబ్రాలువోసెన
య్యతివవనమ్మహోత్సవము ♦ నందఱుఁగన్గొనిరంతవేడుకక్. ౭౭.

క. గళమునఁగట్టెక్ హరిమం, గళసూత్రముసఖివిప్ర ♦ కాంతలుజయమం
గళముల్ బాడంగనన, ర్గళభేరీధ్వనులఁబుడమి ♦ కదునద్రువంగక్. ౭౮.

గీ. శ్రీజయమ్ములుమీకంచు ♦ సిద్ధమనుచు, తెలుపులీలఁబ్రదక్షిణా ♦ ర్చులఁజెలంగు
పావనవసుజగత్ప్రియం ♦ భావుకునకు, లాజలిప్పించెశౌరియా ♦ లలనపలన. ౭౯

మ. అలరంగై నవుజోదుక య్యమునమా ♦ యబ్జాక్షి పాదాంబుజ
మ్ములనీవంటుటయేమగర్గానముమే ♦ మంజాడ నేదిపద
మ్ములవంటన్న లెనంచుఁదత్సఖులుగా ♦ ఫుల్ గూడియాడన్ సతీ
తిలకంబంఘ్రితలంబుపస్నెకలుహా ♦ త్రొంచెన్ విభుండంతటన్. ౭౦.

గీ. కొంగుముళ్లతోడ ♦ నంగజజనకుండు, ప్రీతినాచరించెఁ ♦ బ్రియయుఁదాను
నాగమోక్తవిధుల ♦ ననలప్రదక్షిణ, ఋషివరాంగనాసి ♦ రీక్షణములు. ౭౧.

క. ధ్రువపదముఁ జెందిమనుమని, వివిధము లాదీ వెనలును ♦ వేద్యా నొసంగన్
ధ్రువపదముఁ గాంచెనయ్యా, దవముఖ్యుఁడులలనతోఁ ♦ దద్దయుఁబ్రీతిన్. ౭౧.

ఉ. శ్రీరతిభారతీసతుల ♦ చెల్వము గెల్వఁగనోపునీమహో
దారతిరమ్మగా నెదన ♦ హార్నిశముజ్ వసియింపగెల్వమి
దోరతివైభవస్ఫురణ ♦ ధూర్తులనంచుబుధుల్ వచింపఁగా
నారతియిచ్చిరప్పుడమ ♦ రాంగనలారతినైనితంద్రికిన్. ౭౨.

సీ. నడలకై ఁపులనొప్పు ♦ నగములోయివియంచు, జనులెంచఁదగుమత్త ♦ సామజములు
పగదీర్పగాడ్పుక్రిం ♦ దుగఁజేసినవ్వగాళి, పాటింపఁదగుమేటి ♦ ఘోటకములు
మేరుశృంగములెట్లు ♦ మెలఁగనేర్చె నొయంచుఁ, గనఁదగుఘనశతాం ♦ గములగములు
సౌదామినులకెట్లు ♦ చపలతవొలఁగెనో, యనమించుచున్నక ♦ న్యాజనమ్ము
లపరిమితరత్నరాసులు ♦ నమితకనక, భూషణనికరములునున ♦ పూర్వగంధ
బంధురద్రవ్యములునున ♦ ద్భక్తి మెఱయ, నల్లునకునిచ్చెభోజభూ ♦ వల్లభుండు.

క. సురమణులంతమకుఁగలభా, సురమణులన్వీడుచదువఁ ♦ జూచిన్నపాలు
ర్వరుస నొసంగిరితమతమ, కరిరథహయరత్నగుచిర ♦ కనకాంశుకముల్. ౭౪

గీ. శేషహోమాంతముగనిట్లు ♦ శ్రీసఖుండు, భోజకన్యావివాహంబు ♦ పూర్ణసరణిఁ
బ్రీతినెరవేర్చియుచితమా ♦ రీతిననిచె, నింద్రముఖులైనసకలబ ♦ ర్హిర్ముఖులను. ౭౫.

క. నానాదేశాగతులగు, భూనాయకులెల్లఁజనిరి ♦ పురములుచేరన్
శ్రీనాథునిచేతనుప, స్థానంబులుపడసిభటుల ♦ మాత్యులుగొలువన్. ౭౬.

శా. సింధుల్భాంశిమహానమల్ చెలఁగెరం ♦ జిల్లెన్ ద్రుమంబుల్లప
ద్గంధంబుల్ విపఁజెన్ సమీరములువే ♦ ద్యాన్నేళముల్గాదెఁచున్

గంధర్వుల్దివిఁబాడియాడిరిమరు ♦ త్కాంజాతపత్రేక్షణల్
ధింధింధిక్కిధిమిక్కిధి త్తికధితోం ♦ ధీయన్ని నాదమ్ములన్. ౮౩.

వ. ఇట్లు సకలలోకేశ్వరుండును సనకసనందనాదిమహాయోగిజనసంస్తూయమానసాంద్రతరవిభవుండును నగునయ్యదుకులేశ్వరుండు భోజకన్యావివాహంబు విహితప్రకారంబున నంగీకరించి యయ్యరవిందగంధితోడ నిజమందిరప్రవేశం బాచరించి గురుబుధసమాజంబు నుచితం బగుతెఱంగునం బూజించి బంధుజనంబు లగునందకుకురముఖవసుంధరాధురంధరులకు సింధురాశ్వాంగాదిప్రదానంబుల నపరిమితసత్కారంబులఁ బ్రహర్షంబు సంఘటించియు మిత్రవర్గంబులకు ధాత్రీతలవిచిత్రంబు లగుభవ్యవస్తుసందోహంబుల నొసఁగియును గాయకభరతవందిమాగధప్రముఖసేవకజనులకు ధనకనకవస్త్రవాహనాదిప్రదానంబున నింపు సంపాదించియును విద్యావిశేషంబుల మెఱయు విబుధజనంబులం దనియించియును మఱియునుం దక్షిణయాచకజనంబుల మనోరథంబులు సఫలంబు గావించియు విశ్వజనవిస్మయావహవితరణకళాధురంధరుండై వెలయు చుండె. ౮౮.

సీ. బహుసస్యసంపూర్తిఁ ♦ బరిఢవిల్లెధరిత్రి, నెలమూఁడువానలు ♦ నిండికురిసె
ఘృతదధిక్షీరాబ్ధి ♦ వృద్ధిమందనుగల్గె, నన్యోన్యవైరంబు ♦ లడఁగెధరణి
నిచ్చఁగల్యాణంబు ♦ పచ్చతోరణమయ్యెఁ, బ్రజలెల్లనుత్సవ ♦ పరతమనిరి
యారోగ్యభాగ్యంబు ♦ లభివృద్ధివహియించెఁ, గ్రహగణంబనుకూల ♦ గతులఁదిరిగె
జారచోరాదిబాధాప్ర ♦ సంగముడిగె, భూరుహంబులుసతతంబు ♦ పూచికాచి
చెలఁగిఫలియించిశుకవృత్తి♦నలరుచుండెఁ, గృష్ణదేవుఁడుసామ్రాజ్య ♦ మేలుచుండ.

వ. అని యివ్విధంబున రుక్మిణీకల్యాణంబు శుభవచనరచనాచమత్కారపూర్వకంబుగాఁ జెప్పిన యప్పరమయోగీంద్రునకుం బ్రణమిల్లి పరీక్షిత్తితీశ్వరుండు కృతార్థుండనైతి నని యమ్మహామహుని సముచితప్రకారంబునం బూజించె నంత. ౮౦.

మ. బలిగేహప్రతిహారహారమయశం ♦ భచ్చిత్రడోలాలస
జ్జలజాగారవిహారహారనుసేవా ♦ క్చాతుర్యమాధుర్యపు
ష్కలితప్రీత్యవతారతారణకళా ♦ సంరంభదీక్షాసమ
జ్జ్వలచిత్తప్రవిచారచారణమహా ♦ శ్చర్యావహప్రాభవా. ౮౧.

క. శ్రీరంగహర్మ్యనిలయా, సారంగవరావనప్ర ♦ సక్తఘనదయా
పారంగతభక్తచయా, స్వారంగానీతదివ్య ♦ సాభ్యుదయా. ౮౨.

పంచచామరము. కనన్మణీఘృణిప్రకాండ ♦ కాళియాహిమస్తక
ప్రణృత్యక్లృప్తతాళభేద ♦ పాటవప్రపంచకా
ఘనాఘనద్యుతిప్రకాశ ♦ గంధవారణక్రియా
వినోదభృత్తనూవిభాభ ♦ విష్ణుదివ్యసౌరభా. ౯౩

గద్య. ఇది శ్రీమన్మదనగోపాలశాశ్వతకటాక్షవీక్షణావాప్త చతురతరసాహితీవైభవ చక్రపామాత్యతనూభవ మంగమాంబాగర్భశుక్తిముక్తాఫల మార్గణవిశ్రాణిత మహాఫల కోవిదనుతభాగధేయ కోటీశ్వర నామధేయప్రణీతంబైన భోజసుతా పరిణయంబను మహాప్రబంధంబునందు సర్వమ్మును బం[illegible]్వాసము.

స మా ప్త ము.

